శ్రీ సదాశివబ్రహ్మేంద్రస్వామి విరచిత

# శ్రీ పాతంజలయోగసూత్రములు

సవిభాగ, ప్రతిపదార్థ, తాత్పర్య, విశేషార్థములతో

## యోగసుధాకరాస్వాద సహితము

వ్యాఖ్యాతా:

శ్రీ మహర్షి మలయాళ సద్గురుస్వాములవారి అంతేవాసియగు

## శివచరణము

మొదటి కూర్పు : 1000 ప్రతులు

శ్రీ వేదవ్యాస ముద్రాక్షరశాల, చిత్తూరు

దీని వెల | [illegible] | రు. 1-8-0.

వలయువారు క్రింది విలాసమునకు వ్రాసి [illegible]:—

శ్రీ వ్యాసాశ్రమము (పోస్టు), యేర్పేడు, (చిత్తూరుజిల్లా)

ఓమ్

# అకారాదిసూత్రానుక్రమణిక

పురాతనః" అను యాజ్ఞవల్క్య స్మృతి వాక్యము వలనను, "అథ యోగానుశాసనమ్" అను పతంజలిమహర్షి సూత్రము వలనను, మొదట యోగశాస్త్రమును హిరణ్యగర్భుడు రచించెననియు, దానిని సులభావబోధకమగు యోగదర్శనరూపమున శ్రీ పతంజలిమహర్షి సంగ్రహముగ రచించెననియు తెలియంగవలయును.

అనాది మాయాబంధమునుండి విడివడి పరమానందరూపముక్తిని సర్వదా వాంఛించు ఆత్మస్వరూపులగు ముముక్షువులారా! "తీవ్రసంవేగానామాసన్నః" అను పతంజలిమహర్షి సూత్రానుసారము, దృఢశ్రద్ధాద్యధికోపాయములుగల యోగులలో శీఘ్రసమాధిలాభము కలుగును. యెడతెగని ఇచ్ఛాప్రాబల్యముగలవారలకు సమాధిలాభము శీఘ్రముగా నగును. కాన మాయాజాలమునందు పడిపోక, ప్రమాదము జెందక, సుస్థిర వైరాగ్యమును సంపాదింపుడు, సంపాదింపుడు. బ్రహ్మానందసామ్రాజ్యము లభించును. మఱియు నీ యోగదర్శనము [illegible] ములలోనికి తిన్నగా జారిపోక పరమలక్ష్యమందు సుస్థిరముగ నుండువిధమున బోధించినదో ఆ విషయమును మనము నిరంతరము జ్ఞాపకముంచుకొనవలయును.

యోగమనగా నేమి? దీనిని విచారింతము. యోగమునుగూర్చి యోగశిఖ, యోగచూడామణి మొదలగు నుపనిషత్తులును ప్రతిపాదించుచున్నవి. కఠోపనిషత్తునందు

"యదా పంచావతిష్ఠన్తే జ్ఞానాని మనసా సహ।
బుద్ధిశ్చ న విచేష్టతి తామాహుః పరమాంగతిమ్॥
తాం యోగమితి మన్యన్తే స్థిరామిన్ద్రియధారణాం।
అప్రమత్తస్తదా భవతి యోగో హి ప్రభవాప్యయౌ॥"

అని ప్రతిపాదించుచున్నది. ఇతరత్ర యోగశాస్త్రము లనేకములుగలవు. శ్రీ భగవద్గీతా శాస్త్రమున్ను ప్రతి అధ్యాయమును యోగముగా గ్రహించినది. అట్లు భగవంతు లును యోగము నుద్దేశించి బహుళముగా ప్రతిపాదించుచున్నవి. ఈ ప్రకారము సకల శాస్త్రములలోను యోగస్వరూపమును విచారించి యోగమనగా మనోనిగ్రహము, మనో నైశ్చల్యము అను సాధారణముల నర్థము నిర్ధారించుచున్నవి. చిత్తమున వృత్తిశూన్యము నుత్పాదించు చున్న చిత్తశుద్ధి, చిత్త నిశ్చలభావము గలుగవు. మఱియు నీయోగము నుద్దేశించి జీవ బ్రహ్మైక్యమే యోగమను విశేషార్థమును నుపనిషత్తులు దెలుపుచున్నవి. ఈ యర్థమునే

యోగముయొక్క పరమకాష్ఠ యని వేదాంతులు దెలుపుచున్నారు. ఈ యర్థమునంతయు గుర్తెరింగి యథార్థతత్త్వజ్ఞులును యోగస్వానుభవులును శ్రీ పతంజలిమహర్షి యోగతత్త్వమునుగూర్చి యీ ప్రకారము సూత్రీకరించిరి: "యోగశ్చిత్తవృత్తినిరోధః" యోగమనగా చిత్తవృత్తులను నిరోధించుట. వృత్తులన్నియు నిరోధోపాయముచే నిరుద్ధములై పూర్తిగా నాశమొందగా ఆత్మ నిరావరణమై ప్రకాశించుచున్నది. ఈ విషయమును "తదా ద్రష్టుస్స్వరూపే అవస్థానం" అను మూడవ సూత్రముచే స్పష్టపరచియున్నారు. ఈ రెండు సూత్రములచేతనే యోగస్వరూపమును యోగఫలితమును శ్రీ పతంజలిమహర్షి దెలిపియున్నారు. దీర్ఘముగా యోచించిన శ్రీ పతంజలిమహర్షి దెలిపిన యోగతత్త్వము సకలోపనిషత్తులయొక్కయు, సకలయోగశాస్త్రములయొక్కయు సారాతిసారమైయున్నది. పతంజలి యోగసూత్రము ప్రవర్తించిన తరువాతనే నేడిగల యోగశాస్త్రములు దాని నాధారముగ గైకొని యనేకములుగ ప్రవర్ధిల్లినవనియు దెలియవలెను. వృత్తులువినా చిత్తమనునది మరియొకటి లేదు. వృత్తులు నశించునప్పుడు చిత్తముగూడ లయమొందుచున్నది. అప్పుడు ఆత్మ నిరావరణమై స్వయంప్రకాశమానమై యుంటు

చిత్తము నాత్మలో నైక్యముచేయుటే యోగమని యోగశాస్త్రజ్ఞులు తెలుపుచున్నారు. ఇంకను యోగమనగా యుక్తియని అర్థము. అందుచే యోగమన ఉపాయము, సాధనము మొదలగు పదములచే చెప్పబడుచున్నది. దీనినిబట్టియే శ్రీభగవద్గీతా శాస్త్రము పరమాత్మ తత్త్వజ్ఞానమునకై పలువిధములైన యోగములతో (సాధనలతో) గూడినదని వచించుచున్నారు. ఆ ప్రకారముగనే మతమొన్ని గీతలుంటున్నవనియు దెలియవలెను. పైన దెలిపిన ప్రకారముగ యోగవిషయమును విచారించితిమి.

ఇక యోగవిషయమున "యోగము చేత ముక్తి గలుగుచున్నది" అను అంశమును గూర్చి తెలిసికొందము.

శ్లో॥ అసాధ్యః కస్యచిద్యోగః కస్యచిజ్ఞాననిశ్చయః ।
ప్రకారౌ ద్వౌ పురా దేవో జగాద పరమేశ్వరః ॥

తా॥ ఒకానొకనికి యోగమసాధ్యముగ నుండును; మఱియొకనికి జ్ఞానము సాధ్యముగ నుండును. కావున పరమేశ్వరుడు పూర్వమే రెండు మార్గముల నుపదేశించెను. ఈ ప్రకారము యోగవాసిష్ఠము దెలుపుచున్నది.

శ్లో॥ జ్ఞాననిష్ఠో విరక్తోఽపి ధర్మజ్ఞోఽపి జితేన్ద్రియః।
వినా యోగేన దేవోఽపి న మోక్షం లభతే ప్రియే॥

తా॥ ఈశ్వరుడు జ్ఞానసంకలినియను పార్వతీదేవికిట్లుపదేశించెను. ఓ దేవీ! జ్ఞాననిష్ఠుడైనను, విరక్తుడైనను, ధర్మజ్ఞుడైనను, జితేంద్రియుడైనను, కట్టకడకు దేవుడైనను యోగసాధన లేక మోక్షము లభించదు.

మఱియు యోగముతో జ్ఞానము గలుగుటను వివరణమును చూడుడు.

శ్లో॥ ఆత్మజ్ఞానేన ముక్తిః స్యాత్తచ్చ యోగాదృతే న హి।
యోగాగ్నిర్దహతి క్షిప్రమశేషం పాపపంజరమ్।
ప్రసన్నం జాయతే జ్ఞానం జ్ఞానాన్నిర్వాణమృచ్ఛతి॥

తా॥ యోగముచే జ్ఞానముత్పన్నమగుచున్నది. అట్టి జ్ఞానము యోగమును వృద్ధి పొందించుచున్నది. యోగాగ్ని త్వరితముగనే పాపపంజరమును దహింపజేయుచున్నది. అందుచే హృదయము శుద్ధమగును. అట్టి శాంతముచే ఆత్మజ్ఞాన ముదయించును. దాని వలన నిర్వాణమును పొందుచున్నాడు. ఆత్మ యెట్టిదని తెలియక పరమలక్ష్యమగు ఆత్మ

యుండనట్లు మనస్సును నిశ్చలముగఁ జేసి లయ మొనరించనిచో యోగము సిద్ధించును? కావున యోగమునకు ఆత్మస్వరూపజ్ఞానము ఆవశ్యకమై యున్నది. అట్లే ఎట్లు మనస్సును నిశ్చలముగను నిర్మలముగను జేసికొనక గమ్యమగు ఆత్మస్వరూపమును దెలియును? కావున జ్ఞానమునకు యోగమవసరమై యున్నది. ఈ ప్రకారము యోగజ్ఞానములు రెండును పరస్పరము సమ్బద్ధించినవై యున్నవి. యోగము లేక జ్ఞానము సిద్ధించదు. జ్ఞానము లేక యోగసిద్ధియు గలుగదు. ఇంకను విచారించిన యోగజ్ఞానములు రెండును పర్యవసానమున నొకేయర్థమును దెలుపును నేకరూపములై యున్నవి.

"వృత్తిహీనం మనః కృత్వా క్షేత్రజ్ఞం పరమాత్మని ।
ఏకీకృత్య విముచ్యేత యోగోఽయం ముఖ్య ఉచ్యతే ॥

ఈ ప్రమాణము జీవబ్రహ్మైక్యమే యోగమని తెలుపుచున్నది. జీవుని పరమాత్మనుగా దెలియుటయే జ్ఞానమగును. కావున యోగజ్ఞానములు రెండు నేకరూపములై యున్నవి.

ఇక యోగసిద్ధి విషయము నందలి [illegible] యోగసిద్ధినిగూర్చి శ్రీ వేదవ్యాస భగవానులు భాష్యమును రచించియున్నారు. [illegible] మహాత్ములు వ్యాఖ్యానములు వ్రాసియున్నారు. [illegible] శ్రీ కావేరీతీరనివాసులును మహాయోగీశ్వరులును శ్రీ సదాశివబ్రహ్మేన్ద్రస్వాములవారును యోగసిద్ధాన్తమును యోగసుధాకరమను పేరుతో చెప్పబడుచున్న యోగసూత్రవృత్తిని వ్రాసిరి. ఈ సిద్ధాన్తవ్యాఖ్యానము యోగసూత్రములకు శ్రీ వేదవ్యాసభాష్యమువలె భాష్యరూపమున నలరుచున్నది. ఈ సదాశివబ్రహ్మేన్ద్రస్వామి యోగసుధాకరభాష్యము సంక్షిప్తముగను నిస్సందిగ్ధముగను మనోజ్ఞముగ నున్నది. సాధకులకు ఎంతగనో యుపకరించునదిగ నున్నది. ఈ మహాత్ముడు మహాపండితుడు, మహావైరాగ్యనిధి, అనుపమప్రభావసమ్పన్నుడు, యోగీశ్వరుడు. ఈ మహనీయాత్ముని జీవితమును సంగ్రహముగ తెలిసికొందము.



శ్రీ సదాశివబ్రహ్మంబని ప్రఖ్యాతిగాంచిన శ్రీ సదాశివేన్ద్రసరస్వతీస్వాములవారు కావేరీ నదీతీరమున సంచారము చేయుచుండెడువారు. ఏకసంతగ్రాహులగుటచే బాల్యమునందే సకలవిద్యాపారంగతులయిరి. వీరు పాఠశాలనుండివచ్చిన తరువాత ప్రత్యేకముగ నొక

శేషుండు భూమియందవతరించుటకై పవిత్రస్థానమును అన్వేషించుచు, గోనర్దదేశములో నొకాశ్రమమందు పుత్రునికొఱకై సూర్యభగవానుని నేకాగ్రమనమునంజేసి యారాధించుచున్న గోణికాయను పేరుగల తపస్విని (తాపసురాలిని) గాంచెను. తదనంతరము గోణికాతపస్వినియొక్క నిరుపమ తేజఃప్రతిభయుచే నాకర్షింపఁబడినవాఁడై యాట శేషుండు పూతచరితయగు నా తాపసురాలిని తన జననిగా భావించి సూర్యునకు నర్ఘ్యమిచ్చు సమయమున నామె అంజలిని ప్రవేశించెను. తరువాత ఆమె యర్ఘ్యమును సూర్యభగవంతునకు నొసంగగనే అప్పుడే తాను తాపసాకృతిని ధరించి జలముతోఁగూడ క్రిందపడెను. వెంటనే ఆ తాపసురాలు తేజఃపుంజముతో నొప్పుచు బాలసూర్యునివలె ప్రకాశించుచున్న యబ్బాలునిఁ జూచి నాయొక్క పూర్వజన్మ సుకృతసంచయవిశేషముచే నావిర్భవించిన నాతనయుండితఁడేయని భావించి అంజలియందు పడినందున పతంజలియని పవిత్ర నామధేయమును నా బాలునకు నిడెను. తరువాత తేజోనిధియగు నా పతంజలి చిరకాలము పరమేశ్వరునిగూర్చి తపమొనరించి మహర్షిసత్తముండై వ్యాకరణభాష్యమును విరచించెను. ఆ పతంజలిమహర్షియే వైద్యశాస్త్రము మొదలగు దివ్యగ్రంథ

ఇట్లుండగా నా(గ)మునకు తమ పాండిత్యమునన్ని ధ్వనించు వినిపించి, యోగ దర్శన వ్యాఖ్యానముల ననేకములుగా జదివి సారమును గ్రహించిన మహనీయాత్ములగుటచే శ్రీ సద్గురుదేవులు, పరమహంసయోగీశ్వరులును నైన గాయత్రీమహాత్మ్యము సిద్ధాయధిష్ఠించి నిర్విఘ్నుడై యుండునట్లు నైనట్టి శ్రీ సదాశివబ్రహ్మేంద్రస్వాములవారిచే వ్రాయబడిన యోగసుధాకరమను యోగసూత్రముల భాష్యము నాంధ్రీకరింప సాహసించితిరి. కావున శ్రీ సద్గురుదేవుని పరమకృపయే యోగసుధాకరభాష్యమునకు, యోగసుధాకరాస్వాదమను ఆంధ్రవ్యాఖ్యానమును ప్రసాదింప జేసినది. నా ప్రజ్ఞ యిసుమంతయు లేదు. ఈ యోగసుధాకరమను భాష్యమునకు కర్తలగు శ్రీసదాశివబ్రహ్మేంద్రులు మహాతార్కికశిరోమణులగుటయేగాక మహా ప్రజ్ఞావంతులుగాన ఆ భాష్యము కేవల గురుతర గాఢమై తార్కికపద్ధతి ననుసరించి పండితులకుమాత్రము గ్రాహ్యమగునటుల యున్నది. దాని నంతయు శ్రీ సద్గురుదేవుని కృపాతిశయముచే యథాశక్తి తెలుగున యోగసుధాకరాస్వాదమును వ్రాసినాడను. మఱియు నీభాష్యము ముముక్షుజనులకు చాలా యుపయోగకారిగా నున్నది. సూత్రార్థములు సంక్షిప్తములుగ ప్రతిపాదించదగిన విషయమున

ఓమ్

శ్రీ సద్గురుభ్యో నమః

శ్రీ శివానంద మహర్షిభ్యో నమః

# శ్రీ పాతంజల యోగ సుధాకరము

## యోగసుధాస్వాద సహితము



### ప్రార్థన

శ్లో॥ యోగేన చిత్తస్య పదేన వాచాం
మలం శరీరస్య చ వైద్యకేన।
యోఽపాకరోత్తం ప్రవరం మునీనాం
పతంజలిం ప్రాంజలిరానతోఽస్మి॥

తా॥ ఏ మునిపుంగవునిచే సమస్త లోకములకు (ప్రసిద్ధములు) లగుచున్న మనస్సు వాక్కు శరీరము వీటియొక్క మలములు (1) యోగశాస్త్ర, (2) మహాభాష్య, (3) వైద్య శాస్త్రముల ద్వారా తొలగింపబడెనో, అట్టి పతంజలిమహామునియొక్క స్తుతించబడగిన పద ద్వంద్వమునకు నేను నమస్కరించుచున్నాను.

~~~~~~~~~~

# గ్రంథారంభము

## సూ॥ అథ యోగానుశాసనమ్. 1

పదచ్ఛేదము॥ అథ — యోగానుశాసనమ్.

అర్థము॥ యోగానుశాసనమ్ — యోగ = సమాధియొక్క (యోగముయొక్క), అనుశాసనం = అనుసరించి శాసించుట (వ్యాఖ్యానము చేయుట), అథ = ప్రారంభించబడుచున్నది.

తా॥ ఇచ్చట 'అథ' శబ్దము మంగళమును సూచించుచున్నది. కనుక మంగళము గూడ చేయబడినటులాయెను. యోగశబ్దము 'యుజ సమాధౌ' అను ధాతువువలన కలిగినది.
~~~~~~~~~~

పింపబడునది, (2) మూఢమనగా తమోగుణ స్వభావముగ నిద్ర ఆలస్యము మొదలగు వృత్తులతో గూడినది, (3) విక్షిప్తమనగా కొంచెము రజస్తమోగుణములచే కూడుకొనిన సత్త్వగుణముచే అప్పుడప్పుడు ధ్యానమునకు ప్రవర్తించునది. ఇది క్షిప్తమూఢములకంటె శ్రేష్ఠమైనది. (4) ఏకాగ్రమనగా కొంచెముకూడ రజస్తమోగుణములు లేక కేవల శుద్ధ సత్త్వగుణములచేత ఏకాగ్రతను పొందునది, (5) నిరుద్ధమనగా సకల వృత్తులు నశించి సంస్కారము మాత్రము మిగులునది. మొదలు క్షిప్తము, మూఢము, విక్షిప్తము ఈ మువ్విధములగు చిత్తధర్మములను వదలి మిగిలిన ఏకాగ్రము, నిరుద్ధము అను ఈ రెండు చిత్తధర్మములలో ఏకాగ్రముచేత సంప్రజ్ఞాత సమాధియు, నిరుద్ధముచే అసంప్రజ్ఞాత సమాధియు సిద్ధించుచున్నవని తెలియవలయును. ఎంతవరకు గుణత్రయము మారుచున్నదో, అంతవరకు చిత్తమున వృత్తులు గలుగుచునే యుండును. కడపటిదగు నిరుద్ధమున ఏ వృత్తులు లేకపోవుటచే గుణములు గూడ నుండవని తెలియదగినది. ఈ సమాధి ద్వయమునుగూర్చి యుత్తరత్ర విపులముగా చెప్పెదరు.

**సూ॥ యోగశ్చిత్తవృత్తినిరోధః.** 2

సూ॥ తదా ద్రష్టుః స్వరూపేఽవస్థానమ్. 3

పద॥ తదా - ద్రష్టుః - స్వరూపే - అవస్థానమ్.

అర్థము॥ తదా = అప్పుడు, ద్రష్టుః = చూచువాడగు ఆత్మకు, స్వరూపే = తన రూపమునందే, అవస్థానం = ఉండుట.

తా॥ బుద్ధివృత్తి స్వభావములైన చిత్తవృత్తులు నిరోధింపబడగా ఆత్మస్థితి అప్పుడెట్లుండునని కొందఱడుగుదురు [illegible]. అట్లే ఆత్మ బుద్ధివృత్తులతో కలిసినప్పుడు వ్యవహారమెట్లుండును [illegible]. సకల వృత్తినిరోధమునందు ఆత్మస్థితి యెట్టిదో దానిం దెలుపుచున్నారు.

సకల వృత్తులు నశించినపిదప గాని ఉపాధిసంబంధము దూరముగాగానే స్ఫటికమణి వలె ఆత్మ తన స్వభావమగు స్వరూపమునందు నిలువగలిగియుండును. ఆత్మకు స్వభావము చైతన్యము మాత్రమే, వృత్తులుగావు. ఇచ్చట సకల వృత్తుల నిరోధము చెప్పబడినది. కాన నిర్బీజసమాధి యనబడు అసంప్రజ్ఞాత సమాధి స్థితిని తెలిపిరి. ఇదియే నిరుద్ధము.

## సూ॥ వృత్తిసారూప్యమితరత్ర. 4

పద॥ వృత్తిసారూప్యం - ఇతరత్ర.

అర్థము॥ ఇతరత్ర — సమాధికన్న భిన్నమగు వ్యుత్థానావస్థయందు, వృత్తిసారూప్యం — వృత్తులయొక్క సమానరూపత్వము (వృత్తులతో అభేదము) (ఆత్మకు కలుగుచున్నది.)

తా॥ సమాధియందు ఆత్మయొక్క స్వరూపస్థితి నిరావరణమైనదని చెప్పి వ్యుత్థాన కాలమున వ్యవహారదశలో ఆత్మయొక్క స్వరూపస్థితిని దెలుపుచున్నారు. ఆత్మ వ్యుత్థానకాలమునను స్వరూపముండి జారుటలేదు. ఒకప్పుడు స్వరూపస్థితియుండుట మరియొకప్పుడు లేకుండుట అని చెప్పిన అఖండాత్మ యథార్థముగా నిరావరణముగా భాసించునని చెప్పుటకు సాధ్యము గాదు. అట్టిదానికి నిరావరణ జ్ఞానము కలుగలేదనియే తెలియవలయును. ఆత్మ యెప్పుడు నిర్వికారమైనది, సదా స్వరూపమునందే యుండుచున్నది. వృత్తి నిరోధము గలిగినపు డిట్టి స్వయంప్రకాశమానత్వము స్పష్టమగుచున్నది. ఇతర వృత్తులతో గూడినపుడు, ఆత్మకు అచ్చోట ప్రతిఫలించినప్పుడు వృత్తులు ఆత్మ ప్రతిబింబము అభేదములని గ్రహించుటచే అప్పుడాత్మకు జపాకుసుమముచే రక్త

మైనదివలెనున్న స్ఫటికమణివలెన్ వృత్తితాదాత్మ్యమును పొందినదివలె నగును. ఇందువలన ఆత్మ స్వరూపమునుండి జారుటలేదు. ఇందుచేత 3, 4 సూత్రములలో చెప్పిన అర్థము సంగ్రహింపబడెను. ఇందుచే సిద్ధించినది యేమనగా, వృత్తులు లేనప్పుడు ఆత్మశక్తి స్వరూపమునందుండుటయు, వృత్తులుండునప్పుడు ఆత్మశక్తి మరుగుపడియుండుటయు సంభవించుచున్నది. ఇదంతయు చిత్తముయొక్క ధర్మములే. ఆత్మ యెప్పుడును నిర్వికారము, ఎప్పుడు నేకముగా నున్నది. ఈ ప్రకారము 'చిత్తం' అను పదము వ్యాఖ్యానము చేయబడెను.

సూ॥ వృత్తయః పంచతయ్యః క్లిష్టా అక్లిష్టాః. 5

పద॥ వృత్తయః - పంచతయ్యః - క్లిష్టాః - అక్లిష్టాః.

అర్థము॥ వృత్తయః = మనఃపరిణామములు, పంచతయ్యః = అయిదు మాత్రమే, (తాః = అవి,) క్లిష్టాః = క్లిష్టములనియు, అక్లిష్టాః = అక్లిష్టములనియు (చెప్పబడుచున్నవి.)

అవతారిక॥ ఇప్పుడు నిరోధింపదగిన వృత్తులను నిరూపించుచున్నారు.

తా॥ చిత్తవృత్తులు క్లిష్టాక్లిష్టములుగా నున్నవి. అవి ప్రమాణాదులు. ఆ వృత్తులు అవిద్యాది క్లేశములతో గూడుకొని ప్రవృత్తిమార్గమునకు సాహాయ్యపడునవి క్లిష్టములనియు, అవిద్యాది క్లేశములతో గూడుకొనక నివృత్తిమార్గమునకు సాధనమైనవి అక్లిష్టములనియు వచింపబడును. ఈ యైదువిధ ప్రమాణాదులలో నే క్లిష్టవృత్తులు, అక్లిష్టవృత్తులు నుండున్నవి. అయినను అక్లిష్టవృత్తులను నిరోధించుటకు క్లిష్టవృత్తులతో అక్లిష్టవృత్తులనుగూడ నిరోధింపవలయునని భావము. క్లిష్టవృత్తులు అని చెప్పుటచేత ప్రయోగము మైత్రీ మైత్ర్యాది చిత్తవృత్తులనుగూడ సాధింపనేయవలెనని తాత్పర్యము.

సూ॥ ప్రమాణవిపర్యయవికల్పనిద్రాస్మృతయః. 6

పద॥ ప్రమాణవిపర్యయవికల్పనిద్రాస్మృతయః.

అర్థము॥ ప్రమాణ-విపర్యయ-వికల్ప-నిద్రా-స్మృతయః = (1) ప్రమాణము, (2) విపర్యయము, (3) వికల్పము, (4) నిద్ర, (5) స్మృతి (ఇవి పంచ చిత్తవృత్తులు.)

అవ॥ ఆ పంచ మనోవృత్తుల నామధేయమును లక్షణమును ఆరు సూత్రములచేత నుడువుచున్నారు.

తా॥ ఈ సూత్రమున వృత్తులు [illegible] వేరు వృత్తులు లేవని తాత్పర్యము. (1) ప్రమాణము, (2) విపర్యయము, (3) వికల్పము, (4) నిద్ర, (5) స్మృతి. ఇవి పంచవృత్తులు.

7

## సూ॥ ప్రత్యక్షానుమానాగమాః ప్రమాణాని.

పద॥ ప్రత్యక్షానుమానాగమాః — ప్రమాణాని.

అర్థము॥ ప్రమాణాని = ప్రమాణములు, ప్రత్యక్షానుమానాగమాః = (1) ప్రత్యక్షము, (2) అనుమానము, (3) ఆగమము.

తా॥ ప్రత్యక్షము, అనుమానము, ఆగమము అను యీ మూడే ప్రమాణములు అని భావము. చిత్తవృత్తియందు తెలియబడని పదార్థముల నవగాహనము జేయు చితిశక్తి యొక్క (ఆత్మ కళ్లకు) ప్రతిబింబము ప్రమా (జ్ఞానము) యనబడును. దానికి హేతువగు వృత్తియే ప్రమాణము; ప్రమాణమనగా (తెలియబడని దానిని తెలిసికొనుటకు సాధనమగుట) ప్రమాణ సామాన్య లక్షణము. ఆ ప్రమాణములలో నేత్రాదిజ్ఞానములద్వారా వస్తువులను నిర్ధారణజేయు చిత్తవృత్తి ప్రత్యక్షప్రమాణ మగును. అట్టి వస్త్వాకారక చిత్తవృత్తియందు

కొంచెముగూడ తెలియనట్టి అస్పష్టమైన అవస్థయందున్నందున నిద్రయు చిత్తవృత్తియే యగును.

## సూ॥ అనుభూతవిషయాసంప్రమోషః స్మృతిః. 11

పద॥ అనుభూతవిషయాసంప్రమోషః — స్మృతిః.

అర్థము॥ అనుభూతవిషయాసంప్రమోషః — అనుభూతవిషయ = అనుభవింపబడిన విషయములయొక్క, అసంప్రమోషః = మరువకుండుట, స్మృతిః = స్మృతియను చిత్తవృత్తి యగును.

తా॥ ఇదివరకు అనుభవింపబడిన శబ్దాదివిషయములను స్మరించుట స్మృతి యనబడును. అనుభవజన్యజ్ఞానము స్మృతి. "వృత్తయః పంచతయ్యః—" అను సూత్రము మొదలు చేసికొని "అనుభూతవిషయా—" అను నీ సూత్రమువఱకు "యోగశ్చిత్తవృత్తినిరోధః" అను సూత్రములోని వృత్తిపదమును గూర్చి వ్యాఖ్యానముగా చెప్పి కాని, వాటి భేదములను వివరించిరని తెలియవలయును. ఇక మిగిలిన నిరోధపదమును గ్రహించి ముందు చెప్పబడిన వృత్తులన్నింటిని నశింపజేయవలయునని భావము. ఇదియే యోగము.

అవ॥ ఓయీ! ఇప్పు డనుష్ఠింపబడుచున్న యభ్యాసము సమాధ్యభ్యాసము. అది స్వాయముగా దృఢము కాలేదు. అదెటుల ననాదిసంచిత ప్రబలసంస్కారములను నిరోధించును? అను సందేహముయొక్క నివారణము జేయుచున్నాడు.

తా॥ ఒకానొక మందయోగి కొలది దినములలో లేక కొన్ని మాసములలో సమాధిసిద్ధిని గోరుచున్నాడు. వాడెటువంటివాడనగా నాలుగు వేదములను నభ్యసించుటకు నొక బ్రహ్మచారి గురువుకడకు జనెను. ఐదు దినములు గడచెను. ఇంకను నా బ్రహ్మచారి రాలేదు అని యాలోచించు మూఢునివలె నాయోగియు నగును. ఇందువలన ననేక సంవత్సరముల పర్యంతము లేక జన్మలపర్యంతము దీర్ఘకాలము యోగము సేవింపవలయును. ఇందులకు భగవద్గీతాస్మృతి 'అనేకజన్మసంసిద్ధస్తతో యాతి పరాంగతిమ్' అనేక జన్మములకు సంసిద్ధుడై పరాగతిని బొందుచున్నాడు. మరియు చిరకాల మభ్యాసము జేయుచుండినను, మధ్యమధ్య విడచి విడచి యభ్యాసము జేయుచుండిన నప్పుడప్పుడు గలుగు యోగసంస్కారములు తద్విరుద్ధ వ్యవహార సంస్కారములచే నశించును. కనుక అభ్యాసము నెడతెగక జేయుచుండవలయును. మరియు నాదరముతో నద్దాని నాచరింపవలయును. ఆదరము లేకుండిన యోగవిఘ్నములగు లయ విక్షేప కషాయాదులు సంభ

వించును. కావున నభ్యాసము దీర్ఘకాలముతో నైరంతర్యముతో ఆదరముతో నాచరింపవలయును. అప్పుడది సుస్థిరత గాంచును. దృఢభూమియనగా పెద్ద పెద్ద కొండలవంటి దుఃఖములు వచ్చిపడినను చలింపకుండుట. అందులకు గీతాస్మృతి "యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే" = గొప్ప దుఃఖముచేత గూడ ఆ యోగమందుండి చలింపబడడు.

## సూ॥ దృష్టానుశ్రవికవిషయవితృష్ణస్య వశీకారసంజ్ఞా వైరాగ్యమ్.15

పద॥ దృష్టానుశ్రవికవిషయవితృష్ణస్య - వశీకారసంజ్ఞా - వైరాగ్యమ్.

అర్థము॥ దృష్టానుశ్రవికవిషయవితృష్ణస్య - దృష్ట = ఈ లోకమున జూడబడినవియును, అనుశ్రవిక = వినబడినవియును, విషయ = స్రక్చందనాది విషయములయందు, వితృష్ణస్య = ఆశలేనివానికి, వశీకారసంజ్ఞా = వశీకారమను పేరుగల, వైరాగ్యం = వైరాగ్యము (కలుగుచున్నది.)

అవ॥ వైరాగ్యము అపరము పరమని రెండు విధములు. అందులో నపరవైరాగ్యము - యతమానము, వ్యతిరేకము, ఏకేంద్రియము, వశీకారము అను నాలు భేదముల

గలదగుచున్నది. ఇచ్చోట నాల్గవదియగు వశీకారవైరాగ్యమును జెప్పుచు మిగత మూడింటిని సూచించుచున్నారు.

తా॥ ఈ లోకమునకు సంబంధించిన విషయములు స్రక్చందన వనితాదులు వేదములో జెప్పబడిన స్వర్గాదులు వినబడునవి, పరలోకమునకు సంబంధించినవి. వీటియందు ఆసక్తియున్నను నీ లోకములో సారమేమిటి, అసారమేమిటి యను విషయమును గురుశాస్త్రములద్వారా నే నెఱుంగవలయునను ప్రయత్నము, యతమానవైరాగ్యము. తన మనస్సున ముందున్న దోషములలో నభ్యాసవివేకముచేత నెన్ని పరిపక్వములైనవి, ఇక నెన్ని మిగిలియున్నవి అని విచారించుట వ్యతిరేకవైరాగ్యము. ఇహలోక పరలోక విషయ సుఖములయందు దుఃఖమును దెలిసికొని వాటి ప్రవృత్తిని వదలి మనస్సునందు ఔత్సుక్య మాత్రము ఆశ గలిగియుండుట ఏకేంద్రియ వైరాగ్యము. ఏ విషయముల యందును సంస్కారరూప ఆశనుగూడ వదలియుండుట వశీకారవైరాగ్యము. ఇదియే అపరవైరాగ్యము. అష్టాంగయోగములకు సాధకముగను, సంప్రజ్ఞాత సమాధికి అంతరంగముగను, అసంప్రజ్ఞాత సమాధికి బహిరంగముగను నున్నది.

**సూ॥ తత్పరం పురుషఖ్యాతేః గుణవైతృష్ణ్యమ్ ॥** 16

పద॥ తత్ - పరం - పురుషఖ్యాతేః - గుణవైతృష్ణ్యమ్.

అర్థము॥ పురుషఖ్యాతేః = ఆత్మసాక్షాత్కారమువలన, గుణవైతృష్ణ్యం = త్రిగుణముల యందు ఆశ లేకుండుట, (యత్ = యేదియో), తత్ = అది, పరం = పర వైరాగ్యమగును.

అవ॥ అసంప్రజ్ఞాత సమాధి కన్తరంగమగు పరవైరాగ్యమును నుడువుచున్నారు.

తా॥ సంప్రజ్ఞాత సమాధ్యభ్యాస సామర్థ్యముచే మూడు గుణముల స్వరూపమైన ప్రధానముకంటె వ్యతిరిక్తుడగు పరమాత్మ పురుషుని సాక్షాత్కారమువలన పూర్తిగా త్రిగుణముల వ్యవహారమందును అసక్తి లేకుండుట గలుగును. అదియే పరవైరాగ్యము. ప్రకృతి కార్యములయందలి వైరాగ్యము అపరము, ప్రకృతియందును వైరాగ్యము పర మనియు దెలియవలయును.

**సూ॥ వితర్కవిచారానందాస్మితాస్వరూపానుగమాత్సంప్రజ్ఞాతః ॥**

పద॥ వితర్కవిచారానందాస్మితాస్వరూపానుగమాత్ - సంప్రజ్ఞాతః.

అర్థము॥ వితర్క-విచారానందాస్మితారూపానుగమాత్ - వితర్క-విచారానందాస్మితా = వితర్కము, విచారము, ఆనందము, అస్మిత వీటియొక్క, స్వరూపానుగమాత్ = స్వరూపముయొక్క అనుసరించుటవలన, సంప్రజ్ఞాతః = సంప్రజ్ఞాత సమాధి(అగును).

అవ॥ ఈ ప్రకార మభ్యాసవైరాగ్యముల నిరూపించి వాటిచే సాధ్యమగు సమాధిని చెప్పుచున్నారు.

తా॥ "సమ్యక్ ప్రజ్ఞాయతే యేన భావ్యం వస్తు స సంప్రజ్ఞాతః" = దేనిచే భావింపబడు వస్తువు బాగుగా తెలియబడుచున్నదో, అదియే సంప్రజ్ఞాతసమాధి. భావ్యవస్తువుల స్పష్టముగా గోచరింపజేయు భావనా విశేషమే సంప్రజ్ఞాత సమాధియగును. ఆ సమాధి వితర్కాది భేదములచే, (1) సవితర్కము, (2) సవిచారము, (3) సానందము, (4) సాస్మితము అని నాలుగు తెఱగులగుచున్నది. (1) సవితర్కసమాధియనగా స్థూలములగు పంచమహాభూతములను ఇంద్రియములను భావనాశక్తిచే సాక్షాత్కరించుటయగును. స్థూలభావనయే వితర్కానుగత సంప్రజ్ఞాత సమాధియగును. (2) సవిచార సమాధియనగా సూక్ష్మములగు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను పంచతన్మాత్రలను అన్తఃకరణమును భావనాపటిమచే గోచరము జేసికొనుటయగును. సూక్ష్మవిషయక భావనయే విచారాను

గత సమాధి. (౩) సానందసమాధియనగా రజోగుణ తమోగుణములచే కొంచెము గూడు కొని సత్త్వగుణ ప్రధానమైయున్న బుద్ధిని భావనచే స్వరూపముతో నెఱుంగుటయగును. బుద్ధ్యనుగతభావనయే సానందసమాధి. సత్త్వము సుఖప్రకాశరూపము గాన దీనికి సానంద సమాధియని పేరు వొడమెను. సాస్మితసమాధియనగా కేవల శుద్ధసత్త్వగుణ ప్రధానమగు మహత్తత్త్వమును భావనాపాటవముచే సాక్షాత్కరించుకొనుటయగును. స్థూలసూక్ష్మ విష యకములగు వితర్క-విచారములను సమాధిద్వయము బుద్ధిచే గ్రాహ్యములు గనుక అవి గ్రాహ్య సంప్రజ్ఞాత సమాధులు. బుద్ధిగ్రహణరూపము గనుక సానందసమాధి గ్రహణసమాధి యగును. అస్మితము గ్రహించునది. సూక్ష్మాహంకారరూప మహత్తత్త్వమును గోచరించు నది అహంకారము కావున నిది గ్రహీత గనుక గ్రహీతృసమాధియగును. ఈ ప్రకారము గ్రాహ్యగ్రహణ గ్రహీతలయందలి భావనోత్కర్షయే సంప్రజ్ఞాతసమాధి. గ్రాహ్యగ్రహణ గ్రహీతల నాధారము జేసికొని యుండుటచే సాలమ్బసమాధియనియు నిది జెప్పబడు చున్నది. ఇది అపరవైరాగ్యముచే సాధించదగినది.

సూ॥ విరామప్రత్యయాభ్యాసపూర్వః సంస్కారశేషోఽన్యః ॥ 18

పద॥ విరామప్రత్యయాభ్యాసపూర్వః - సంస్కారశేషః - అన్యః.

అర్థము॥ విరామప్రత్యయాభ్యాసపూర్వః - విరామ = వృత్తులుపశమించుటకు, ప్రత్యయ = కారణమైన ప్రయత్నముయొక్క, అభ్యాసః = మరల మరల సంపాదించుట, పూర్వః = ముందుగా గల (అభ్యాసముచే గలిగిన), అన్యః = సంప్రజ్ఞాత సమాధి కన్నను వేరగు, సంస్కారశేషః = సంస్కారము మాత్రము మిగిలినదిగా (ఏది యున్నదో, అది అసంప్రజ్ఞాతసమాధి).

అవ॥ అపరవైరాగ్యముచే సాధ్యమగు సంప్రజ్ఞాతసమాధిని నిరూపించి పరవైరాగ్య సాధ్యమగు నసంప్రజ్ఞాతసమాధిని జెప్పుచున్నారు.

తా॥ సర్వదా సకలవృత్తు లుపశమింపజేయు ప్రయత్నమును మాటిమాటి కభ్యసించుచుండిన దానిచే నసంప్రజ్ఞాతసమాధి సిద్ధించును. ఇది సంప్రజ్ఞాతసమాధికన్న వేరుగానున్నది. సకల వృత్తు లుపశమించిన తర్వాత చిత్తస్వరూపము గానుపించదు గనుక సంస్కార మాత్రము శేషమైయున్నది, అసంప్రజ్ఞాతసమాధియగును. సకల చిత్తవృత్తులు నిరుద్ధములై చిత్తము మాత్రము సంస్కారరూపముగానుండియు నితరవస్తువుల గ్రహిం

వక పరబ్రహ్మ స్వరూపమై యుండుట యసంప్రజ్ఞాతసమాధియగును. ఇది సాలమ్బ సంప్రజ్ఞాతసమాధి సాధ్యమగు నిరాలమ్బ సమాధియగును.

**సూ॥ భవప్రత్యయో విదేహప్రకృతిలయానామ్ ॥** 19

పద॥ భవప్రత్యయః - విదేహప్రకృతిలయానామ్.

అర్థము॥ భవప్రత్యయః - భవ = అవిద్యయను సంసారమే, ప్రత్యయః = హేతువుగా గలది సంసారమూలమగు, నసంప్రజ్ఞాతసమాధి, విదేహప్రకృతిలయానాం = విదేహులకు, ప్రకృతిలయులకును, (భవతి = కలుగుచున్నది.)

అవ॥ ఆ అసంప్రజ్ఞాతసమాధి భవప్రత్యయసమాధి, ఉపాయప్రత్యయసమాధి అని రెండు తెఱంగులైయున్నది. భవప్రత్యయసమాధి ముక్తిని గోరువారిచే విడువదగినదని నుడువుచున్నారు.

తా॥ ఎవరు పంచభూతములయందు ఇన్ద్రియములయందును నాత్మభావనచే వాటి నుపాసించి దేహమును వదలుచున్నారో వారు విదేహులగుదురు. ఎవరు అవ్యక్తము మహత్తు అహంకారము శబ్దాది పంచతన్మాత్రలు ఈ రూపమయిన ప్రకృతులయందు

ఆత్మభావన జేయుచున్నారో, దానియందే లయించుచున్నారో, వారు ప్రకృతి లయులగుదురు. వికృతిరూప పదార్థములయం దాత్మభావనజేయు విదేహులును, ప్రకృతియం దాత్మభావనజేయు ప్రకృతిలయులును సంసారమూలమగు అవిద్యారూప భవప్రత్యయ సమాధిని పొందుచున్నారు. వారిద్దఱు కట్టకడకు సంసారపాతిరూప సమాధినే పొందుచున్నారు. నిద్రయందు లీనమగు చిత్తము తిరుగా లేచి సంసారమునందు పడు విధమున విదేహప్రకృతిలయుల చిత్తమున్ను భవప్రత్యయ సమాధిలో (సంసారమూలావిద్యలో) పడి తిరుగా సంసారములోనే పడుచున్నది. వీరు వివేకజ్ఞానము లేనివారగుటచే సంసారమునే పొందుచున్నారని భావము.

## సూ॥ శ్రద్ధావీర్యస్మృతిసమాధిప్రజ్ఞాపూర్వక ఇతరేషామ్ ॥ 20

పద॥ శ్రద్ధావీర్యస్మృతిసమాధిప్రజ్ఞాపూర్వకః - ఇతరేషామ్.

అర్థము॥ శ్రద్ధావీర్యస్మృతిసమాధి ప్రజ్ఞాపూర్వకః = శ్రద్ధ, వీర్యము, స్మృతి, సమాధి, ప్రజ్ఞ ఇవియే ముందుగల (వీటిచే గలిగెడు) (ఉపాయ ప్రత్యయ సమాధి), ఇతరేషాం = విదేహ ప్రకృతిలయులకన్న భిన్నులగు ముక్తిని గోరు యోగులకు (భవతి = కలుగును.)

అవ॥ ముముక్షువులచే నాచరింపదగిన ఉపాయప్రత్యయమను అసంప్రజ్ఞాతసమాధిని నిరూపించుచున్నారు.

తా॥ శ్రద్ధావీర్యాద్యుపాయములచే నీ సమాధి గలుగును గాన దీనిని ఉపాయ ప్రత్యయాసంప్రజ్ఞాతసమాధి యని యందురు. శ్రద్ధయనగా నాకీయోగమే పరమపురుషార్థ సాధనమను దృఢ విశ్వాసము.

శ్లో॥ తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః।
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున!॥

తపోవంతులకంటెను, జ్ఞానులకంటెను, కర్మిష్ఠులకంటెను యోగి యధికుడని సమ్మ
తము కావున ఓ యర్జునా! నీవు యోగివికమ్ము. ఈ విధముగా యోగోత్కర్ష కారణము
లగు శ్రీభగవద్గీతాది స్మృతివాక్యముల వినుటచే శ్రద్ధ అధికమగును. శ్రద్ధ యధికము
కాగా, వీర్యము = ఉత్సాహము నేనన్ని విఘ్నములుగా యోగమును సంపాదింప బోవు
చున్నాను అనునది గలుగును. ఇట్టి యత్యుత్సాహముచే తాననుష్ఠింపదగిన యోగాంగ
ములయొక్క స్మృతి గలుగుచున్నది. ఆ స్మృతిచే సమాధి బాగుగా ననుష్ఠింపబడుచున్నది.
ఆ నిశ్చల సమాధిచే అధ్యాత్మప్రసాద పూర్వకముగా ఋతంభరాప్రజ్ఞ గలుగుచున్నది.

ఈ ప్రకార మొకదానికొకటి క్రమముగా కారణమగుచున్నది. అ న్తమున సత్యస్వరూపమును ధరించు ఋతంభరాప్రజ్ఞచే అసంప్రజ్ఞాతసమాధి గలుగును. ఈ సమాధి విదేహ ప్రకృతిలయ వ్యతిరిక్తులగు ఉత్తమయోగులకు గలుగును. ఇదియే ఉపాయప్రత్యయసమాధి.

**సూ॥ తీవ్రసంవేగానామాసన్నః ॥** 21

పద॥ తీవ్రసంవేగానాం – ఆసన్నః.

అర్థము॥ తీవ్రసంవేగానాం = తీవ్రవైరాగ్యముగలవారికి, అసన్నః = (సమాధి లాభము) దగ్గరగా యున్నది.

అవ॥ పరవైరాగ్య సాధ్యమగు నసంప్రజ్ఞాత సమాధిని నుడివి ఆ వైరాగ్యమునందలి తరతమ భావముచేత సమాధి శైఘ్ర్యతారతమ్యమును వచించుచున్నారు.

తా॥ సంవేగమనగా వైరాగ్యము. ఆ వైరాగ్య భేదముచే యోగులు మూడు తెఱంగులగుచున్నారు. (1) మృదువైరాగ్యము గలవారు, (2) మధ్యవైరాగ్యము గలవారు, (3) తీవ్రవైరాగ్యము గలవారు. ఈ తీవ్రవైరాగ్యము గలవారికి స్వల్పకాలములోనే సమాధిలాభము గలుగును.

సూ॥ మృదుమధ్యాధిమాత్రత్వాత్తతోఽపి విశేషః॥ 22

పద॥ మృదుమధ్యాధిమాత్రత్వాత్ - తతః - అపి - విశేషః.

అర్థము॥ మృదుమధ్యాధిమాత్రత్వాత్ = మృదుత్వ, మధ్యత్వ, అధిమాత్రత్వముల భేదము వలన, తతోఽపి = ఆ తీవ్రవైరాగ్యము గలవారియందును, విశేషః = సమాధి లాభ భేదము (కన్పట్టును.)

అవ॥ తీవ్రవైరాగ్యము గలవారియందును భేదమును వక్కాణించుచున్నారు.

తా॥ తీవ్రవైరాగ్యము: (1) మృదుతీవ్రము, (2) మధ్యతీవ్రము, (3) అధిమాత్ర తీవ్రము అని మూడు విధములై యున్నది. ఈ వైరాగ్యము యొకదానికన్న యొకటి తీవ్రముగా సమాధిసిద్ధిని గలుగజేయుచున్నవి. అత్యంతోత్తమమగు అధిమాత్ర వైరాగ్యము దృఢత్వమును జెందగా నసంప్రజ్ఞాతసమాధిలాభము మెండుగా గలుగుచున్నది. తర్వాత సమాధినుండియు లేచుటకు మనస్సు యశక్తమై నశించుచున్నది. అప్పుడు ప్రత్యగాత్మ (ఆత్మవస్తువు) స్వమహిమయగు స్వరూపమునందు నిర్విఘ్నముగా నిరంతర ముంటున్నది.

సూ॥ ఈశ్వరప్రణిధానాద్వా ॥ 23

పద॥ ఈశ్వరప్రణిధానాత్ - వా.

అర్థము॥ ఈశ్వరప్రణిధానాత్ వా - ఈశ్వర = ఈశ్వరునియందలి, ప్రణిధానాత్ వా = భావనావిశేషమువలన (ధ్యానమువలన) గాని, (సమాధిలాభః ఆసన్నతమః భవతి = సమాధిలాభము శీఘ్రముగా గలుగుచున్నది.)

అవ॥ మఱియొక యుపాయముచేతను సమాధిలాభము శీఘ్రముగా సిద్ధించునని తెలుపుచున్నారు.

తా॥ పరమగురువగు నీశ్వరునిధ్యానించుటవలనను భావించుటవలనను సమాధి మిగుల శీఘ్రముగా సిద్ధించుచున్నది. భగవంతుడు బాగుగా నారాధించుట, ధ్యానించుట మొదలగు సాధనలచే నుపాసింపబడినవాడై 'ఈ నా భక్తునకు సమాధిసిద్ధి గలుగుగాక' యని సంసారాగ్నిలోబడి తపించుచున్న పురుషుని యనుగ్రహించుచున్నాడు. ఓయీ! ఆత్మపురుషుడు తామరాకువలె ప్రకృతి నంటక నిర్లిప్తుడైయున్నాడు. అట్టివాని కెటుల సంసారమున తపించుట సంభవించును? వానిని పరమేశ్వరు డనుగ్రహించుచున్నాడన్న

నదియు నేత్రప్రకారము సమంజసమగుననినదానికి సమాధానము నుడువుచున్నారు. రజోగుణ ముచే సత్త్వము తపింపబడుచున్నది. బుద్ధిరూపముగా పరిణమించిన సత్త్వము తపింప బడుచుండగా దాని నాశ్రయించి యా బుద్ధిసత్త్వముతో నభేదముతోనున్న పురుష డున్ను తపింపబడుచున్నాడు. యథార్థముగా పురుషుడు తపింపబడుటలేదు. ఇది యుప చారవాక్యము. ఇందులకు ప్రమాణము:

శ్లో॥ సత్త్వం తప్యం బుద్ధిభావేన వృత్తం భావా యే వా రాజసాస్తాపకాస్తే।
తస్యాభేదగ్రాహిణీ తామసీ యా వృత్తిస్తస్యాం తప్య ఇత్యుక్త ఆత్మా॥

బుద్ధిరూపమున పొందిన సత్త్వము తప్య (తపనయోగ్య) మగుచున్నది. ఆ సత్త్వ మును తపింపజేయునవి రాజసవృత్తులు. ఆ బుద్ధిసత్త్వముతో నభేదమును గ్రహించువృత్తి తామసవృత్తియగును. దానియందు ఆత్మ తపింపబడుచున్నదని చెప్పబడినది. ఈ ప్రకా రము తపింపబడుచున్న యాత్మపురుషుని పరమేశ్వరుడు సశరీరుడై, లౌకిక వైదిక సంప్ర దాయముల నూచించువాడై యనుగ్రహించుచున్నాడనుటచే దోషములేదు.

**సూ॥ క్లేశకర్మవిపాకాశయైరపరామృష్టః పురుషవిశేష ఈశ్వరః॥24**

పద॥ క్లేశకర్మవిపాకాశయైః - అపరామృష్టః - పురుషవిశేషః - ఈశ్వరః.

అర్థము॥ క్లేశకర్మవిపాకాశయైః - క్లేశ = అవిద్యాది క్లేశములు, కర్మ = పుణ్య పాప మిశ్రకర్మలు, అమిశ్రకర్మలు, విపాక = ఫలమగు జాతి, ఆయుస్సు, ఇంద్రియాది భోగాదులు, ఆశయైః = సంస్కారములు వీటిచేత, అపరామృష్టః = స్పృశింపబడని, పురుషవిశేషః = విలక్షణపురుషుడు, నిత్యముక్తుడు, ఈశ్వరః = ఈశ్వరుడు.

అవ॥ ఆ ఈశ్వరు డెవడనిన జెప్పుచున్నాడు.

తా॥ క్లేశమును గలుగజేయు నవిద్యాదులు, పుణ్యకర్మలు, పాపకర్మలు, మిశ్రకర్మలు, బ్రాహ్మణత్వ దేవత్వాది జాతులు, జననమరణములు, దీర్ఘకాలము జీవించుట, ఇంద్రియ భోగాదులు, సుస్థిరములుగా సూక్ష్మములుగానున్న సంస్కారములు ఇవి యేవియు లేనివాడు ఈశ్వరుడు. ఈ క్లేశకర్మాదులతో గూడినవాడు సంసారిజీవుడు, ముక్తుడయినను వీటితో గూడినవాడు కాడు. పూర్వకాలమునందు సంస్కారములున్నందువలన బద్ధుడువలె కనబడును. ఇందువలన పురుషవిశేషుడీశ్వరుడు నిత్యముక్తుడు. ఈ నిత్యముక్త ఈశ్వరునకు సార్వజ్ఞము ఐశ్వర్యము మొదలగునవి అనాదిసిద్ధప్రాకృత శుద్ధసత్త్వ చిత్త సమ్బన్ధమువల్లనని తెలియవలయు.

సూ॥ తత్ర నిరతిశయం సార్వజ్ఞబీజమ్ ॥ 25

పద॥ తత్ర - నిరతిశయం - సార్వజ్ఞబీజమ్.

అర్థము॥ తత్ర = ఆ ఈశ్వరునియందు, సార్వజ్ఞబీజమ్ - సార్వజ్ఞ = సర్వజ్ఞత్వమునకు, బీజం = కారణమగుజ్ఞానము, నిరతిశయం = సర్వాతిశయమైనది. (ఎద్దానికన్న అధికమగు జ్ఞానము మఱియొకటి లేదో, అది నిరతిశయజ్ఞానము.)

అవ॥ ఈశ్వరునియందు ప్రమాణమును చెప్పుచున్నారు.

తా॥ ఈశ్వరుడని వచించుటకు సర్వాతిశయమైన సర్వజ్ఞత్వమే కారణము. ఈశ్వరుడే సర్వజ్ఞుడు. ఆ సర్వజ్ఞత్వమే ఈశ్వరత్వమునకు కారణము. ఈశ్వరుని సర్వజ్ఞత్వమను విజ్ఞానము నిరతిశయమైనది, సర్వాతిశయమైనదని భావము. అట్టి జ్ఞానము మఱియెవరియందును లేదు. జ్ఞానము సాతిశయము, నిరతిశయమని రెండు విధములు. సాతిశయజ్ఞానమనగా నొక జ్ఞానముకన్న మఱియొక టెక్కువగా నుండుట, దానికన్న మఱియొకటి అధికముగా నుండుట. క్రిమికీటాది జ్ఞానముకన్న పశుపక్ష్యాదుల జ్ఞానము సాతిశయము, వాటి జ్ఞానముకన్న మానవజ్ఞానమధికము. అంతకన్న దేవాదులయొక్క

జ్ఞాన మతిశయించినది. ఈ ప్రకారము జ్ఞానము గాపోవును. నిరతిశయజ్ఞానమన్నచో సర్వాతిశయమైనది. దానికన్న శ్రేష్ఠతరమగు జ్ఞానము మఱియొకటిలేదు. ఇది ఈశ్వరునియందున్నది. ఇట్టి నిరతిశయ సర్వజ్ఞత్వజ్ఞానమే ఈశ్వరలక్షణము.

**సూ॥ పూర్వేషామపి గురుః కాలేనానవచ్ఛేదాత్ ॥ 26**

పద॥ పూర్వేషాం - అపి - గురుః - కాలేన - అనవచ్ఛేదాత్.

అర్థము॥ పూర్వేషాం అపి = ముందువారలగు బ్రహ్మాదులకుగూడ, గురుః = గురువు (ఈశ్వరుడు), కాలేన = కాలముచే, అనవచ్ఛేదాత్ = పరిచ్ఛిన్నుడు కాకుండుటవలన (అతీతుడగుటవలన)

అవ॥ ఓయీ! ఈశ్వరు డొకడేనా? లేక ఇతరులుకలరా? యనిన లేరు; ఒకడే యీశ్వరుడని చెప్పుచున్నారు.

తా॥ సృష్టియొక్క మొదట నుత్పన్నులగు బ్రహ్మాదులుగూడ మాసములు, ఋతువులు, సంవత్సరములు మొదలగువాటిరూపమైన కాలముచేత పరిచ్ఛిన్నులగుచున్నారు. అనగా కాలముచేత మ్రింగబడుచున్నారు.

శ్లో॥ యే రమ్యా యే శుభాధారాః సుమేరుగురవోఽపి యే ।
కాలేన వినిగీర్ణాస్తే గరుడేనేవ పన్నగాః ॥

ఎవరు రమణీయమైనవారలో సదాచారముగలవారో, ఎవరు మేరు పర్వతముకన్న గొప్పవారలో, వారినందరిని కాలము గరుత్మంతుడు పాములనువలె మ్రింగుచున్నది. కావున ఆ బ్రహ్మాదులనుగూడ భగవంతుడొక్కడే గురువు. ఈశ్వరుడు, బ్రహ్మాదులుగూడ నశించువారని యర్థము. "జ్ఞః కాలకాలః = విజ్ఞానరూప భగవంతుడు కాలమునకుగూడ నాశకుడుగాయున్నాడు." అని శ్రుతివాక్యము. కావున నీశ్వరుడు మహామహిమ సమ్పన్నుడని తెలియవలయును.

**సూ॥ తస్య వాచకః ప్రణవః ॥** 27

పద॥ తస్య - వాచకః - ప్రణవః.

అర్థము॥ తస్య = ఆ యీశ్వరునకు, ప్రణవః = ఓంకారము, వాచకః = నామధేయము (బోధకము).

అవ॥ ఈశ్వరునియొక్క నామధేయమును తెలుపుచున్నారు.

తా॥ "ప్రకర్షేణ నూయతే స్తూయతే అనేనేతి ప్రణవః = ఉత్కృష్టగా దీని చేత స్తోత్రము జేయబడుచున్నాడు". ఈశ్వరునియొక్క యుత్కర్షను స్తోత్రము జేయునది కనుక ప్రణవము. ఈ ఓంకారమే ఈశ్వరునికి పేరుగానున్నది. బోధకము.

సూ॥ తజ్జపస్తదర్థభావనమ్ ॥ 28

పద॥ తజ్జపః – తదర్థభావనమ్.

అర్థము॥ తజ్జపః = ప్రణవముయొక్క జపము, తదర్థభావనం = ప్రణవార్థమగు పరబ్రహ్మ భావనగాను (చేయుబడును.)

తా॥ ప్రణవజపముతో గూడ మంత్రార్థమగు పరబ్రహ్మమును భావింపవలయును.

సూ॥ తతః ప్రత్యక్చేతనాధిగమోఽప్యన్తరాయాభావశ్చ ॥ 29

పద॥ తతః – ప్రత్యక్చేతనాధిగమః – అపి – అన్తరాయాభావః – చ.

అర్థము॥ తతః = ఆ ఈశ్వరధ్యానమువలన, ప్రత్యక్చేతనాధిగమః – ప్రత్యక్చేతన = అన్తరాత్మయొక్క, అధిగమః అపి = ప్రాప్తియు, అన్తరాయాభావశ్చ =

అన్తరాయ = విఘ్నములయొక్క, అభావశ్చ = లేకపండుటయూ (కలుగును.)

అవ॥ ఈశ్వరుని నామధేయమును సూచించి ఈశ్వరుని ప్రణిధానమువలన గలుగు ఫలము నుడువుచున్నారు.

తా॥ ఓంకారజపమును దీర్ఘకాల మెడతెగక గడునాదరముతోఁ, అసంగచిద్రూప పరబ్రహ్మభావనాపురస్సరముగా నాచరింపగా జపదృఢత్వ మేర్పడుచున్నది. తర్వాత ప్రణవజపవ్యాపారము స్వయముగా నిలిచిపోగా వాచకమగు ప్రణవశబ్దము లీనమగుచున్నది. తదుపరి ప్రణవార్థమగు అసంగచిద్రూప పరమేశ్వరుని గోచరింపజేయు వృత్తి సమూహరూప విశుద్ధభావన దీర్ఘకాల నైరన్తర్యాదరములతో సుదృఢముగా సేవింపబడగా, ఆ భావనాప్రసాదముచే (శుద్ధిచే) చిత్తము వృత్తినిరోధమునకు గురియగుచున్నది. ఆ చిత్తము జడమగుటచే పరమాత్మను గ్రహింపనిదగుటవలన మనోఽతీతుడగు పరమేశ్వరునియందు విశ్రాన్తి బడయజాలక తనకు ప్రభువగు నసంగచిద్రూపుడగు నన్తరాత్మను స్మరింపజేసి తర్వాత అన్తరాత్మయూ మనస్సును దాటియున్నందున పరబ్రహ్మమును విషయము జేయజాలక కట్టెలులేని అగ్నివలె స్వయముగా నుపశమించి

సంస్కారశేషమగుచున్నది. అందుచే అన్తరాత్మ ప్రాప్తి గలుగును. అంతరముగానున్న చిత్శక్తి భాసమానమై స్వస్వరూపమునందు నిరన్తరము నిర్విఘ్నముగా నున్నది. సర్వ వృత్తు లుపశమించుటచే విఘ్నములుండవు. ఇదియే ఈశ్వరధ్యాన మహిమయొక్క ప్రయోజనము.

సూ॥ వ్యాధిస్త్యానసంశయప్రమాదాలస్యావిరతిభ్రాన్తిదర్శనాలబ్ధ-
భూమికత్వానవస్థితత్వాని చిత్తవిక్షేపాస్తేఽన్తరాయాః॥ 30

పద॥ వ్యాధి, స్త్యాన, సంశయ, ప్రమాద, ఆలస్య, అవిరతి, భ్రాన్తిదర్శన, అలబ్ధభూమికత్వ, అనవస్థితత్వాని – చిత్తవిక్షేపాః – తే – అన్తరాయాః.

అర్థము॥ వ్యాధి...... అనవస్థితత్వాని = 1. వ్యాధి, 2. స్త్యానము, 3. సంశయము 4. ప్రమాదము, 5. ఆలస్యము, 6. అవిరతి. 7. భ్రాన్తిదర్శనము, 8. అలబ్ధభూమికత్వము, 9. అనవస్థితత్వము అనునవి, చిత్తవిక్షేపాః = చిత్తచాంచల్యమునకు కారణములయినవి, తే = ఆ తొమ్మిదియును, అన్తరాయాః = యోగవిఘ్నములు.

అవ॥ యోగవిఘ్నములను నామతః నిర్దేశించుచున్నారు.

తా॥ వాత పిత్త శ్లేష్మదోషములచే గలుగు జ్వరాదులు 1. వ్యాధియనబడును. చిత్త మేకార్యమందును ప్రవర్తింపక మందముగా స్తబ్ధముగానుండుట 2. స్త్యానము. సమాధిసిద్ధించునా లేదా అనునది 3. సంశయము. యోగాంగములగు అహింసా సత్యాది సాధనలను భావింపకుండుట 4. ప్రమాదము. మనోవాక్కాయములు బరువులగుటచే యోగమందు ప్రవర్తింపకుండుట 5. ఆలస్యము. విషయాభిలాషయే 6. అవిరతి. తాను ఆత్మస్వరూపుడయ్యు అనాత్మయని భ్రమించుట 7. భ్రాన్తిదర్శనము. ఏదేని యొక ప్రతిబంధమున్నందున సమాధిలాభమే గలుగకుండుట 8. అలబ్ధభూమికత్వము. సమాధి లభించినను చిత్తము ఆ సమాధియందు సుస్థిరముగా లేకపోవుట 9. అనవస్థితత్వము. ఈ తొమ్మిది యోగవిఘ్నములు చిత్తమును యోగమునుండి దూరము జేయునవి. కనుక నవి చిత్తవిక్షేపములగును. ఇవన్నియు నీశ్వరధ్యానమువలన తొలగును.

సూ॥ దుఃఖదౌర్మనస్యాఙ్గమేజయత్వశ్వాసప్రశ్వాసా విక్షేపసహ-
భువః ॥ 31

పద॥ దుఃఖ, దౌర్మనస్య, అంగమేజయత్వ, శ్వాస, ప్రశ్వాసాః - విక్షేపసహభువః ॥

అర్థము॥ దుఃఖ......... ప్రశ్వాసాః - దుఃఖ = తాపత్రయముచే గలుగు దుఃఖము, దౌర్మనస్య = విషయాభిలాషాదులు సిద్ధించకపోవుటచే గలుగు చిత్తక్షోభము. అంగమేజయత్వ = సర్వాంగచలనము, శ్వాస = అపానవాయువు, ప్రశ్వాసాః = ప్రాణవాయువు ఇవి, విక్షేపసహాభువః = చిత్తవిక్షేపముతోగూడ గలుగునవి.

అవ॥ చిత్తవిక్షేపములే యోగనాశకములుగావు, మఱియు నుపద్రవకరములున్నవని తెలుపుచున్నారు.

టీ॥ వ్యాధివలన గలుగు దుఃఖము ఆధ్యాత్మికాదిభేదముచే త్రివిధము. విషయాభిలాషచే తన కోరిక సిద్ధించకపోయిన కలుగు మనఃక్షోభము దౌర్మనస్యమనబడును. యోగాంగాసనముల ననుష్ఠించునప్పుడు సర్వావయవములు స్థిరములేక చలించుట అంగమేజయత్వమగును. అపానవాయువు శ్వాస యగును. ప్రాణవాయువు ప్రశ్వాస యగును. శ్వాస రేచకప్రాణాయామవిరోధియగును. ప్రశ్వాస పూరకప్రాణాయామ విరోధియగును. అటులగాక బాహ్యకుమ్భక విరోధి శ్వాసయగును. అంతరకుమ్భక విరోధి ప్రశ్వాసయగును. రేచకపూరకద్వయ కుమ్భకవిరోధి అంగమేజయత్వమగును.

"నోచ్ఛ్వసేన్నైవ నిశ్వస్యాన్నైవ గాత్రాణి చాలయేత్" లోపలి వాయువును బయట వదలుట నిశ్వాసయగును. బయటనున్న వాయువును లోపలికి తీసుకొనుట ఉచ్ఛ్వాసయగును. ఈ ఉచ్ఛ్వాసనిశ్వాసములు శరీరచలనము కుమ్భకమునందుండకూడదని తెలిపిరి. ఇందువలన నీ దుఃఖాదులన్నియు చిత్తవిక్షేపముతోగూడ సహాజన్మగలవై యున్నవి.

సూ॥ తత్ప్రతిషేధార్థమేకతత్త్వాభ్యాసః ॥ 32

పద॥ తత్ప్రతిషేధార్థం - ఏకతత్త్వాభ్యాసః ॥

అర్థము॥ తత్ప్రతిషేధార్థం - తత్ = చిత్తవిక్షేపములయొక్క, దుఃఖాద్యుపద్రవముల యొక్క, ప్రతిషేధార్థం = నాశముకొఱకు, ఏకతత్త్వాభ్యాసః = ముఖ్య తత్త్వమగు నీశ్వరునియొక్క అభ్యాసము చేయవలయు.

అవ॥ ఈశ్వర ప్రణిధానమువలననే యోగవిఘ్నములన్నియు నశించునని మరల చెప్పుచున్నారు.

తా॥ వ్యాధ్యాది చిత్తవిక్షేపములు, దుఃఖాది ఉపద్రవములు ఈశ్వరధ్యానము వల్లననే నశించును. ఈశ్వరతత్త్వమును గోచరించు మనోవృత్తులకనుకూలమగు యత్నమే

అభ్యాసమగును. అది దీర్ఘకాల, నైరన్తర్య, ఆదరములచే సేవింపబడినచో వ్యాధ్యాది సకల వాసనలు నశించుచున్నవి. ప్రమాణశ్లోకము: "వాసనాసంపరిత్యాగే యది యత్నం కరోష్యలం। తత్తే శిథిలతాం యాన్తి సర్వాధివ్యాధయః క్షణాత్" = సకలవాసనలను నశింపజేయుటకు ప్రయత్నించుచుండిన చాలును. అందుచే సర్వమనోవ్యథలు వ్యాధులు క్షణములో నశించుచున్నవి.

సూ॥ మైత్రీకరుణాముదితోపేక్షాణాం సుఖదుఃఖపుణ్యాపుణ్య-
విషయాణాం భావనాతశ్చిత్తప్రసాదనమ్ ॥ 33

పద॥ మైత్రీకరుణాముదితోపేక్షాణాం – సుఖదుఃఖపుణ్యాపుణ్యవిషయాణాం – భావనాతః – చిత్తప్రసాదనమ్.

అర్థము॥ సుఖదుఃఖపుణ్యాపుణ్యవిషయాణాం = సుఖము, దుఃఖము, పుణ్యము, పాపము వీనియొక్క విషయములలో, (క్రమముగా) మైత్రీకరుణాముదితోపేక్షాణాం = 1. మైత్రి, 2. కరుణ, 3. ముదిత, 4. ఉపేక్ష వీనియొక్క, భావనాతః = భావించుటవలన, చిత్తప్రసాదనం = మనోనిర్మలత (గలుగును.)

అవ॥ ఇప్పుడు సంప్రజ్ఞాతసమాధియనబడు చిత్తైకాగ్ర్యమునకు ఉపాయములగు మైత్రీకరుణాదులను "మైత్రీకరుణా" అనుసూత్రము మొదలుజేసికొని "యథాభిమతధ్యానాద్వా" అను సూత్రము వరకుగల యేడు సూత్రములచే స్పష్టపరచుచున్నారు.

తా॥ చిత్తమైతే రాగ, ద్వేష, పుణ్య, పాపములచేత కాలుష్యము నొందుచున్నది. ముక్తియోగ్యము కాకున్నదని తాత్పర్యము. ఆ చిత్తము స్వప్ననిద్రాదులలో తనచే ననుభూయమానమగు సుఖము నొందుచున్నది. సర్వదా చిత్తనైర్మల్యమున కుపాయములను నుడువుచున్నారు. మనస్సు రాగద్వేషాదులచే అశుద్ధమగుచున్నది. అందులో రాగమనగా "సర్వం సుఖజాతం మే భూయాత్" = అందఱిచేత ననుభూయమాన మగు నేయే సుఖములున్నవో, ఆ సుఖములన్నియు నాకే యుండుగాక అని సర్వసుఖములను వాంఛించుట బుద్ధియొక్క వృత్తివిశేషమగును. ఆ రాగధీవృత్తివిశేషము సుఖసమూహమును సంపాదింప సామర్థ్యము లేకపోవుటచే మనస్సును అల్లకల్లోలమునుగా జేయును. ఎప్పుడు సుఖప్రాణులయందు "సర్వేప్యేతే సుఖినః మదీయాః = ఈ సుఖవంతులందరు మావారే, వారి సుఖమంతయును నాదియే" అని మైత్రిని భావించునో,

అప్పుడు రాగమును చిత్తకాలుష్యహేతువగు దోషములును పుట్టియు దానితోపాటు అసూయా ఈర్ష్యాదులుగూడ నశించును. ఈ దోషములచే రహితమగు చిత్తము వర్ష ఋతువు పోయిన తర్వాత శరత్కాలమువలె ప్రసన్నమగుచున్నది. వైరులచే దుఃఖము ననుభవింపబడుచున్నది. అప్పుడు "సర్వం దుఃఖం సర్వథా మే మాభూత్ = యే దుఃఖము గూడ నాకెప్పుడును గలుగకుండుగాక" అను మనోవృత్తి ద్వేషమగును. వైరాగ్యాదులున్నందున నా వృత్తి నివారింప శక్యముకాదు. ఆ ద్వేషము సర్వదా చిత్తమును దహించుచుండును. అందుచే నప్పుడు "స్వస్యేవ పరేషాం ప్రతికూలం దుఃఖం మాభూత్ = (నేను దుఃఖము నిచ్ఛగింపనుగదా కావున) నాకువలె ఇతరులకును దుఃఖము గలుగకుండుగాక" అని దుఃఖవంతులయందు కరుణను భావించవలయును. అప్పుడు వైరులయందును ద్వేషము నశించును. అంతమాత్రమే కాదు వారికన్న నేను సుఖవంతుడుగా నుండవలయుననుగర్వముగూడ నశించును, ఆ దర్పమును శ్రీకృష్ణ భగవంతుడు చెప్పియున్నాడు, "శ్లో॥ ఆఢ్యోఽభిజనవానస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా = నేనందఱికన్న గొప్పవాడను, కులవంతుడను, నాతో సమానుడు మఱియొకడెవడు?" ద్వేష

దర్పము ను రెండు దోషములు నివృత్తములగుటచే అన్తఃకరణము వినిర్మలమగుచున్నది. మఱియు ప్రాణులందఱుకూడ స్వభావముగా పుణ్యము నాచరింపరు; పాపమునే నాచరింతురు. ఆ పుణ్యపాపములు రెండును పశ్చాత్తాపమును గలుగజేయుచున్నవి. పుణ్యాత్ములయెడ ముదితను (సంతోషమును సంతృప్తిని సమ్మతమును) భావించవలయును. అందుచే తానుగూడ పుణ్యమునందు ప్రమత్తుడై ప్రవర్తించును. పాపులయెడ నుపేక్షగా నుండవలయును. అందుచే నాతడును పాపము జేయువాల్లడు. ఇందుచే పశ్చాత్తాపము లేకుండుటచే చిత్తము పరిశుద్ధిని గాంచును. ఓయీ! పుణ్యప్రవృత్తి పునర్జన్మహేతువు గదా, అది యోగికి యుక్తముకాదుగదా యనిన, కామ్యపుణ్యకర్మలు పునర్జనన హేతువులగును. యోగులను అశుక్ల కృష్ణపుణ్యమే వివక్షింపబడినది. అది జన్మహేతువు కాదు. ఈ విషయమును పతంజలియు "కర్మాశుక్లకృష్ణం యోగినస్త్రివిధమితరేషాం" అను సూత్రముచే చెప్పియున్నారు. ఈ ప్రకారము సుఖపురుషులయందు మైత్రిని, దుఃఖవంతులయెడ కరుణను, పుణ్యాత్ములపై ముదితను, పాపిష్ఠులపై నుపేక్షను భావించుటచే క్రమముగా 1. రాగము, 2. ద్వేషము, 3. పుణ్యము, 4. పాపములు దొలగి సంస్కార రహితమై చిత్తమేకాగ్రతను పొందుచున్నది. ఇందులకు సూక్తిప్రమాణము:

"పౌరుషేణ ప్రయత్నేన బలాత్సంత్యజ్య వాసనాం ।
స్థితిం బధ్నాతి చేత్తత్ర పదమాసాదయత్యలమ్ ॥"

తా॥ పురుష ప్రయత్నముచే బలాత్కారముగా వాసనను దొలగగొట్టి యేకాగ్ర బుద్ధిగలవాడవైనచో తప్పక ముక్తిని బడయుగలవు.

## సూ॥ ప్రచ్ఛర్దనవిధారణాభ్యాం వా ప్రాణస్య ॥ 34

పద॥ ప్రచ్ఛర్దనవిధారణాభ్యాం - వా - ప్రాణస్య.

అర్థము॥ ప్రాణస్య = ప్రాణవాయువుయొక్క, ప్రచ్ఛర్దనవిధారణాభ్యాం వా - ప్రచ్ఛర్దన = రేచకప్రాణాయామముచు, విధారణాభ్యాం వా = కుమ్భకప్రాణాయామము, వీటిచేతనుగూడ మనస్సున కేకాగ్రత సిద్ధించును.

తా॥ రేచకమనగా హృదయాన్తరగతమగు వాయువును బయటికి వదలుట. బయటనే ఆ వాయువును నిల్పుట బాహ్యకుంభకమగును. లోపలికి వాయువును పూరించుట పూరకమగును. పూరింపబడిన వాయువును లోపలనే నాపుట అంతరకుంభకమగును. వీటినే వివరించుచున్నారు. శరీరాన్తర్భాగముననున్న ప్రాణవాయువును కుడిముక్కు

గుండా ముప్పదిరెండు మాత్రలకాలము బయటవదలుట (రేచించుట) ప్రచ్ఛర్దనమగును. రేచించిన తరువాత పదునారు మాత్రలకాలము వాయువును ఎడమముక్కు ద్వారా లోపల పూరించి అరువదినాలుగు మాత్రలకాలము లోపలనే నిలుపుట అంతరకుంభకమగును. ఇదియే విధారణమని చెప్పబడును. బయట ప్రాణనిరోధము బాహ్యకుమ్భకమగును. ఈ ప్రకారము ప్రాణాయామము, రేచక పూరక కుమ్భకములచే మూడువిధములగును. ఆప్రాణాయామత్రయముచే ప్రాణశిలనమడంగును. అందుచే చిత్తకాలుష్యములు దహింపబడును. ఇందులకు శ్రుతి:

> "యథా పర్వతధాతూనాం దహ్యన్తే ధమతామలాః ।
> తథేన్ద్రియకృతా దోషా దహ్యన్తే ప్రాణనిగ్రహాత్ ॥

తా॥ పాషాణాది విషధాతువులెట్టుల అగ్నితప్తములై పుటముచే పరిశుద్ధములగుచున్నవో అట్లేవిధమున ప్రాణసంయమనాగ్నిచే సమస్త విషయదోషములు దగ్ధములగుచున్నవి. వసిష్ఠమహర్షియు నీ విషయమున యుక్తిని జూపిరి.

శ్లో॥ యః ప్రాణపవనస్పన్దశ్చిత్తస్పన్దస్స ఏవ హి ।
ప్రాణస్పన్దక్షయే యత్నః కర్తవ్యో ధీమతోచ్చకైః ॥

తా॥ ప్రాణవాయువు కదలిన చిత్తము చలించును. కావున ప్రాణచలనము నాపుటకు బుద్ధిమంతుడు మిగుల ప్రయత్నము జేయవలయును. కాబట్టి మనః ప్రాణ వాయువుల స్పన్దముకూడ నుండుటవలన ప్రాణనిగ్రహముచే మనస్సు నిగ్రహింపబడు చున్నది. ఓయీ! ప్రాణముతో గూడ మనస్సు యున్నదనుట యుక్తముగాదు. నిద్రలో ప్రాణముమాత్రమున్నది. మనస్సు చేష్టారహితమగుచున్నదిగదా యనిన అటులగాదు. నిద్రలో మనస్సే లేదు. ఓయీ "క్షీణే ప్రాణే నాసికయోచ్ఛ్వసీత" ప్రాణవాయువు క్షయమునొందగా ముక్కుతో బయట వాయువును లోపలికి తీసికొనుము అను శ్రుతి విరుద్ధముగా జెప్పుచున్నడనిన ప్రాణక్షయమనగా ప్రాణవాయువు తగ్గుటయని అర్థము. ప్రాణవాయువు తగ్గగా మెల్లగా వదలుమని తాత్పర్యము. పర్వతము నెక్కువానికి గలుగు శ్వాసాధిక్యత కూర్చొనియున్నవానికి గలుగదు. అలాగున ప్రాణాయామ సామర్థ్యము గలవానికి శ్వాస మల్పమై ప్రవర్తిల్లును. ఈ యభిప్రాయమునే శ్రుతి వాక్యము దెలుపుచున్నది. "భూత్వా తత్రాయతః ప్రాణః శనైరేవ సముత్సృజేత్" ॥

దీర్ఘమగు ప్రాణవాయువును ప్రాణాయామ సమయమున మెల్లమెల్లగా విడువవలయును. కాబట్టి ప్రాణాయామాభ్యాసపాటవముచే ప్రాణనిరోధము గలుగగా చిత్తము సకలదోష రహితమై ఏకాగ్రతాస్థానము నొందుచున్నది.

**సూ॥ విషయవతీ వా ప్రవృత్తిరుత్పన్నా మనసః స్థితినిబన్ధనీ ॥ 35**

పద॥ విషయవతీ - వా - ప్రవృత్తిః - ఉత్పన్నా - మనసః - స్థితినిబన్ధనీ.

అర్థము॥ విషయవతీ = సూక్ష్మ తన్మాత్రలగు గన్ధాది విషయములుగల, ప్రవృత్తిః = జ్ఞానమయినా, ఉత్పన్నాసతీ = ఉదయించినదై, మనసః = చిత్తముయొక్క, స్థితినిబన్ధనీ = ఏకాగ్రతాస్థితికి కారణమగును.

॥ స్థూలభూతములను సంబంధించిన శబ్దాది విషయజ్ఞానములు లౌకికములగును. సూక్ష్మములగు తన్మాత్రలని చెప్పబడు శబ్దస్పర్శాదులు దివ్యములని యోగశాస్త్రము వచించుచున్నది. చిత్తమును 1. నాసాగ్రమందును, 2. జిహ్వాగ్రమందును, 3. తాలువు (దవడ) యందును, 4. జిహ్వామధ్యమందును, 5. జిహ్వామూలమునందును సంయమించుటచే

(నియమించుటచే) క్రమముగా దివ్యములగు 1. గన్ధము, 2. రసము, 3. రూపము, 4. స్పర్శము, 5. శబ్దము వీటిని సాక్షాత్కరించు జ్ఞానరూపములయిన చిత్తప్రవృత్తులు మనస్సుయొక్క స్థైర్యకారణములగును. అందుచే చిత్తము అతి సూక్ష్మస్వరూపుడగు ఈశ్వరునియందు స్థిరముగా నిలుచును.

36

**సూ॥ విశోకా వా జ్యోతిష్మతీ ॥**

పద॥ విశోకా - వా - జ్యోతిష్మతీ.

అర్థము॥ విశోకా = దుఃఖశూన్యమగు, జ్యోతిష్మతీ వా = జ్యోతిని సందర్శించు (చిత్తవృత్తిగూడ ఏకాగ్రతా పదమును గలిగించును.)

తా॥ ఎనిమిది దళములతోగూడిన హృదయకమలమును, రేచక ప్రాణాయామముచే నూర్ధ్వముఖమును గాజేసి నా హృదయపుండరీక మధ్యయందున్న సుషుమ్నా నాడియందు సూర్యచంద్ర విద్యుత్తులయొక్క ప్రభతో సమానమగు తత్త్వమును చిత్తమున ధ్యానించుటవలన పరంజ్యోతిని సన్దర్శించు జ్యోతిష్మతియను మానసిక ప్రబోధముగలుగును. అది దుఃఖరహితమై ఆనందమయమైనది. అందుచేతను చిత్తమేకాగ్రతను పొందుచున్నది.

సూ॥ వీతరాగవిషయం వా చిత్తమ్ ॥ 37

పద॥ వీతరాగవిషయం - వా - చిత్తం.

అర్థము॥ వీతరాగవిషయం - వీతరాగ = పోయినరాగముగల (విరక్తమయిన) చిత్తము యొక్క, విషయం = విషయమైన, చిత్తం వా = చిత్తమున్ను (ఏకాగ్ర్య సాధకమగుచున్నది.)

తా॥ పరమ విరక్తులయిన శుకాదులయొక్క వీతరాగచిత్తమును (నిర్విషయక మనస్సును) ధ్యానించుటవలనను యోగుల చిత్తముగూడ పోయిన సకలరాగాది దోషములు గలదై ఏకాగ్రతను పొందును.

సూ॥ స్వప్ననిద్రాజ్ఞానాలంబనం వా ॥ 38

పద॥ స్వప్ననిద్రాజ్ఞానాలమ్బనం - వా.

అర్థము॥ స్వప్ననిద్రాజ్ఞానాలమ్బనం - స్వప్న = స్వప్నమునందలి, నిద్రా = సుషుప్తియందలి, జ్ఞాన = జ్ఞానము (జ్ఞానవిషయమైన వస్తువు, జ్ఞానమున్ను) ఆలమ్బనం = ఆధారముగాగల, వా = చిత్తముగూడ స్థైర్యమును పొందును.

తా॥ స్వప్నమున శాస్త్రీయములయిన మనోహరవస్తువులయొక్క దర్శనము గలిగినచో అనగా దేవతాస్వరూపాదులు కానబడినచో ఆ దివ్యవస్తువుల ధ్యానమువలనను సుషుప్తియందలి నిర్విషయక సుఖమును సంస్మరించుటవలనను చిత్తము నిశ్చలమై ఏకాగ్రతను పొందును.

## సూ॥ యథాభిమతధ్యానాద్వా ॥ 39

పద॥ యథాభిమతధ్యానాత్ - వా.

అర్థము॥ యథాభిమతధ్యానాత్ వా - యథాభిమత = తనకిష్టమగు దైవముయొక్క, ధ్యానాత్ వా = ధ్యానమువలనగాని, చిత్తమేకాగ్రపదము నొందును.

తా॥ అధికము చెప్పనేల? శాస్త్రములలో తన యిష్టదేవతాస్వరూప మేవిధముగా చెప్పబడియున్నదో, ఆవిధముగా నా స్వరూపమును ధ్యానించుటచేతను చిత్తమచంచలమై యేకాగ్రత నొందును.

## సూ॥ పరమాణుపరమమహత్త్వాన్తోఽస్య వశీకారః ॥ 40

పద॥ పరమాణుపరమమహత్త్వాన్తః - అస్య - వశీకారః.

అర్థము॥ అస్య = ఈ యేకాగ్రచిత్తమునకు, పరమాణుపరమమహత్త్వాన్తః - పరమాణు = సూక్ష్మాతిసూక్ష్మమగు అణువు, పరమమహత్త్వ = మహత్పదార్థములలో మహామహత్తగు ఆకాశము, అన్తః = ఇవి యవధిగాగల, వశీకారః = అప్రతిఘాతము (అడ్డులేకుండా ప్రసరించుట) గలుగును.

అవ॥ చిత్తైకాగ్రత సిద్ధించిన విషయమున జ్ఞాపకమును (చిహ్నమును) జూపుచున్నాడు.

తా॥ ఏకాగ్రతను పొందిన చిత్తము అతిసూక్ష్మవస్తువునందుగాని, అతిస్థూల వస్తువునందుగాని యుంచబడినచో అప్పుడీ చిత్తమునకు పరమాణువు అవధిగాగలదియు, పరమమహత్తు అవధిగాగలదియునగు వశీకారము (అడ్డులేకుండా ప్రసరించుట) గలుగును. మనస్సు సూక్ష్మవస్తువునందుంచబడినచో నా సూక్ష్మవస్తువునం దేయడ్డులేక ప్రసరించును. స్థూలవస్తువునందు నిలుపబడిన ఆ స్థూలమునం దేప్రతిబంధములేక వర్తించి నిశ్చలతను గాంచును. ఇదియే చిత్తముయొక్క ఐకాగ్ర్యము సిద్ధించినందుకు గురుతు. సారాంశ మేమనగా నిట్టి నిశ్చలచిత్తయోగి పరమాణువు మొదలుకొని పరమమహత్తగు నాకాశము

వరకుగల సూక్ష్మవస్తువులను స్థూలవస్తువులను అన్నిటిని సాక్షాత్కరించును. ఇది జ్ఞాపకము.

**సూ॥ క్షీణవృత్తేరభిజాతస్యేవ మణేర్గ్రహీతృగ్రహణగ్రాహ్యేషు తత్థ్సతదంజనతాసమాపత్తిః ॥ 41**

పద॥ క్షీణవృత్తేః - అభిజాతస్య - ఇవ - మణేః - గ్రహీతృగ్రహణగ్రాహ్యేషు - తత్థ్సతదంజనతాసమాపత్తిః.

అర్థము॥ క్షీణవృత్తేః = నశించిన రజస్తమోగుణముల వృత్తులుగలది గనుకనే, అభిజాతస్య = మిక్కిలి నిర్మలమైన చిత్తమునకు, అభిజాతస్య = ఉత్తమజాతిగల (పరిశుద్ధమైన తెల్లనైన) మణేరివ = రత్నమునకువలె, గ్రహీతృగ్రహణగ్రాహ్యేషు - గ్రహీతృ = రజస్తమో గుణములులేక, శుద్ధసత్త్వ స్వరూపమగు మహత్తత్త్వమగు జ్ఞాతయైన పురుషునియందును, గ్రహణ = రజస్తమోగుణ రహితాహంకారమను అంతరేన్ద్రియమందును, గ్రాహ్యేషు = భావింపతగిన స్థూలసూక్ష్మభూతములు, వాటికి సంబంధించిన ఇంద్రియములు, శబ్దస్పర్శాదులగు తన్మాత్రలు, అన్తఃకరణము

దీనియందును, తత్స్థతదంజనతాసమాపత్తిః - తత్స్థ - తత్ = ఆ భావింపబడు గ్రహీతృగ్రహణగ్రాహ్యాది పదార్థములలో, స్థ = ఉపరక్తమైయుండుచున్న చిత్తముయొక్క (లేపకద్రవ్యముచేత పూయబడిన ఘటాదులవలె భావ్యవస్తు స్వరూపమును ధరించియున్న చిత్తముయొక్క), తదంజనతా - తత్ = ఆ భావ్యపదార్థములయొక్క, అంజనతా = స్వరూపము గలిగియుండుటయొక్క, సమాపత్తిః - సం ఆపత్తిః = బాగుగా పొందుట (సంప్రజ్ఞాత సమాధియగును.)

అవ॥ ఈప్రకారము చిత్తైకాగ్రతకు నుపాయములను, ఆ మనస్సుయొక్క నిశ్చలత్వముచే సిద్ధించు ఫలమును చెప్పి చిత్తైకాగ్రతయొక్క అభివృద్ధిదశయే స్వరూపముగాగల సబీజసమాధియనబడు సంప్రజ్ఞాత సమాధియొక్క స్వరూపమును దాని భావ్యవిషయములను చెప్పుచున్నారు.

తా॥ పరిశుద్ధమగు స్ఫటికమణి ఎఱ్ఱని దాసానిపువ్వుయొక్క సంబంధముచే దానినాశ్రయించి ఆ ఎఱ్ఱని దాసానిపువ్వుయొక్క రంగునే ధరించి తన రూపమును వదలి యెఱ్ఱగా నగుచున్నది. అటులనే రాజసతామస వృత్తిరహితమగు చిత్తము భావింపబడిన

వస్తువులతో నభేదము నొంది ఆ భావ్యవస్తువుల నాశ్రయించినది గనుకనే భావ్యమానవస్తు స్వరూపమునే పొందుచున్నది. నిర్మలమగు చిత్తమేదేది తనకు గోచరమగునో ఆ రూప మును బాగుగా ధరించును. ఇదియే సంప్రజ్ఞాత సమాధి. ఘటము రంజక ద్రవ్యమగు నెఱ్ఱమట్టిచే నుపరక్తమైన (పూయబడిన)చో తన రూపమును వదలి యెఱ్ఱమట్టిరూపమగు నెఱుపును ధరించుచున్నది. అటులనే శుద్ధసత్త్వముతో గూడిన చిత్తము, 1. గ్రాహ్యవస్తువు లగు స్థూలసూక్ష్మములయిన పంచభూతములు ఇన్ద్రియములు మొదలగువానిని భావించే నేని తదాకారమును పొందుచున్నది. తన రూపము వదలుచున్నది. 2. గ్రహణరూపమగు రజస్తమస్సులయొక్క లేశముగల యహంకారమును అంతరేంద్రియమును భావించినచో అప్పుడును స్వరూపమునువదలి భావ్యాహంకారరూపము నొందుచున్నది. 3. గ్రహీత యగు మహత్తత్త్వమనబడు పురుషుని ధ్యానించిన పురుషాకారము నొందుచున్నది. ఈలాగున నిర్మలిన మనస్సు భావనాపటిమచే భావ్యవస్త్వాకారమును స్వరూపమునువదలి ధరించుచున్నది. అట్టి చిత్తము గ్రాహ్యవస్త్వాకారమైనచో 1. గ్రాహ్యసమాధియనియు, గ్రహణవస్త్వాకారమైనచో 2. గ్రహణసమాధియనియు, గ్రహీత్రాకారమైనచో

3. గ్రహీతృసమాధియనియుం చెప్పబడును. కావున సంప్రజ్ఞాత సమాధి యీలాగున మూడు విధములుగా యున్నది.

**సూ॥ తత్ర శబ్దార్థజ్ఞానవికల్పైః సంకీర్ణా సవితర్కా సమాపత్తిః॥42**

పద॥ తత్ర - శబ్దార్థజ్ఞానవికల్పైః - సంకీర్ణా - సవితర్కా - సమాపత్తిః.

అర్థము॥ తత్ర = సవితర్కాది చతుర్విధ సమాధులలో, శబ్దార్థజ్ఞానవికల్పైః - శబ్దార్థజ్ఞాన = (1) శబ్దము, (2) అర్థము, (3) జ్ఞానము ఈ మూడింటియొక్క, వికల్పైః = అసత్యమగు అభేదముయొక్క గ్రహణరూప భావనలతో (వికల్ప వృత్తులతో), సంకీర్ణా = కూడినది, సవితర్కా సమాపత్తిః = సవితర్క సంప్రజ్ఞాత సమాధియగును.

అవ॥ సామాన్యముగా సంప్రజ్ఞాత సమాధి ముగించి యిప్పుడు స్థూలసూక్ష్మ పదార్థ సాక్షాత్కార రూపమగు గ్రాహ్య సంప్రజ్ఞాతసమాధియొక్క 1. సవితర్క, 2. నిర్వితర్క, 3. సవిచార, 4. నిర్విచారములను నాలుగు సమాధులను మూడు సూత్రములచేత నిరూపింపబోవుచు, వానిలో సవితర్కసమాధి స్వరూపమును దెల్పుచున్నారు.

తా॥ వికల్పవృత్తితో సమానమైనది సవితర్క సమాధి యగును. వికల్పవృత్తి యనగా పదార్థములకు పరస్పరము భేదమున్నను, అభేదమునే గ్రహించుట. ఇది అసత్య జ్ఞానవిషయమగును. (1) గోశబ్దము, (2) దాని యర్థమగు గోవు, (3) దాని జ్ఞానమును విభిన్నస్థలములలో నున్నవి. (1) గోశబ్దము వాక్కునందును, (2) దాని అర్థమగు ఆవు భూమియందును (3) దాని జ్ఞానము అంతఃకరణమందును నున్నవి. ఇటుల విభాగముతో నున్న శబ్దార్థజ్ఞానముల నొకటిగా గ్రహించుట వికల్పవృత్తితో సమానమగు సవితర్క సంప్రజ్ఞాతసమాధి యగును. సారాంశము: "ఇదం ఆకాశభూతం ఇదం తేజోభూతం భౌతికం వస్తు కదలీకాండవత్ నిస్సారం భూతమాత్రం తత్కృతా సుఖదుఃఖమోహాః వైరాగ్యేణ త్యాజ్యాః ఇత్యాది" ఇది ఆకాశభూతము, ఇదిఅగ్నిభూతము, భూతసంబద్ధ జగత్తు అరటికాడవలె సారములేనిది, భౌతికపదార్థములచే సుఖదుఃఖ మోహములు వైరాగ్యముచే విడువదగినవి ఇవి మొదలగు శబ్దచిన్తనాపూర్వక పదార్థముల సాక్షాత్కరించు భావనావిశేషము సవితర్కసమాధి యని చెప్పబడును. అనగా 1. శబ్దరూపమన్త్రము, 2. దేవతారూప మన్త్రార్థము, 3. చిత్తధర్మ భావనారూపజ్ఞానము ఈ మూడు వేరుగా

నున్నను, అభేదముగా సాక్షాత్కరించుట వికల్పభావనారూప సవితర్కసమాధి యనబడును.

సూ॥ స్మృతిపరిశుద్ధౌ స్వరూపశూన్యేవార్థమాత్రనిర్భాసా నిర్వితర్కా॥

పద॥ స్మృతిపరిశుద్ధౌ - స్వరూపశూన్యా - ఇవ - అర్థమాత్రనిర్భాసా - నిర్వితర్కా.

అర్థము॥ స్మృతిపరిశుద్ధౌ సత్యాం - స్మృతి = శబ్దసంకేత (సంబంధము) యొక్క స్మరణమునకు, పరిశుద్ధౌ సత్యాం = అభావము గలుగగా (అర్థముతోటి శబ్ద సంబంధముయొక్క స్మరణము లేకుండగా), స్వరూపశూన్యేవ = స్వరూప = నేను తెలియుచున్నాను అను భేదభావనచే, శూన్యేవ = రహితమైనదివలె నున్నదై, అర్థమాత్రనిర్భాసా = పదార్థమాత్రము మిగుల ప్రకాశించుట, నిర్వితర్కా = నిర్వితర్కసమాధియగును.

తా॥ ముందు శబ్దచింతనాపూర్వక సమాధి చెప్పబడెను. ఇప్పుడట్టి శబ్దవృత్తిలేక ధ్యేయవస్తువునుమాత్రము సాక్షాత్కరించు నిర్వితర్కసమాధిని చెప్పుచున్నారు. ఇది

శబ్దధర్మములు, ఇవి అర్థధర్మములు, ఇవి విజ్ఞానధర్మములు అని విభాగపూర్వక పదార్థ జ్ఞానము గలవానికి శబ్దముతో పని లేదు. నాతఁడు ప్రత్యక్షముగా ధ్యేయవస్తువును చూచుచున్నాడు. శబ్దపూర్వకముగా నభేదముతో తాను భావించిన వస్తువును సాక్షాత్కరించుట సవికల్పసమాధి యగును. శబ్దముకన్న అర్థము వేరుగా నున్నదని తెలిసి అర్థమగు ధ్యేయవస్తువును మాత్రము సాక్షాత్కరించుట నిర్వికల్పసమాధి యగును. శబ్దము, వస్తువును తెలియుట యను అర్థజ్ఞానము ఈ రెంటిచేత శబ్దార్థముల వేరుజేయక అభేదముతో గ్రహింపబడిన వికల్పార్థమునందు శబ్దసంబంధము ఆవశ్యకమైయున్నది. శబ్దార్థములు వేరుగా తెలియనివానికి వికల్పజ్ఞానమే గలుగును. కావున శబ్దార్థముల వేరుగా తెలిసిన నర్థముతోటి శబ్దసంబంధమును స్మరింప నవసరము లేదు. ఇటుల కాగా నేను ఆ యర్థమును తెలియుచున్నాను అను భేదజ్ఞానరూప భావనయుగూడ మరవబడి కేవల అర్థమగు ధ్యేయవస్తువుమాత్రము నిలుగును. అప్పుడు ధ్యేయవస్తుభావన వికల్పవృత్తిరహితమై మిక్కిలి ప్రకాశించును. ఇదియే నిర్వితర్కసమాధి యని వచింపబడుచున్నది. ఇందున శబ్దముగాని, నేను తెలియుచున్నాను అను అర్థముకన్న వేరుగాయుండు భావముగాని

యుండవు. చిత్తముమాత్రము ధ్యేయాకారమై యుండును. ఇదియే నిర్వికల్పమనబడును. ఇచ్చట మన్త్రముగాని, ధ్యానింపతగిన వస్తుజ్ఞానముగాని యుండవు. కేవలము మన్త్రార్థమే నిలుచును.

సూ॥ ఏతయైవ సవిచారా నిర్విచారా చ సూక్ష్మవిషయా వ్యాఖ్యాతా॥44

పద॥ ఏతయా - ఏవ - సవిచారా - నిర్విచారా - చ - సూక్ష్మవిషయా - వ్యాఖ్యాతా.

అర్థము॥ ఏతయైవ = ఈ సవితర్క నిర్వితర్క సమాధుల స్వరూపనిరూపణచేతనే, సూక్ష్మవిషయా = సూక్ష్మములగు తన్మాత్రలను (శబ్దస్పర్శాదులను) గోచరముగాగల, సవిచారా = సవిచార సమాధియు, నిర్విచారా చ = నిర్విచార సమాధియున్ను, వ్యాఖ్యాతా = వివరింపబడినదేను.

అవ॥ పూర్వము చెప్పినరీతిగా మిగిలిన సమాధుల నిరూపణను గావించుచున్నారు.

తా॥ శబ్దము, ఈ శబ్దమునకు వస్తువను అర్థముయొక్క జ్ఞానము ఈ రెంటిని అభేదముగా గ్రహించుటచే, శబ్దపూర్వకముగా స్థూలభూత ధ్యేయవస్తువుయొక్క సాక్షా

త్కారరూప సవితర్కసమాధిని నిరూపించుటచే, అటులనే శబ్దజ్ఞానములయొక్క అభేదముచే సూక్ష్మభూత ధ్యేయవస్తువులను వికల్పవృత్తిరూప భావనచే గ్రహించుట సవిచారసమాధియగుననియు, వికల్పవృత్తిలేకను (శబ్దార్థముల వేరుగా గ్రహించుటయు) శబ్దచిన్తనలేకను స్థూలార్థముల విషయీకరించు నిర్వితర్కసమాధి నిరూపణచే, ఈ విధముగనే వికల్పరహిత సూక్ష్మభూత భావ్యవస్తువులను శబ్దముకన్న అర్థము వేరు అను జ్ఞానముచే శబ్దసహాయములేకనే సాక్షాత్కరించుట నిర్విచారసమాధి యగుననియు వ్యాఖ్యానము జేయబడెను.

సారాంశము: మహావస్తువులగు స్థూలభూతేన్ద్రియములను స్థూలభూతేన్ద్రియ ప్రతిపాదక శబ్దసహాయముచే భావనాశక్తిచే సాక్షాత్కరించుట (1) సవితర్కసమాధి యగును. అటులనే సూక్ష్మములగు శబ్దస్పర్శాది తన్మాత్రలను శబ్దసహాయముచేతనే సాక్షాత్కరించుట (2) సవిచారసమాధియగును. శబ్దానువిద్ధరహితముగా స్థూలభూతేన్ద్రియ సాక్షాత్కారము (3) నిర్వితర్కసమాధి యగును. ఈ విధముగనే శబ్దసహాయచింతన లేకనే సూక్ష్మతన్మాత్ర సాక్షాత్కారము (4)నిర్విచారసమాధి యగును. (మఱియు ప్రకారాంతర

మూలచే సాధకులకు గ్రాహ్యముగునటుల ఈ చతుర్విధ సమాధినిరూపణ గావింపబడు
చున్నది.(1) సవితర్క సమాధిః- జిహ్వతోగాని, ఉపజిహ్వతోగాని మంత్రమును జపిం
చుచు, తత్సహాయముచే మన్త్రార్థమగు దైవమును తనకన్న వేరుగా ప్రత్యక్షముగా సాక్షా
త్కరించుట బాహ్యసాక్షాత్కారరూప సవితర్కసమాధి యగును. తర్వాత మంత్రజప
సహాయములేకనే అర్థమగు దైవమును మాత్రము బాహ్యముగా సాక్షాత్కరించుట
(2) నిర్వితర్కసమాధి యగును. (3) సవిచారసమాధి యనగా, మంత్రమును నాలుకతోగాని
కొండనాలుకతోగాని జపించక మంత్రమును, మంత్రార్థమును మనస్సుననే తలంచుచు
తన హృదయమునందే మన్త్రార్థమగు దైవమును మన్త్రసహాయముచేతనే సాక్షాత్క
రించుట అంతరసాక్షాత్కారరూప సవిచారసమాధి యగును. (4) నిర్విచార సమాధి
యనగా, మనస్సుయందుగూడ మన్త్రసహాయము లేక అర్థమమాత్రము తన హృదయము
నందే భావించుట నిర్విచార సమాధియగును).

సూ॥ సూక్ష్మవిషయత్వం చాలింగపర్యవసానమ్ ॥ 45

పద॥ సూక్ష్మవిషయత్వం - చ - అలింగపర్యవసానం.

అర్థము॥ సూక్ష్మవిషయత్వం చ = (నిర్విచార సమాధియొక్క) సూక్ష్మవస్తువుల సాక్షాత్కరించుటయును, అలింగపర్యవసానం = అలింగ = ప్రధాన ప్రకృతియే, పర్యవసానం = హద్దుగా గలది.

అవ॥ నిర్విచారసమాధి సూక్ష్మతన్మాత్రముల సాక్షాత్కారముతోనే పూర్తి యగుట లేదు. అంతకన్న సూక్ష్మవిషయత్వము నిర్విచారసమాధికి హద్దు అని చెప్పుచున్నారు.

తా॥ నిర్విచారసమాధి సూక్ష్మవస్తు గ్రహణము. ప్రధానముతో పూర్తియగుచున్నది. అనగా మహాసూక్ష్మమగు ప్రకృతిని సాక్షాత్కరించుటయు పరిపూర్ణ నిర్విచార సమాధి యగునని భావము. "తన్మాత్రేభ్యోఽహంకారః సూక్ష్మః తస్మాదపి మహాన్ తతోఽపి ప్రధానం తద్ధి న లీయతే అలింగమ్ = పంచతన్మాత్రలకన్న అహంకారము సూక్ష్మము, దానికన్న మహత్తు దానికన్న ప్రధానము సూక్ష్మము. ఇటుల సూక్ష్మము యొక్క పరమావధి చెప్పబడెను. ఈ ప్రకృతి లీనము గాదు గనుక అలింగమని చెప్పబడినది. దానికన్న సూక్ష్మము మరియొకటి లేదు. పురుషుడు ప్రకృతి గాదు, సృష్టికి నిమిత్తమాత్రుడు. ఇటుల ధ్యానింపవలయును.

సూ॥ తా ఏవ సబీజస్సమాధిః ॥ 46

పద॥ తాః - ఏవ - సబీజః - సమాధిః.

అర్థము॥ తాః ఏవ = ఆ ముందు ప్రవచింపబడిన సవితర్క - నిర్వితర్క - సమాధులే, సబీజః = అవిద్యా సంస్కారబంధమగు బీజముతో కూడుకొన్న, సమాధిః = సమాధి.

అవ॥ సంప్రజ్ఞాత సమాధిని ముగించుచున్నారు.

తా॥ 1. శబ్దానువిద్ధ స్థూలవస్తు సాక్షాత్కారరూప సవితర్కసమాధి, 2. శబ్దానువిద్ధ రహిత స్థూలవస్తు సాక్షాత్కార లక్షణ నిర్వితర్కసమాధి, 3. శబ్దానువిద్ధ సూక్ష్మవస్తు విషయక సవిచారసమాధి, 4. శబ్దానువిద్ధ రహిత సూక్ష్మవస్తువిషయక నిర్విచార సమాధి. ఇటుల సమాధులు నిరూపింపబడెను. ఇవన్నియు సంప్రజ్ఞాతసమాధి యగును. ఈ సమాధిలో ఆత్మవివేకజ్ఞానము లేకుండుటచే అవిద్యాబద్ధబీజమున్నది. కనుక సబీజ సమాధియని సంప్రజ్ఞాతసమాధిని జెప్పిరి. మఱియు నిర్విచారసమాధియొక్క హద్దును జెప్పుచు ప్రధానమునుగూడ సాక్షాత్కరించుట నిర్విచారసమాధి పూర్ణావస్థ అను నిరూప

ణచే బుద్ధిప్రధానముల సాక్షాత్కారరూపముగు సానంద సాస్మిత సమాధులను సంప్రజ్ఞాత భేదములయొక్క స్వరూపము గ్రహింపబడినదని తెలియవలయును. ఇట్టుల సంప్రజ్ఞాత సమాధిస్వరూపము సమగ్రమాయెను.

47

సూ॥ నిర్విచారవైశారద్యేఽధ్యాత్మప్రసాదః ॥

పద॥ నిర్విచారవైశారద్యే - అధ్యాత్మప్రసాదః.

అర్థము॥ నిర్విచారవైశారద్యే - నిర్విచార = నిర్విచారసమాధియొక్క, వైశారద్యే సతి = నిర్మలత సిద్ధించగా (ప్రధానములో లయింపుట సంభవించగా), అధ్యాత్మప్రసాదః - అధ్యాత్మ = చితిశక్తియొక్క, ప్రసాదః = ప్రసన్నత (సాక్షాత్కారము) గలుగును.

అవ॥ ఈలాగున సంప్రజ్ఞాతసమాధి నుపసంహరించి పిదప ప్రజ్ఞాస్వరూపమైన సంస్కారమాత్ర రూపమయిన అసంప్రజ్ఞాతసమాధియగు నుపాయ ప్రత్యయ సమాధినిగూడ నుపసంహరింప దలంచి నిర్విచారసమాధి, అసంప్రజ్ఞాతసమాధికి పూర్వరంగముగా (ముందు సాధనముగా) నగునని తెలుపుచున్నారు.

తా॥ ప్రధాన పర్యంతము సూక్ష్మవస్తువుల గోచరించు నిర్విచార సమాధి (సూక్ష్మ వస్తు గ్రాహక భావనారూప చిత్తవృత్తి) అభ్యాసపాటవముచే ప్రధానములో లయము నొందగా చిత్శక్తి ప్రజ్వలించుటచే పరమాత్మసాక్షాత్కారము గలుగును.

**సూ॥ ఋతంభరా తత్ర ప్రజ్ఞా ॥** 48

పద॥ ఋతంభరా - తత్ర - ప్రజ్ఞా.

అర్థము॥ తత్ర = ఆ ఆత్మపురుష సాక్షాత్కారమందలి, ఋతంభరా = సత్యవస్తువును ప్రకాశింపజేయు, ప్రజ్ఞా = ప్రజ్ఞ గలుగును.

అవ॥ ఆత్మసాక్షాత్కారానంతరము నేమి గలుగునో చెప్పుచున్నారు.

తా॥ ఆత్మ పురుషజ్ఞానము గలుగగా సత్యవస్తువగు నాత్మను ప్రకాశింపజేయు ప్రజ్ఞయు నుదయించుచున్నది. ఇదియే ఋతంభరా ప్రజ్ఞయనియు, ధర్మమేఘ సమాధి యనియు చెప్పబడును.

**సూ॥ శ్రుతానుమానప్రజ్ఞాభ్యామన్యవిషయా విశేషార్థత్వాత్ ॥** 49

పద॥ శ్రుతానుమానప్రజ్ఞాభ్యాం - అన్యవిషయా - విశేషార్థత్వాత్.

అర్థము॥ విశేషార్థత్వాత్ = విశేషార్థములు గలది యగుటవలన (ఈ ఋతంభరా ప్రజ్ఞ) శ్రుతానుమానప్రజ్ఞాభ్యాం = ఆగమ అనుమాన ప్రమాణములయొక్క ప్రజ్ఞల కంటె, అన్యవిషయా = విలక్షణము.

అవ॥ ఋతంభరా ప్రజ్ఞావిషయమైన విలక్షణ యుక్తిని జెప్పుచున్నారు.

తా॥ శాస్త్రజ్ఞానము అనుమానజన్యజ్ఞానముగూడ వాటికి విషయమగు సామాన్య పదార్థములనే గోచరించును. గోచరము కానివానిని ఆగమానుమానములు తెలుపజాలవు. యోగికి గలిగిన ప్రత్యక్షసిద్ధమైన ఋతంభరా ప్రజ్ఞ శాస్త్రానుమానములకు విషయమైన, సామాన్యమునకంటె విలక్షణమైన విశేషమును గోచరించుచున్నది. ఈ ప్రజ్ఞ సూక్ష్మ వస్తువులను, దూరముగా నుండువస్తువులను, అడ్డు గలిగియుండు పదార్థముల నన్నిటిని విషయీకరించును. ఈ యోగి ప్రత్యక్ష ప్రజ్ఞ సర్వవిలక్షణ సత్యవస్తు విషయమైనదగుటచే విశేష విషయమైనది, శాస్త్రానుమానములవలె సామాన్యవిషయము గాదు. ఇది విశేష గోచరము.

సూ॥ తజ్జః సంస్కారోఽన్యసంస్కారప్రతిబన్ధీ ॥ 50

పద॥ తజ్జః - సంస్కారః - అన్యసంస్కారప్రతిబన్ధీ.

అర్థము॥ తజ్జః = ప్రజ్ఞవలన గలిగినట్టి, సంస్కారః = సంస్కారము, అన్యసంస్కార ప్రతిబన్ధీ = వ్యుత్థాన సంస్కారములకు నిరోధముగా నగుచున్నది.

అవ॥ అసంప్రజ్ఞాత సమాధికి ఋతంభరా బహిరంగసాధనమని చెప్పదలంచి ఆ ప్రజ్ఞ యొక్క యుపయోగమును దెలుపుచున్నారు.

తా॥ ఈ ఋతంభరా ప్రజ్ఞయొక్క యభ్యాసముచే గలుగు విశేష గోచరరూప సంస్కారము మనస్సులో గలుగు ప్రాకృత సంస్కారములను బాధించుచున్నది.

సూ॥ తస్యాపి నిరోధే సర్వనిరోధాన్నిర్బీజస్సమాధిః ॥ 51

పద॥ తస్య - అపి - నిరోధే - సర్వనిరోధాత్ - నిర్బీజః - సమాధిః.

అర్థము॥ తస్యాపి = ఆ ప్రజ్ఞా సంస్కారముయొక్కయు, నిరోధే సతి = నిరోధము (అడ్డగించుట) గలుగగా, సర్వనిరోధాత్ = సర్వప్రజ్ఞా సంస్కారములయొక్క

నిరోధమువలన, నిర్బీజః సమాధిః - నిర్బీజః = అవిద్యాబన్ధ రహితమైన, సమాధిః = సమాధి (అసంప్రజ్ఞాతసమాధి).

అవ॥ ఈ ప్రకారము ప్రజ్ఞాసంస్కారము అసంప్రజ్ఞాత సమాధికి బహిరంగసాధనమని వచించి సకల ప్రజ్ఞాసంస్కారముల నిరోధ ప్రయత్నమే అంతరంగసాధనమని నిరూపించుచున్నారు.

తా॥ పరవైరాగ్యముచే గలిగిన సకల వృత్తుల నాశరూప కారణముచే ప్రజ్ఞాసంస్కారముగూడ నిరుద్ధముకాగా, నిక పుట్టబోవునట్టి ప్రజ్ఞాసంస్కారములన్నియు తొలగగొట్టబడుచున్నవి. ప్రజ్ఞాసంస్కారము వృద్ధికాగా నికను క్రొత్త క్రొత్త సంస్కారములు గలుగుచుండును. ఇప్పుడో నిరోధము సకల ప్రజ్ఞాసంస్కారములను నశింపజేయుచున్నది. అందుచే సకల బంధనివృత్తి గలుగుచున్నది. అప్పుడే నిర్బీజసమాధి సిద్ధించును. ఈ యసంప్రజ్ఞాత సమాధి యనబడు నిర్బీజసమాధి గలుగగా చిత్తము తిరుగా వ్యుత్థానదశకు వచ్చుటకు శక్తి లేనిదగుచున్నది. చిత్తమడంగగా కూటస్థ నిత్య అనన్త శుద్ధ

రూపమగు ఆత్మశక్తి తన మహిమయందు (సర్వప్రకాశక స్వస్వరూపమందు) నెప్పుడును నిర్విఘ్నముగా నుంటున్నది.

ఇతి శ్రీమత్పతఞ్జలిప్రణీతే యోగశాస్త్రే యోగసుధాకరాభిధాయాం వృత్తౌ సమాధిపాదః సమాప్తః.

ఓం తత్ సత్

ఓమ్

# ౨. సాధన పాదము

## ప్రార్థనా శ్లోకము

పరా పశ్యన్త్యాది భేదభిన్నామేకాం నిసర్గతః।
చిదానందమయీం నిత్యాం వాచం కాంచిదుపాస్మహే ॥

తా॥ పరా పశ్యన్తీ వైఖరీ అను భేదములతో గూడినదియు, స్వభావముగా నేక మైనదియు, చిదానందరూపమయినదియు, నిత్యమైనదియు నగు అవాఙ్మానసగోచర మైన, విలక్షణమైన ఒకానొక వాణిని (సరస్వతిని) ఉపాసించుచున్నాను.

అవ॥ ముందు సమాధిపాదమున సంప్రజ్ఞాత అసంప్రజ్ఞాత సమాధులను అవాన్తర భేదములతోను, అన్తరఙ్గసాధనములతోను, ప్రయోజనములతోను వర్ణించిరి. ఈ సాధనపాదమున పరిపక్వము గానట్టియు రజోగుణదూషితమైనట్టియునగు చిత్తము ముందు చెప్పబడిన సమాధులయందు ప్రవర్తించకయున్నది. అందులకై బహుళములగు నుపాయములను దెలుపుచున్నారు. అందులో బహిరంగ సాధనమగు క్రియాయోగమును వచించుచున్నారు.

సూ॥ తపస్స్వాధ్యాయేశ్వరప్రణిధానాని క్రియాయోగః ॥ 1

పద॥ తపస్స్వాధ్యాయేశ్వరప్రణిధానాని - క్రియాయోగః.

అర్థము॥ తపస్స్వాధ్యాయేశ్వరప్రణిధానాని - (1) తపః = తపస్సు, (2) స్వాధ్యాయ = స్వాధ్యాయము, ఈశ్వరప్రణిధానాని = ఈశ్వరప్రణిధానము (ఇవి

మూడు), క్రియాయోగః = క్రియాయోగము (అగుచున్నవి).

తా॥ మలినచేతస్కులుగూడ క్రియాయోగము నాచరించినచో సమాధినిష్ఠులగుచున్నారు. కాన క్రియాయోగమును విశదపరచుచున్నారు. (1) తపస్సనగా హితమును గలుగజేయునట్టి పవిత్రాన్నమును మితముగా భక్షించుట, (2) స్వాధ్యాయమనగా పరమపవిత్రములగు ప్రణవాది మన్త్రముల జపించుట, (3) ఈశ్వరునియందు (విలాసము కొఱకు గైకొన్న మనోహర శరీరముగల పరమగురువుయందు) మనోవాక్కాయములతో నాచరింపబడు భక్తివిశేషము ఈశ్వరప్రణిధాన మనబడును. ఈ మూడును యోగసాధనలై క్రియారూపములగుటచే క్రియాయోగములో జేరును. "ఆయుర్ఘృతం = ఆయుస్సే నేయి" నేయి ఆయుస్సును గలుగజేయునుగాన అభేదముతో నెటుల వ్యవహరింతుమో, అటులనే యోగమునకు సాధనము లయినవి తపస్స్వాధ్యాయాదులు, క్రియాయోగము సాధ్యము, ఇటుల సాధ్యసాధనభావముచే వేరుగానున్నను, తపాదులే క్రియాయోగమని యభేదముతో వ్యవహరింతురు. ఇటుల ప్రయోగించుట తపాదులు లేనిదే క్రియారూపయోగము సిద్ధించదని భావము.

సూ॥ సమాధిభావనార్థః క్లేశతనూకరణార్థశ్చ ॥ 2

పద॥ సమాధిభావనార్థః - క్లేశతనూకరణార్థః - చ.

అర్థము॥ సమాధిభావనార్థః - సమాధి = సమాధియొక్క, భావనా = సిద్ధియే, అర్థః = ప్రయోజనముగా గలదియు, క్లేశతనూకరణార్థశ్చ - క్లేశ = అవిద్యాది క్లేశముల యొక్క, తనూకరణ = శిథిలీకరణమే, అర్థః = ఫలముగా గలదిగను (క్రియాయోగమగును).

అవ॥ క్రియాయోగ ఫలమును నుడువుచున్నారు.

తా॥ అవిద్యాది క్లేశములు నశించి సమాధిలాభముకొఱకు క్రియాయోగ మనుష్ఠేయము. ఇది ఫలితార్థము — దీర్ఘకాలము, సందులేక కడునాదరముతో తపసాది క్రియాయోగాంగానుష్ఠానబలముచే క్లేశములు క్షీణించినవై ఆత్మసాక్షాత్కారము నిరుపద్రవముగా గలుగగా, పూర్తిగా సంస్కారమాత్రముఃగూడ మిగులకుండా సమూలముతో నాశమొందుచున్నవి.

సూ॥ అవిద్యాఽస్మితారాగద్వేషాభినివేశాః పఞ్చ క్లేశాః ॥ 3

పద॥ అవిద్యాఽస్మితారాగద్వేషాభినివేశాః - పఞ్చ - క్లేశాః.

అర్థము॥ అవిద్యా ... ... నివేశాః = (1) అవిద్యయు, (2) అస్మితయు, (3) రాగము, (4) ద్వేషము, (5) అభినివేశము ఇవి, పంచ = అయిదు, క్లేశాః = క్లేశములు (అగును).

అవ॥ ఆ క్లేశము లెన్నిరో వానిని చెప్పుచున్నారు.

తా॥ పురుషం క్లేశయన్తి దుఃఖా కుర్వన్తి ఇతి క్లేశాః = జీవుని దుఃఖవంతుని గా జేయునవి గాన క్లేశము లనబడెను. ఈ క్లేశములు (1) అవిద్య, (2) అస్మిత, (3) రాగము, (4) ద్వేషము, (5) అభినివేశము అని అయిదుగా నున్నవి. ఇవి యథార్థవిరుద్ధములు గాన, విపర్యయములనియు చెప్పబడును.

సూ॥ అవిద్యాక్షేత్రముత్తరేషాం ప్రసుప్తతనువిచ్ఛిన్నోదారాణామ్॥

పద॥ అవిద్యా - క్షేత్రం - ఉత్తరేషాం - ప్రసుప్తతనువిచ్ఛిన్నోదారాణాం.

అర్థము॥ ప్రసుప్త తనువిచ్ఛిన్నోదారాణాం = (1) ప్రసుప్తములును, (2) తనువులును, (3) విచ్ఛిన్నములును, (4) ఉదారములును అయిన, ఉత్తరేషాం = అవిద్యానన్తరమున్న అస్మితా రాగ ద్వేషాభినివేశములకు, అవిద్యా = అవిద్య, (విపర్యయము = యథార్థ విరుద్ధమైనది), క్షేత్రం = ఉత్పత్తిస్థానము.

అవ॥ అవిద్యయే అస్మితాదులకు మూలకారణమని చెప్పుచున్నారు.

తా॥ (1) అస్మిత, (2) రాగ, (3) ద్వేష, (4) అభినివేశములు నాలుగున్ను ఉద్బోధక సామగ్రి లేనందుచే నభివ్యక్తములు గాక బీజరూపములు గా నున్నవగుటచే (1) ప్రసుప్తములనియు (అవ్యక్తములో నిద్రించుచున్నవనియు) తపస్స్వాధ్యాయాదులగు క్లేశవిరోధభావనలచేత కృశించునవి గనుక (2) తనువులనియు, మధ్య మధ్య విచ్ఛిన్నములై (అడ్డగించబడినవై) పుట్టుచున్నవి గనుక (3) విచ్ఛిన్నములనియు, (రాగము క్రోధకాలమున నుండదు, ఆ ద్వేషము రాగకాలమున నుండదు, విచారణాసమయమున అభిమానరూప అస్మితయు నుండదు. అస్మితావస్థలో విచారణయుండదు, ప్రాణులకు సహజమే అను జ్ఞానము యొక్క నిశ్చయముచే అభినివేశము (మరణభయము) నుండజాలదు,

జ్ఞానము లేనప్పుడు అభినివేశముండియేతీరును. ఈ రీతిగా నవి తిరస్కరింపబడినవై విచ్ఛిన్నములై యున్నవి) సహకారు లున్నందుచే నవి యభివృద్ధిని గాంచును గనుక ఉదారములనియు చెప్పబడుచున్నవి. ఈ అస్మితాదులకు యథార్థముగా నుండని విపర్యయ మనదగు అవిద్యయే ప్రసవభూమి. భావరూప విపర్యయము అవిద్య. అనగా భావాభావ రూపమైనదియే అవిద్య.

సూ॥ అనిత్యాశుచిదుఃఖానాత్మసు నిత్యశుచిసుఖాత్మఖ్యాతిరవిద్యా॥ 5

పద॥ అనిత్యాశుచిదుఃఖానాత్మసు - నిత్యశుచిసుఖాత్మఖ్యాతిః - అవిద్యా.

అర్థము॥ అనిత్యాశుచిదుఃఖానాత్మసు - అనిత్య = అనిత్యములును, అశుచి = అశుచి యును, దుఃఖ = దుఃఖములుగను, అనాత్మసు = ఆత్మభిన్నములుగ నున్న పదార్థములయందు (క్రమముగా), నిత్యశుచి సుఖాత్మఖ్యాతిః - నిత్యశుచిసుఖాత్మ = నిత్యము, శుచి, సుఖము, ఆత్మ వీటియొక్క, ఖ్యాతిః = జ్ఞానము, అవిద్యా = అవిద్య యనబడును.

అవ॥ అవిద్యా స్వరూప నిరూపణము.

తా॥ అతస్మిన్ తద్బుద్ధిః విపర్యయః = యథార్థము కానిదానియందు యథార్థ బుద్ధి = త్రాటియందు సర్పబుద్ధి విపర్యయము మనబడును. ఇదియే అవిద్యయని చెప్పుచున్నారు. ఎటులనగా (1) అనిత్యములగు స్వర్గాదులయందు నిత్యత్వాభిమానము, (2) అశుద్ధమయిన మాంస రక్త దుర్గంధ మల మూత్రాదులతో కూడిన దేహమందు శుచిత్వబుద్ధి, (3) దుఃఖకరములగు స్రక్ చందన వనితాదులందు సుఖత్వారోపము, (4) అనాత్మ పదార్థములగు దేహాదులందు ఆత్మత్వబుద్ధి ఈ ప్రకారము నాలుగు విధములయినది అవిద్య యని తెలియవలయును.

## సూ॥ దృగ్దర్శనశక్త్యోరేకాత్మతేవాస్మితా ॥ 6

పద॥ దృగ్దర్శనశక్త్యోః - ఏకాత్మతా - ఇవ - అస్మితా.

అర్థము॥ దృగ్దర్శనశక్త్యోః - దృక్ = పురుషుడు (ఆత్మ), దర్శనశక్త్యోః = సత్త్వము (బుద్ధి) ఈ రెంటికిని, ఏకాత్మతా ఇవ = ఒకే స్వరూపము గలిగియుండుటవలె నున్నది, అస్మితా = అస్మిత యనబడును.

అవ॥ అవిద్యాజన్యమగు అస్మితా నిరూపణను గావించుచున్నారు.

తా॥ దృక్శక్తిగు ఆత్మపురుషుడు దర్శనశక్తి యనబడు బుద్ధియు (సత్త్వము) ఇవి రెండు వేరుగానున్నను వానియం దభేదముచే నొకటియే యని భావించి నేనున్నాను నేను జూచుచున్నాను, తెలియుచున్నానను ఏకత్వాభిమానమే బుద్ధియందు ఆత్మత్వ బుద్ధియే అస్మిత యనబడును. (సత్త్వపురుషులయందు నేనున్నానను ఏకత్వాభిమానమే అస్మిత).

7 సూ॥ సుఖానుశయీ రాగః ॥

పద॥ సుఖానుశయీ – రాగః.

అర్థము॥ సుఖానుశయీ = సుఖము ననుసరించియుండు, తృష్ణ (ఆశ) రాగః = రాగము,

అవ॥ రాగ నిరూపణము.

తా॥ సుఖవంతుల సుఖముల సంస్మరించి సుఖసాధనములయందలి అత్యాశ రాగము.

8 సూ॥ దుఃఖానుశయీ ద్వేషః ॥

పద॥ దుఃఖానుశయీ – ద్వేషః.

అర్థము॥ దుఃఖానుశయీ = దుఃఖానుభవానంతరమున్న క్రోధము, ద్వేషః = ద్వేషము.

తా॥ దుఃఖితుల దుఃఖమును స్మరించి దుఃఖసాధనయందు నింద, ద్వేషమనబడును.

సూ॥ స్వరసవాహీ విదుషోఽపి తథాఽఽరూఢోఽభినివేశః ॥ 9

పద॥ స్వరసవాహీ - విదుషః - అపి - తథా - ఆరూఢః - అభినివేశః.

అర్థము॥ స్వరసవాహీ - స్వరస = స్వభావముగనే, వాహీ = ప్రవహణశీలమైన, విదుషోఽపి = పండితునకుగూడ, తథా = మూఢునికివలె, ఆరూఢః = నాటుకొనిన (మృత్యుభయము), అభినివేశః = అభినివేశమనబడును.

తా॥ శరీరాదులకును నాకును నిత్యసమ్బన్ధ ముండవలయునని తలంచి వియోగము గలుగునని నిత్యము భయపడుటయే అభినివేశము. మూఢునికివలె పండితునకును స్వాభావసిద్ధమై జన్మపరంపరగా ప్రవహించుచున్నదియునై స్థిరముగాయున్న మృత్యుభయమే, అభినివేశమనదగును. పురుగులు మొదలుకొని పండితులవరకును ప్రాణిమాత్రమునకు పూర్వజన్మములనుండి మరణదుఃఖ మనుభవసిద్ధమై సంస్కారబలముచే హృదయమున ఆరూఢమై

యున్నది. అందుచే శరీరాదులకును నాకును వియోగము గలుగకుండుగాక యని కారణము లేకనే నిత్యము మృత్యువువలన భయపడుట అభినివేశమగును.

సూ॥ తే ప్రతిప్రసవహేయాస్సూక్ష్మాః ॥ 10

పద॥ తే – ప్రతిప్రసవహేయాః – సూక్ష్మాః.

అర్థము॥ సూక్ష్మాః = (క్రియాయోగముచే) శిథిలములయిన, తే = ఆ పంచక్లేశములు, ప్రతిప్రసవహేయాః – ప్రతిప్రసవ = చిత్తనాశముచే, హేయాః = విడువదగినవి.

అవ॥ ఇంతవరకును కర్మయోగమును వచించి దానిచే పంచక్లేశములు క్షీణములై తర్వాత జనించు యాత్మసాక్షాత్కారరూప జ్ఞానాగ్నిచే దగ్ధములై దగ్ధబీజమువలె నగునని చెప్పబడెను. ఇప్పుడు ఆ దగ్ధ సంస్కారములయొక్కయు సమూలనాశమును దెలుపుచున్నారు.

తా॥ ప్రతిప్రసవమనగా చిత్తము ప్రకృతిలో లయించుటయని యర్థము. అర్థాత్ అసంప్రజ్ఞాతసమాధిచే చిత్తము నశించగా సూక్ష్మరూప పంచక్లేశములున్న తమకు కారణమగు చిత్తముయొక్క నాశముచే పూర్తిగా మూలముతోటి హతములగుచున్నవి.

11

సూ॥ ధ్యానహేయాస్తద్వృత్తయః ॥

పద॥ ధ్యానహేయాః - తద్వృత్తయః.

అర్థము॥ తద్వృత్తయః = క్లేశవృత్తులు, ధ్యానహేయాః = పురుషధ్యానముచే విడువదగినవి.

అవ॥ మఱియొక యుపాయమును క్లేశనాశమునకై జెప్పుచున్నారు.

తా॥ క్రియాయోగముచే అవిద్యాది క్లేశవృత్తులు సూక్ష్మతను గాంచినవి. సంస్కారరూపముననున్న ఆ క్లేశములును పరమాత్మ ధ్యానముచే నాశము నొందును. మఱియు స్వచిత్తనాశముచే సమూలముగా నవి విలయమొందుచున్నవని తాత్పర్యము.

12

సూ॥ క్లేశమూలః కర్మాశయో దృష్టాదృష్టజన్మవేదనీయః ॥

పద॥ క్లేశమూలః - కర్మాశయః - దృష్టాదృష్టజన్మవేదనీయః.

అర్థము॥ క్లేశమూలః = అవిద్యాది క్లేశములకు కారణముగా గల (క్లేశములచే గలిగిన), కర్మాశయః = పుణ్యపాపరూప కర్మ సంస్కారము, దృష్టాదృష్ట జన్మవేదనీయః - దృష్టాదృష్ట = చూడబడిన చూడబడని, జన్మ = జన్మములచేత, వేదనీయః = అనుభవించదగినది.

అవ॥ ఈలాగున పంచక్లేశముల స్వరూపమును తన్నిషేధోపాయములను నిరూపించి, ఈ క్లేశములే పుణ్య పాప కర్మ సంస్కారములకు హేతువులని తెలుపరచుచున్నారు.

తా॥ ఈ అవిద్యారాగ ద్వేషాదులచే కర్మాశయము (పుణ్య పాపరూప కర్మ సంస్కారము) నేర్పడుచున్నది. ఇదియే ధర్మాధర్మరూపము. ఈ కర్మసంస్కార మీ జన్మయందును, పరలోకమునందును యనుభవించదగియున్నది. ఒకే జన్మమునందు పుణ్య పాప కర్మసంస్కార మనుభవింపదగియున్నదనుదాని కుదాహరణములు నందికేశ్వరుడు తీవ్ర తపశ్చర్యాదులను గావించి, ఈశ్వరుని సమారాధించి యప్పుడే దేవత్వమును గణాధ్యక్షతను పొందెను. పాపసంస్కారమునకు దృష్టాంతము నహుషుడు. అగస్త్య మహర్షి కపరాధముజేసి యప్పుడే సర్పమాయెను. పరలోకమున ననుభవింపదగిన పుణ్య పాప సంస్కారమున కుదాహరణములు స్వర్గనరకాదులు.

సూ॥ సతి మూలే తద్విపాకో జాత్యాయుర్భోగాః ॥ 13

పద॥ సతి – మూలే – తద్విపాకః – జాత్యాయుర్భోగాః.

అర్థము॥ మూలే సతి = క్లేశరూప ప్రధానకారణముండగా, తద్విపాకః - తత్ = ఆ ధర్మాధర్మరూప కర్మసంస్కారములయొక్క, విపాకః = ఫలరూపములైన, జాత్యాయుర్భోగాః - జాతి = జననము, దేవత్వాది జాతులుగాని, ఆయుః = చిరకాలము దేహప్రాణములకు సంయోగరూపమైన జీవనము, భోగాః = ఇంద్రియ సుఖానుభవమున్ను గలుగును.

అవ॥ ఇకను ధర్మాధర్మ కర్మసంస్కారములకు ఫలములయిన జాత్యాయుర్భోగముల కును అవిద్యాది క్లేశములే కారణములని నిరూపించుచున్నారు.

తా॥ మూలభూతములగు నవిద్యాది పంచక్లేశములున్నవి గనుకనే ధర్మాధర్మ కర్మసంస్కార ఫలితములగు జన్మము, దేవత్వము మొదలయినవి దేహప్రాణముల సంబంధము చాలకాలముండుట (బ్రతుకుట) యిన్ద్రియ సుఖములు గలుగుచున్నవి. వానిలో కడపటిదగు విషయసుఖములే ప్రధానములు. జాతి, ఆయుస్సులు ఈ రెండు నప్రధానములు అని తెలియవలయు. "క్లేశమూలః సతిమూలే" ఈ రెండు సూత్రములకును సంపిండితార్థ మేమనగా - అవిద్యాది క్లేశములున్నవి. కావున ధర్మాధర్మరూప సంస్కార

ములు గలుగుచున్నవి. జాత్యాయుర్భోగము లనుభూతములగుచున్నవి. వివేకఖ్యాతిచే (ఆత్మసాక్షాత్కారముచే) అగ్నిచే దహింపబడిన బీజములవలె కర్మసంస్కారములకు కారణములయిన అవిద్యాది క్లేశములు కాల్చబడగా అప్పుడు పుణ్యాపుణ్యరూప కర్మ సంస్కారము నాశమొందినది గనుకనే పొట్టులేని ధాన్యమువలె (బియ్యము) ఫలము నీయజాలదు.

సూ॥ తే హ్లాదపరితాపఫలాః పుణ్యాపుణ్యహేతుత్వాత్ ॥ 14

పద॥ తే - హ్లాదపరితాపఫలాః - పుణ్యాపుణ్యహేతుత్వాత్.

అర్థము॥ తే = ఆ జాత్యాయుర్భోగములు, పుణ్యాపుణ్యహేతుత్వాత్ = పుణ్య పాప ములే కారణముగా గలవగుటవలన, హ్లాదపరితాపఫలాః - హ్లాద = సుఖము, పరితాప = దుఃఖము, ఫలాః = ప్రయోజనముగాగలవి.

అవ॥ ఆ జాత్యాయుర్భోగముల ఫలమును వచించి అవి విడువదగినవని చెప్పుచున్నారు

తా॥ ఈ జాత్యాయుర్భోగములు పుణ్యముచే గలిగిన సుఖము నొసంగుచున్నవి. పుణ్యజీవులు పవిత్ర దేవత్వాది జన్మములను లేక రాజత్వాది జన్మములను, సుఖజీవనము!

అనాయాస భోగములను పొందుదురు. పాపముచే గలిగిన జాత్యాయుర్భోగములు నీచ జన్మము, కష్టజీవనము, కష్టభోగములను గలిగించును. ఇవన్నియు అవివేకులకే గలుగును. వివేకులకు పై సుఖదుఃఖములు రెండును దుఃఖరూపములే గావున హేయములు.

సూ॥ పరిణామతాపసంస్కారదుఃఖైర్గుణవృత్తివిరోధాచ్చ దుఃఖమేవ సర్వం వివేకినః ॥ 15

పద॥ పరిణామతాప సంస్కారదుఃఖైః - గుణవృత్తివిరోధాత్ - చ - దుఃఖం - ఏవ - సర్వం - వివేకినః.

అర్థము॥ పరిణామతాప సంస్కారదుఃఖైః = పరిణామతాప సంస్కారములయొక్క దుఃఖములచేత, గుణవృత్తి విరోధాచ్చ-గుణ = సత్త్వరజస్తమోగుణములయొక్క వృత్తి = ప్రకాశాది చిత్తవృత్తులయొక్క, విరోధాచ్చ = పరస్పర బాధ్యబాధక భావరూప విరోధమువలనను, సర్వం = భోగసాధనమగు నీ జగత్తంతయు, వివేకినః = వివేకవంతునికి, దుఃఖమేవ = దుఃఖరూపమేను.

అవ॥ పుణ్యపాపములచే గలుగు సుఖదుఃఖములన్నియు వివేకముగలవారికి దుఃఖరూప

ములే యగుచున్నవను విషయమును స్పష్టపరచుచున్నారు.

తా॥ దుఃఖములు పరిణామతాప సంస్కారభేదముచే మూడు విధములుగానున్నవి. అందులో (1) పరిణామదుఃఖమనగా సుఖావస్థయందు ఇక రాబోవునట్టి సుఖమునకు కారణమగునట్టి పుణ్యము నాచరింపక వ్యర్థముగానే సుఖములయందలి ఆశారూపమైన మదముగా నున్నట్టి తామసవృత్తి నేను పుణ్యము చేయకపోతినే యను ప్రకారముచే చిత్తమును దుఃఖవంతముగా చేయునది, (2) తాపదుఃఖమనగా, సుఖానుభవకాలమునందు రోగాదులు కలుగుటచే సుఖమునకు ప్రతిబంధము కలుగుచున్నది. అప్పుడు రజోగుణ కార్యమైన సంతాపవృత్తి కలిగి నేను పాపిని, నేను దుష్టుడను ఇటువంటి భావనచే చిత్తమును సంతాపపెట్టునది, (3) సంస్కారదుఃఖమనగా, సుఖము నశించగా, అను భూతమగు సుఖమును స్మరించి స్మరించి ఆ సంస్కారముచే హృదయమును దహించునది, ఇట్టి త్రివిధ దుఃఖము లుండుటచేతను సత్త్వరజస్తమో గుణములయొక్క ప్రకాశ, ప్రవృత్తి, మోహరూపవృత్తులు అలలవలె హృదయమున నిరంతరము మార్పుచెందినవై పరస్పరము నొక వృత్తి యున్నపుడు మరియొకవృత్తి లేకపోవుట యను బాధ్యబాధకరూప విరోధము

తలనను జీవునికి భోగసాధనమైన ఈ జగత్తంతయు దుఃఖరూపమేను యని వివేకి తలంచు చున్నాడు. ఊర్ణాతంతువువలె (సాలెపురుగు నేత్రమునకు గోచరముగుదానివంతయు బాధించువిధమున) వివేకవంతుని దృష్టికిగోచరమగు జగద్వాసన ఉద్వేగము గలదానినిగా చేయుచున్నది. ఇందుచే సమస్తము దుఃఖకరము, హేయము.

సూ॥ హేయం దుఃఖమనాగతం ॥ 16

పద॥ హేయం – దుఃఖం – అనాగతం.

అర్థము॥ అనాగతం = రానట్టి, దుఃఖం = దుఃఖము, హేయం = విడువతగినది.

తా॥ ఇదివరకనుభవింపబడిన దుఃఖమతీతమైనది, వర్తమాన దుఃఖము భోగము చేత నశించుచున్నది. ఇక రాబోవునట్టి దుఃఖమే విడువతగినది.

సూ॥ ద్రష్టృదృశ్యయోః సంయోగో హేయహేతుః ॥ 17

పద॥ ద్రష్టృదృశ్యయోః – సంయోగః – హేయహేతుః.

అర్థము॥ ద్రష్టృదృశ్యయోః – ద్రష్టృ = ద్రష్టయగు పురుషునియొక్కయు, దృశ్య

యోః = బుద్ధిసత్త్వము (ప్రకృతి) యొక్క యు, సంయోగః = స్వస్వామిభావమను సంబంధము (నేనే యనె డహంకారము), హేయహేతుః - హేయ = విడువతగిన దుఃఖమునకు, హేతుః = కారణము.

అవ॥ దుఃఖకారణమగు దృశ్యసంబంధమును తెలుపుచున్నారు.

తా॥ ద్రష్ట పురుషుడగును, బుద్ధి సత్త్వమగు ప్రకృతియే దృశ్యము. వీనియొక్క సంయోగమనగా జీవాత్మ పురుషుడు దృశ్యమే నేననుట. చిత్తము ఇంద్రియముల వశమున నానావిధ శబ్దస్పర్శాద్యాకారముగా పరిణమించగా, అచ్చోట చిత్ప్రతిబింబ మేర్పడుచున్నది. అప్పుడు చిత్తమునకు చిత్ప్రతిబింబమునకు నున్న విభిన్నస్వరూపమును తెలియకనవిద్యచే ఆ స్వస్వామిభావము కలుగుచున్నది. ఈ అవిద్యాజన్యమైన స్వస్వామిభావము దుఃఖమునకు కారణము.

సూ॥ ప్రకాశక్రియాస్థితిశీలం భూతేంద్రియాత్మకం భోగాపవర్గార్థం దృశ్యమ్ ॥ 18

పద॥ ప్రకాశక్రియాస్థితిశీలం - భూతేంద్రియాత్మకం - భోగాపవర్గార్థం - దృశ్యమ్

అర్థము॥ ప్రకాశక్రియాస్థితిశీలం - ప్రకాశ = ప్రఖ్యారూపము సర్వేంద్రియ ప్రసన్నత, క్రియా = ప్రవృత్తి, స్థితి = నియమము, ఇవియే, శీలం = స్వభావరూపముగా గలదియు, భూతేంద్రియాత్మకం - భూత = స్థూలసూక్ష్మభూతములు, ఇంద్రియ = జ్ఞానేంద్రియ కర్మేంద్రియాంతఃకరణములు, ఆత్మకం = అభేదముతో పరిణమించిన ఆత్మ ఇది గలదియు, భోగాపవర్గార్థం = భోగమోక్షములే ప్రయోజనముగా గలదియు నగునది, దృశ్యం = దృశ్యము.

తా॥ ప్రకాశప్రవృత్తి నియమరూప ధర్మములు సత్త్వ రజ స్తమో గుణములకు సంబంధించినవి. ఇట్టి త్రిగుణాత్మకమైనదియు, మహాభూత తన్మాత్రల యొక్కయు, బాహ్యేంద్రియాంతరేంద్రియములయొక్కయు భేదముతో గూడుకొని ప్రకృతి పురుష వివేకశూన్యమై అభేదాత్మతో వ్యవహరింప యోగ్యమైనదియు సుఖానుభవ మోక్షములకు ప్రయోజకమైనది దృశ్యమనబడును.

## సూ॥ విశేషాఽవిశేషలింగమాత్రాలింగాని గుణపర్వాణి ॥ 19

పద॥ విశేషాఽవిశేషలింగమాత్రాలింగాని - గుణపర్వాణి.

అర్థము॥ గుణపర్వాణి = త్రిగుణములయొక్క అవస్థావిశేషములు, విశేషావిశేషలింగ మాత్రాలింగాని - విశేష = (1) షోడశవికారములు, అవిశేష = తన్మాత్రాహంకారములగు ప్రకృతియొక్క (2) షడ్వికారములు, లింగమాత్ర = (3) మహత్తత్త్వము, అలింగాని = లీనము గాని, (4) ప్రధానము ఇవి నాలుగగుచున్నవి.

అవ॥ గుణత్రయ స్వరూపమైన దృశ్యప్రపంచముయొక్క స్వరూపమును చెప్పి తద్విభాగమును చూపుచున్నారు.

తా॥ స్థూల మహాభూతములు కర్మజ్ఞానేంద్రియములు అంతఃకరణములను నివి పదునారు వికారములు విశేషములనబడును. పంచతన్మాత్రలు నహంకారములు చేరిన నారును ప్రకృతియొక్క వికారములు. ఇవి అవిశేషములగును. ప్రకృతి వికారరూపమైన మహత్తత్త్వము లయమును మాత్రము పొందునది గనుక లింగమాత్రమగును. త్రిగుణములు సామ్యావస్థలో నుండుటయే స్వరూపముగా గల ప్రధానము అలింగమనబడును. ఈ ప్రకారము (1) విశేష, (2) అవిశేష, (3) లింగమాత్ర, (4) అలింగములని దృశ్యము నాలుగు తెఱంగులై యున్నది.

సూ॥ ద్రష్టా దృశిమాత్రః శుద్ధోఽపి ప్రత్యయానుపశ్యః ॥ 20

పద॥ ద్రష్టా - దృశిమాత్రః - శుద్ధః - అపి - ప్రత్యయానుపశ్యః.

అర్థము॥ దృశిమాత్రః = దృక్ స్వరూపుడైన, ద్రష్టా = ద్రష్టయగు పురుషుడు, శుద్ధోపి = శుద్ధుడై అపరిణామియైనను, ప్రత్యయానుపశ్యః - ప్రత్యయ = బుద్ధి విషయమును, అనుపశ్యః = ఉపద్రష్టయై ప్రకాశింపజేయుచున్నాడు.

అవ॥ విడువతగిన ప్రపంచమును నిరూపించి గ్రహింపదగిన ద్రష్టను నిరూపించుచున్నారు.

తా॥ ఆత్మపురుషుడు ద్రష్టగాను చైతన్యమాత్ర స్వరూపుడైయున్నాడు. బుద్ధి ధర్మములగు జ్ఞానాది ధర్మములు కలవాడు కాడు. అవి వృత్తిరూపములగుటచే నాశమును జెందుచున్నవి. శ్లో॥ ఉపయన్నపయన్ధర్మో వికరోతి హి ధర్మిణం ॥ = జ్ఞానవృత్తిరూప ధర్మము వృద్ధిని పొందినదై, ఆత్మపురుషుని ప్రకాశింప జేయుటయు ఆ ధర్మములు క్షీణించినవై, ఆత్మను ప్రకాశింప జేయకుండుటయు, అను వికారములను ఆత్మకు కలుగజేయుచున్నవి అను న్యాయముచే ఆత్మయొక్క కూటస్థత్వము భంగమై పోవుచున్నది. కావున నాత్మపురుషుడు శుద్ధుడు అపరిణామియైనను బుద్ధి వృత్తులను సాక్షాత్కరించుచున్నాడు.

అయినను బుద్ధి తాదాత్మ్యమును పొందినవాడువలె ప్రతిభాసించుచున్నాడు. కావున దుఃఖకారణమగు సంయోగమును విడువవలయును.

సూ॥ తదర్థ ఏవ దృశ్యస్యాత్మా ॥ 21

పద॥ తదర్థః – ఏవ – దృశ్యస్య – ఆత్మా.

అర్థము॥ దృశ్యస్య=దృశ్యముయొక్క, ఆత్మా-స్వరూపము, తదర్థ ఏవ=ఆజీవునికొఱకే.

అవ॥ ఇటుల దృశ్యద్రష్టలను తెలిపి దృగ్దృశ్యములకు శేషశేషిభావనిరూపణను గావించుచున్నారు. శేషశేషిభావమనగా, శేషమనగా ప్రపంచము, శేషియనగా పరమాత్మ, వీని సంబంధము.

తా॥ భోగ్యమగు (అనుభవింపదగిన) దృశ్యస్వరూపము భోక్తయగు జీవాత్మకొఱకే అగుచున్నది. దృశ్య మచేతనమగుటచే దృశ్యస్వరూపము దృశ్యమునకు కాదు, భోగ్యరూపార్థము నశించగా దృశ్యము నశించుచున్నదని భావము.

సూ॥ కృతార్థం ప్రతినష్టమప్యనష్టం తదన్యసాధారణత్వాత్ ॥ 22

పద॥ కృతార్థం – ప్రతినష్టం – అపి – అనష్టం – తత్ – అన్యసాధారణత్వాత్.

అర్థము॥ తత్ = ఆ దృశ్యము, కృతార్థం ప్రతి = ఆత్మ సాక్షాత్కారముచే కృతకృత్యుడగువానినిగూర్చి, నష్టం అపి = వ్యాపారశూన్యమైనదైనను, అన్యసాధారణత్వాత్ = అకృతార్థులగు నవివేకులకు సాధారణమయిన దగుటవలన, అనష్టం = నాశము నొందకయే యున్నది.

అవ॥ ఓయీ! ప్రయోజనమగు భోగ్యవస్తువు భోగముచే నశించగా నాత్మసాక్షాత్కారముచే కృతార్థుడగుటచే ప్రధానమనబడు దృశ్యమే వ్యాపారరహితమై నశించగా, ఇక సంసారమే లేదని నుడువుట సమంజసము గాదని తెలుపుచున్నారు.

తా॥ ప్రధానమనునది ఒకటియే. పురుషులు (జీవులు) అనేకులు. పురుష సాక్షాత్కారము గలుగువరకు ఆ ప్రధానమగు దృశ్యము భోగాపవర్గముల నొసగుచునేయున్నది. ఆత్మసాక్షాత్కారము గలిగి కృతార్థుడగు యోగిపురుషునకు దృశ్యము బంధమోక్షములను నిర్వ్యాజాలక నశించుచున్నది. అనన్తము జీవులున్నందుచే కృతార్థుని విషయమున దృశ్యము నశించినను, అవివేకుల విషయమున సాధారణముగా నున్నది. నాశ మొందుటలేదు కావున ఒకడు ముక్తుడయిన నందరు ముక్తులు కావలయునుగదా యను ప్రశ్న కవకాశము లేదని తాత్పర్యము.

సూ॥ స్వస్వామిశక్త్యోః స్వరూపోపలబ్ధిహేతుస్సంయోగః ॥ 23

పద॥ స్వస్వామిశక్త్యోః - స్వరూపోపలబ్ధిహేతుః - సంయోగః.

అర్థము॥ స్వస్వామిశక్త్యోః - స్వ = దృశ్యము, స్వామి = ద్రష్ట- వీటియొక్క,
శక్త్యోః = స్వభావములయొక్క, స్వరూపోపలబ్ధిహేతుః - స్వరూప =
భోగాపవర్గ రూపముయొక్క, ఉపలబ్ధిహేతుః = ప్రాప్తికి కారణమైనది,
సంయోగః = సంయోగమనబడును.

అవ॥ దృగ్దృశ్య సంబంధమును నిరూపించుచున్నారు.

తా॥ స్వశక్తి, స్వామిశక్తి యనగా దృగ్దృశ్యస్వభావములు. ఇవి రెండును
చేతనారూప చిత్తముయొక్క ధర్మములు. వీని కింటికిని భోగాపవర్గరూప స్థితియొక్క
ప్రాప్తి దృగ్దృశ్య స్వభావమగు సంయోగముచేతనే గలుగుచున్నది. కావున పురుషునకు
దృశ్యసంబంధముచేతనే బంధమోక్ష ప్రాప్తి గలుగును. ఈ దృగ్దృశ్య సంయోగ మవిద్యచే
గలిగినది. ఏది యుండిన భోగాపవర్గములు గలుగునో, యేది లేకుండిన భోగాపవర్గప్రాప్తి
గలుగదో అదియే దృగ్దృశ్యభావము. అనగా దృశ్యమునందలి ఆత్మత్వబుద్ధి సకల

వ్యవహారమూలము, దృగ్దృశ్య సంయోగము, భోగాపవర్గరూప కార్యముచేతనే ఊహింపనగును.

సూ॥ తస్య హేతురవిద్యా ॥ 24

పద॥ తస్య - హేతుః - అవిద్యా.

అర్థము॥ తస్య = ఆ దృగ్దృశ్య సంబంధమునకు, హేతుః = కారణము, అవిద్యా = అవిద్య.

తా॥ దృగ్దృశ్య సంయోగమునకు కారణ మవిద్యయనియే నెఱుంగవలయును.

సూ॥ తదభావాత్సంయోగాభావో హానం తద్దృశేః కైవల్యమ్ ॥ 25

పద॥ తదభావాత్ - సంయోగాభావః - హానం - తత్ - దృశేః - కైవల్యం.

అర్థము॥ తదభావాత్ = ఆ యవిద్య లేకపోవుటవలన, సంయోగాభావః = దృశ్యసంబంధము లేకపోవుట, హానం = హానము, తత్ = ఆ దృశ్యసంబంధ త్యాగము, దృశేః = జీవపురుషునికి, కైవల్యం = మోక్షము (తానొక్కడై నిలుచుట).

అవ॥ అవిద్యా త్యాగోపాయమును రెండు సూత్రములచే నుడువుచున్నారు.

తా॥ స్వస్వరూప పరమాత్మవిద్యచే నవిద్య నశింపగా, సకల ప్రకృతిసంబంధ

ములు దొలంగును. అదియే చిత్స్వరూప జీవునకు ముక్తి, తానొక్కఁడై యుండుట యగును.

సూ॥ వివేకఖ్యాతిరవిప్లవా హానోపాయః ॥ 26

పద॥ వివేకఖ్యాతిః – అవిప్లవా – హానోపాయః.

అర్థము॥ వివేకఖ్యాతిః = వివేకజ్ఞానము (ప్రకృతి పురుషుల వేరుగా దెలియుట), అవిప్లవా = అవిద్యాసంబంధమును నుపద్రవము లేనిదై, హానోపాయః – హాన = అవిద్యానాశమునకు, ఉపాయః = కారణము.

తా॥ సకల దృశ్యమునకన్న వేరుగా నాత్మను సాక్షాత్కరించుట యగు వివేకఖ్యాతి, ప్రకృతి బంధమునుండి విముక్తమై యవిద్యావిరోధియై తన్నాశమును గావించుచున్నది. గాన వివేకఖ్యాతి యవిద్యా నాశమునకు హేతువు. “1. తదభావాత్, 2. వివేకఖ్యాతిః” అను నీ రెండు సూత్రముల యర్థమేమనగా, ఆదరముతో నెడతెగక బహుకాలము యమనియమాద్యష్టాంగయోగసాధనానుష్ఠానములచే, దృశ్యముకన్న పరమాత్మయగు నేను వేరుగా యున్నాననను వివేకఖ్యాతి ప్రతిబంధరహితమై గలుగగా

అవిద్యాది పంచక్లేశములు వాటి సమ్బన్ధమున్ను నిర్మూలము లగుచున్నవి. అందుచే పుణ్యపాప మిశ్రకర్మ సంస్కారములు తత్ఫలములగు సుఖ దుఃఖాదులును మూలకారణముతోటి హతములగుచున్నవి. తరువాత త్రిగుణాత్మక ప్రకృతియందును వితృష్ణారూప పరవైరాగ్యముచే నేను సకల దృశ్యమునకు వేరను విభిన్నరూప వివేకఖ్యాతియు నిరుద్ధము గాగా, అట్టి నిరోధాభ్యాసముచేత చిత్తము నివర్తించుచున్నది. అప్పుడు పరమాత్మపురుషుడు నిర్లిప్తుడై స్వస్వరూప ప్రతిష్ఠారూప కైవల్యమున నున్నాడు. అనగా వ్యష్టి సాక్షిత్వము, సమష్టిసాక్షిత్వమున్ను దొలగి స్వస్వరూపాఖండ కైవల్యమునే తాను పొందుచున్నాడని తాత్పర్యము.

## 27 సూ॥ తస్య సప్తధా ప్రాన్తభూమిః ప్రజ్ఞా ॥

పద॥ తస్య - సప్తధా - ప్రాన్తభూమిః - ప్రజ్ఞా.

అర్థము॥ తస్య = అట్టి అఖండజ్ఞాన వైభవము గలవానికి, ప్రాన్తభూమిః - ప్ర = ప్రకర్షముగా, అన్త = నివృత్తియే ఫలముగా గల, భూమిః = అవస్థలుగల (అవి

ద్యాది పంచక్లేశనాశమే ఫలముగా గల్గిదియు, సప్తధా = ఏడు విధములయిన, ప్రజ్ఞా = ప్రజ్ఞ (గలుగును).

అవ॥ జీవన్ముక్త పురుషునికి గలిగిన ప్రజ్ఞావైభవమును పేర్కొనుచున్నారు.

తా॥ పరమాత్మ జ్ఞానముగల యోగివరునకు సర్వోత్కృష్టమైన సర్వవృత్తి, నాశమే ఫలముగాగల, పరిపూర్ణమైన ప్రజ్ఞ (అలౌకిక అప్రాకృత స్వానుభవజ్ఞానము) గలుగుచున్నది అది ఏడు తెఱఁగులుగా భాసిల్లును. అందులో నాలుగు ప్రజ్ఞలు కార్యవిముక్తములని పేరుగలవి మిగిలిన మూడు చిత్తవిముక్తములని చెప్పబడుచున్నవి. కార్యవిముక్తప్రజ్ఞలు – సకల కార్యములనుండి, సకల ప్రయత్నములనుండి విడువబడినవి. అనగా కార్యములు, ప్రయత్నములు నశించినవని తాత్పర్యము. అట్టి యనుభవజ్ఞానికి చేయదగిన దేదియు లేదని తెలియవలయును. చిత్తవిముక్తప్రజ్ఞలు – సకల సంస్కారములు నశించి, మనస్సు కతిశమైన ప్రజ్ఞలు, ఇవన్నియు అశుద్ధిరూపాజ్ఞానావరణము దొలగగా నితరసంస్కారములు లేనందుచే గలుగును. (ఇదియే సమాధి). సప్తవిధ ప్రజ్ఞలు:–

1. 'తెలియదగినదంతయు తెలియబడెను, నాకిక తెలియదగినది లేదు.' అని తెలియ

దగినదానియందు వాంఛానివృత్తి. ఇది జిజ్ఞాసానివృత్తిప్రజ్ఞ (అవిద్యా కార్యమంతయు దుఃఖరూపము కావున నది హేయము. ఆత్మ నిత్యము ఆనందము. అదియే తెలియదగినది, దానిని తెలిసికొంటిని అను జ్ఞానము నాకు గలిగినది. ఇక తెలియదగినది లేదను నిశ్చయరూపజ్ఞానము జ్ఞాతవ్యవస్తువాంఛానివృత్తిరూప ఆత్మవిషయకప్రజ్ఞ).

2. 'విడువదగిన సమస్త సంసారబంధముల దృశ్యప్రపంచమును విడచితిని. ఇక నాచే విడువదగినది లేదు' అని విడువదగినదానియందు ఇచ్ఛారాహిత్యము. ఇది జిహాసానివృత్తిప్రజ్ఞ (సంసార కారణము లన్నియు నశించుటచే బంధరహితుడను జ్ఞానము, హేయవస్తు విషయక జ్ఞానవిశిష్ట ఆత్మసంవిత్తి ప్రజ్ఞ).

3. 'కైవల్యప్రాప్తిచే పొందతగినది ప్రాప్తమాయెను, నాకు ప్రాప్తవ్య మేదియు లేదు' అను పొందదగినదానివిషయమై సంకల్పనివృత్తి. ఇది ప్రేప్సానివృత్తిప్రజ్ఞ. (ఈ చిత్తనిరోధ సమాధిచే పరమాత్మసాక్షాత్కారము గలుగుచున్నది) ఇది సాక్షాత్కారప్రజ్ఞ.

4. 'నాకు ఆత్మ వివేకఖ్యాతి లభించుటచే చేయదగినదంతయు నాచే చేయబడెను. ఇక చేయుదగిన దేదియు లేదు' అని చేయదగినదానియందు కరణేచ్ఛాఉభావము. ఇది

చికీర్షానివృత్తిప్రజ్ఞ. (ఆత్మజ్ఞానికి చేయదగినది లేనందుచే దేనియందును ఇచ్ఛలేక యుండుట సకల కార్యవిసర్గపూర్వక స్వయంప్రబోధప్రజ్ఞ). ఇక చిత్తవిముక్తిప్రజ్ఞలు 3.

5. 'నా బుద్ధి సత్త్వము కృతార్థమయినది అనగా నా బుద్ధి స్థితి సకల దుఃఖ సంస్కారము నశించుటచే నిరుద్ధమాయెను, బుద్ధియే లీనమాయెను' అను దుఃఖరహితస్థితి. ఇది శోకనివృత్తిప్రజ్ఞ, (బుద్ధి పరమాత్మలో కలియుటచే సకల దుఃఖములు నాశమగుచున్నవి. బుద్ధి సత్త్వరహిత శోకశాంతిరూప స్వాత్మప్రజ్ఞ).

6. 'నా బుద్ధి చిత్తాదిగుణములుగూడ నాధారము లేనందుచే పూర్తిగా లీనములయినవి. సంస్కారరూప ప్రయోజనము లేనందుచే నవి తిరుగా మొలవవు' అను భయరహితస్థితి. ఇది భయనివృత్తిప్రజ్ఞ (ఆధారమగు చిత్తాదులు లేనందుచే గుణములుగూడ నశించుచున్నవి. త్రిగుణములే లేనందుచే సకల అవిద్యాభయము తొలగుచున్నది. సకల గుణనివృత్తిపూర్వక నిరుద్ధసంస్కారజన్య అభయాత్మప్రజ్ఞ).

7. 'ఇటుల సకల దృశ్యజాతము నాశమగుటచే నేను గుణాతీతుడను, కేవల స్వస్వరూపమాత్రముచే నున్నవాడను, చిదేకరసుడను' అను విజ్ఞానముచే సకల వికల్ప

ములు నశించుచున్నవి. ఇది సకల వికల్పనివృత్తిప్రజ్ఞ (తాను గుణాతీతుడై ఆనందరూపు డగుటచే స్వస్వరూపమాత్రుడగుచున్నాడు. ఇది సకల సంశయరహిత స్వస్వరూపప్రజ్ఞ).

**సూ॥ యోగాఙ్గానుష్ఠానాదశుద్ధిక్షయే జ్ఞానదీప్తిరావివేకఖ్యాతేః ॥ 28**

పద॥ యోగాఙ్గానుష్ఠానాత్ - అశుద్ధిక్షయే - జ్ఞానదీప్తిః - ఆవివేకఖ్యాతేః.

అర్థము॥ యోగాఙ్గానుష్ఠానాత్ - యోగాంగ = యోగమునకు అంగములగు యమ నియమాదులయొక్క, అనుష్ఠానాత్ = అనుష్ఠానమువలన, అశుద్ధిక్షయే = అవిద్యాది పంచక్లేశరూప మలముయొక్క నాశము గలుగగా, ఆవివేకఖ్యాతేః = దృక్ దృశ్యముల వేరుపరచి ఆత్మస్వరూపమును తెలియునట్టి వివేకజ్ఞానము గలుగువరకు, జ్ఞానదీప్తిః - జ్ఞాన = ఆత్మను విషయీకరించునట్టి సమ్యక్ జ్ఞానముయొక్క, దీప్తిః = బుద్ధిప్రకాశరూపవృద్ధి (భవతి = అగుచున్నది).

అవ॥ ముందు యోగపాదమున, అన్తర్ముఖమైన ఏకాగ్రతను వహించిన మనస్సు గలవానికి అన్తరంగసాధనములగు అభ్యాసవైరాగ్యముల దెలిపి, ఈ సాధనపాదమున మొదటనే బహిర్ముఖమైన మనస్సు గలవానికి (అభ్యాసవైరాగ్యములను

అంతరంగసాధనలు లేని మధ్యమాధికారికి) చిత్తవశీకరణకై, తపస్స్వాధ్యాయాది రూప క్రియాయోగ మనుష్ఠేయముగా విధింపబడెను. ఇప్పుడంతకన్నను కనిష్ఠాధికారియగు (క్రియాయోగమును సాధింపలేని బహిర్ముఖవృత్తి గలవానికి చిత్తైకాగ్ర్యరూప సంప్రజ్ఞాత సమాధికి సాధనములగు నెనిమిది యంగములను తెలుపుచున్నారు.

తా॥ యమ నియమాది అష్టాంగముల బాగుగా ననుష్ఠించిన, అవిద్యాదిరూప క్లేశములచే గలుగు మాలిన్యము నశించుచున్నది. బుద్ధి శుద్ధమై వికాసవంతమై ఆత్మను విషయీకరించుచున్నది. ప్రకాశవంతమగుచున్నది. బుద్ధి కిట్టి సత్త్వోత్కర్షముచే నాత్మదర్శనరూప జ్ఞాన మభివృద్ధమగుచున్నది. ఇట్టి సమ్యగ్జ్ఞానము దృశ్యమునుండాత్మను వేరుజేసి తెలియునట్టి ఆత్మవివేకఖ్యాతి గలుగువరకు వృద్ధిని గాంచుచునేయుండును. అనగా యోగాంగానుష్ఠానజన్య బుద్ధివికాసరూప ఆత్మదర్శనరూపజ్ఞానము, ఆత్మ వివేకఖ్యాతికి కారణము. ఆ ఆత్మను పృథక్కరించి సాక్షాత్కరించుట కైవల్యప్రాప్తికి, అఖండ స్వానుభవజ్ఞానమునకు కారణము. యోగాంగానుష్ఠానము శుద్ధిద్వారా ప్రజ్ఞాసాధనమని భావము.

సూ॥ యమనియమాసనప్రాణాయామప్రత్యాహారధారణాధ్యాన-
సమాధయోఽష్టావంగాని ॥ 29

పద॥ యమ నియమ ఆసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణా ధ్యాన సమాధయః – అష్టౌ – అంగాని.

అర్థము॥ యమ........సమాధయః = (1) యమము, (2) నియమము, (3) ఆసనము, (4) ప్రాణాయామము, (5) ప్రత్యాహారము, (6) ధారణము, (7) ధ్యానము, (8) సమాధి అను, అష్టౌ = ఎనిమిదియు, అంగాని = యోగాంగములు.

అవ॥ మరల ఆ యోగాంగముల నామధేయములను పేర్కొనుచున్నారు.

తా॥ పైన జెప్పబడిన యమ నియమాదు లెనిమిదియు సాధనములయిన యోగాంగములు చిత్తనిరోధమునకై అనుష్ఠేయములు. ఇందులో సమాధి యోగమున కంతరంగ సాధనము.

సూ॥ అహింసాసత్యాస్తేయబ్రహ్మచర్యాపరిగ్రహా యమాః ॥ 30

పద॥ అహింసా సత్య అస్తేయ బ్రహ్మచర్య అపరిగ్రహాః - యమాః.

అర్థము॥ అహింసాసత్యాస్తేయ బ్రహ్మచర్యాపరిగ్రహాః = (1) అహింస, (2) సత్యము, (3) అస్తేయము, (4) బ్రహ్మచర్యము, (5) అపరిగ్రహము (అను నీయైదును), యమాః = యమములు.

అవ॥ ఆ యోగమిదంగములలో మొదటిదగు యమమును నిరూపించుచున్నారు.

తా॥ అహింసాదులు చేరియున్నందున నొక్కొక్కటియు యొక్కొక్క యమమగునని తెలుపుటకు యమములని బహువచనమును ప్రయోగించినారు. యమాః - శాస్త్రనిషిద్ధకర్మములనుండి యోగిని, 'యమయన్తి' = నివర్తించుచున్నవి గనుక, అహింసాదులు యమములని పేర్కొనబడుచున్నవి. వానిలో (1) అహింసయనగా, శరీరవాఙ్మనస్సుల చేతను (త్రికరణశుద్ధిగా) ఎప్పుడుగాని సమస్తభూతములకును (ఏప్రాణికిగాని) హింస గలుగజేయకుండుటయగును. (2) సత్యమనగా, సర్వదా అసత్యభాషణమును వర్జించుటగును. (3) అస్తేయమనగా, ఇతరవస్తువులను దొంగలింపకుండుటయని తెలియవలెను. (4) బ్రహ్మచర్యమనగా, అష్టవిధ దోషములు లేక బ్రహ్మచర్య మనుష్ఠింపవలయును. అందుచే నది అష్టవిధ బ్రహ్మచర్యమగును (అష్టవిధ మైథున కర్మత్యాగము). ప్రమాణ శ్లోకము:

"స్మరణం కీర్తనం కేళిః ప్రేక్షణం గుహ్యభాషణం ।
సంకల్పోఽధ్యవసాయశ్చ క్రియానిర్వృతిరేవ చ ॥
ఏతన్మైథునమష్టాంగం ప్రవదన్తి మనీషిణః ।
విపరీతం బ్రహ్మచర్యమేతదేవాష్టలక్షణమ్ ॥"

స్త్రీలను (1) స్మరింపకుండుట, (2) కీర్తింపకుండుట, (3) వారితో క్రీడింపకుండుట, (4) వారిని విషయాసక్తితో చూడకుండుట, (5) రహస్య సంభాషణను గావింపకుండుట, (6) వారిని సంకల్పింపకుండుట, (7) ఆ విషయమును నిశ్చయింపకుండుట, (8) భోగింపకుండుట. అను నీ యెనిమిదియు బ్రహ్మచర్యవ్రతమగును. (5) అపరిగ్రహమనగా, శరీరము నిలుచుటకుమాత్రము తప్ప వ్యతిరిక్తములయిన భోగసాధనవస్తువులను స్వీకరింపకుండుట యగును. ఇవి అయిదు యమములని తెలియవలయు.

## సూ॥ జాతిదేశకాలసమయానవచ్ఛిన్నాస్సార్వభౌమా మహావ్రతమ్॥

పద॥ జాతి దేశ కాల సమయానవచ్ఛిన్నాః - సార్వభౌమాః - మహావ్రతం.

అర్థము॥ జాతి......అనవచ్ఛిన్నాః - జాతి = బ్రాహ్మణాదిజాతి, దేశ = తీర్థాది పుణ్య

ప్రదేశము, కాల = పుణ్యతిథులు, సమయః = నియతములయిన, బ్రాహ్మణాది ప్రయోజనము, వివాహాద్యవసరములు వీనితో (ఈ నియమములతో), అనవచ్ఛిన్నాః = కూడనట్టియు, సార్వభౌమాః = సర్వాసు భూమిషు = అన్ని అవస్థలయందు బాగుగా తప్పక అనుష్ఠింపబడినవి గనుకనే (అహింసాదులు), మహావ్రతం = యోగులకు వీటియందే యెక్కువగా ప్రవృత్తి గలుగుచున్నది గాన మహావ్రతమని చెప్పబడుచున్నవి.

అవ॥ ఈ అహింసాదుల విషయమై యోగులచే గ్రహింపతగిన విశేషమును తెలుపుచున్నారు.

తా॥ ఈ అహింసా సత్యాది యమములు బ్రాహ్మణాది జాతిభేదము లేక, పుణ్యతీర్థాది దేశనియమము లేక, ఏకాదశ్యాది తిథిప్రయుక్త కాలవిశేషము లేక, బ్రాహ్మణాద్యవసరము లేక, బ్రాహ్మణాది పశుపక్ష్యాది జాతులయందును, యే ప్రదేశములయందును, ఏ తిథులయందును, ఏ అవసరము వచ్చినప్పుడును, సర్వకాల సర్వావస్థలయందును, శరీరవాఙ్మనస్సులనబడు త్రికరణములతోను బాగుగా ననుష్ఠింపబడెనేని, యదియే మహావ్రతమని చెప్పబడుచున్నది. మహావ్రతం అని ఏకవచనము ప్రయోగించుటచే, ఈ యమ

దును చేరి బాగుగా ననుష్ఠింపబడినప్పుడే ఆ యమము, మహావ్రతమగునని తెలియవలయును (అన్నిటిని అనుష్ఠించవలయు). మొదట నహింసావ్రతమునుగూర్చి వివరించుచున్నారు. జాతి = బ్రాహ్మణత్వాదికములైనజాతిని నేనెప్పుడును చంపబోనను నహింస జాతియందు మాత్రమున్నదిగాన ఇది జాతిపరిచ్ఛిన్నము. తీర్థాదిప్రదేశములయందుగాని, నియతచతుర్దశ్యాదికాలమందుగాని దేనినిగూడ చంపనను నహింస దేశ, కాల రెండింటియందు మాత్రమే ప్రవర్తించినదిగాన, నిది దేశ కాలపరిచ్ఛిన్నము. దేవబ్రాహ్మణాదుల కొరకును నేను హింస నాచరింపనను నహింస అవసరమునందే యున్నదిగాన ఇది సమయావచ్ఛిన్నము. ఈలాగున (1) ఏ ప్రాణినిగూడ, (2) ఎచ్చోటను, (3) ఎప్పుడును, (4) ఎవరికొరకును, నేను హింసింపనను నీయహింస నాలుగయిన జాతి, దేశ, కాల, సమయముల నియమములులేక అనుష్ఠింపబడినప్పుడే పూర్ణమగుచున్నది. సత్యాదులు గూడ నీ నాలుగు నియమములులేక యాచరింపబడిననే పరిపూర్ణములని తెలియవలయును. ఇదియే మహావ్రతము, యోగులకు అత్యంత ముపాదేయము.

**సూ॥ శౌచసంతోషతపస్స్వాధ్యాయేశ్వరప్రణిధానాని నియమాః॥32**

పద॥ శౌచ సంతోష తపః స్వాధ్యాయ ఈశ్వరప్రణిధానాని - నియమాః.

అర్థము॥ శౌచసంతోషతప ...... ప్రణిధానాని - శౌచ = బాహ్యాభ్యన్తరములయందు శుచిగానుండుట, సంతోష = దొరకినదానితో తృప్తిని బడయుట, తపః = కృచ్ఛ్రచాంద్రాయణాది వ్రతానుష్ఠానముచే శరీరశోషణము (ధ్యానయోగ్యముగు నటుల చేయుట), స్వాధ్యాయ = గీతోపనిషదాదుల పఠనము, గాయత్ర్యాది మంత్రానుష్ఠానము, ఈశ్వరప్రణిధానాని = ఫలాపేక్షలేక సమస్తకర్మల నీశ్వరుని కర్పించుట. ఈ యయిదును, నియమాః = నియమములు.

అవ॥ క్రమప్రాప్తమైన రెండవ అంగమైన నియమముయొక్క స్వరూపమును నిరూపించుచున్నారు.

తా॥ నియమాః = జన్మకారణములయిన కామ్యధర్మములను విడచి మోక్షహేతుక నిష్కామ ధర్మములయందు యోగిని, నియమయన్తి = ప్రేరేపించునవి కాన నియమములు. ఇవయిగు: (1) శౌచము - మట్టి, జలములచే బాహ్యమయిన శరీరమునందలి మలమును పోగొట్టుకొనుట. ఇది బాహ్యశౌచము. "మైత్రీకరుణా" అను సూత్రములో

వచించిన ప్రకారము మనస్సున అసూయా రాగద్వేషాది మాలిన్యములు లేకుండుట, ఇది అంతరశౌచము. (2) సంతోషము - యథాలాభ పరితుష్టి (అయాచితముగా వచ్చిన దానితో సంతృప్తిని జెందుట), (3) తపస్సు - కాయశోషణము. యోగయాజ్ఞవల్క్య గ్రంథమున నీ విషయమును తెలిపిరి.

శ్లో॥ విధినోక్తేన మార్గేణ కృచ్ఛ్రచాంద్రాయణాదిభిః ।
శరీరశోషణం ప్రాహుస్తాపసా స్తప ఉత్తమమ్ ॥

శాస్త్రోక్తవిధి ననుసరించి చాంద్రాయణాది వ్రతములచే శరీరశోషణమును - (ధ్యానమునకు యోగ్యమగునటుల చేయుటను) ఉత్తమ తపస్సని తాపసులు నుడివిరి. (4) స్వాధ్యాయము - గాయత్రీ మొదలగు మన్త్రముల అధ్యయనము జేయుటయగును. ఆ మంత్రములు వైదికములు, తాంత్రికములు అని ద్వివిధములు. వైదికములు తిరుగా ప్రగీతములు, అప్రగీతములు అని రెండు విధములు. తాంత్రికములున్ను స్త్రీ, పుం, నపుంసకములని మూడు విధములు. ఇటుల మంత్ర శాస్త్రరహస్యము లుద్ఘాటించినవి. ఈశ్వరప్రణిధానము - చెప్పబడినవియు చెప్పబడనివియునగు సమస్త కర్మలను ఫలము నపేక్షింపక యీశ్వరున కర్పించుటయగును. ఇందులకు ప్రమాణము:

శ్లో॥ కామతోఽకామతో వాపి యత్కరోమి శుభాశుభమ్ ।
తత్సర్వం త్వయి విన్యస్య త్వత్ప్రయుక్తః కరోమ్యహమ్ ॥

ఇచ్ఛతోగాని, అనిచ్ఛతోగాని యే శుభాశుభకర్మలను జేయుచున్నానో, దాని నంతయు నీకర్పించి నీచే ప్రేరేపింపబడినవాడనై నేను చేయుచున్నాను. అనగా సమస్త పాప పుణ్యకర్మల భగవంతుని కర్పించి ఈశ్వరాజ్ఞానువర్తియై యుండవలయునని తాత్పర్యము. కర్మలయందు ఫలాపేక్ష చాలా చెడ్డదని మహాత్ములు చెప్పుచున్నారు.

శ్లో॥ అపి ప్రయత్నసంపన్నం కామేనోపహతం తపః ।
న తుష్టయే మహేశస్య శ్వలీఢమివ పాయసమ్ ॥

కోరికతో దూషితమయిన తపస్సు ప్రయత్నముతో చేయబడినను, అది కుక్కచే నాకబడిన పాయసమువలె అపవిత్రమై ఈశ్వరసంతుష్టికి కానేరదు. ఈ శౌచాది పంచకము నియమమని తెలియవలయు.

33 సూ॥ వితర్కబాధనే ప్రతిపక్షభావనమ్ ॥

పద॥ వితర్కబాధనే - ప్రతిపక్షభావనం.

అర్థము॥ వితర్కబాధనే సతి - వితర్క = హింసాది విశేష సంకల్పములచే, బాధనే సతి = యమనియమాదులకు బాధ గలుగగా (దుష్ట సంకల్పములచే యమాద్యను ష్ఠానమునకు విఘ్నము గలుగగా), ప్రతిపక్ష భావనం-ప్రతిపక్ష = హింసాదులకు నాశకములయిన విచారాదులయొక్క, భావనం = భావనను (చేయవలయును).

అవ॥ యమాద్యనుష్ఠానమునకు విఘ్నకరములయిన హింసాది సంకల్పములు దృఢముగా నుండగా యమనియమాదిసిద్ధి గలుగు ప్రకారమును తెలుపుచున్నారు.

తా॥ (1) "నేను నితనిని చంపుదు"నను హింసాసంకల్పము, (2) "నేను అసత్యమును చెప్పెద"నను అసత్యసంకల్పము, (3) "పరద్రవ్య మపహరింతు"నను స్తేయసంకల్పము, (4) "నేను వీని భార్యను జెరతు"నను మైథునసంకల్పము, (5) "ఇతని వస్తువునకు నేనే యజమానుడ"నను పరిగ్రహసంకల్పము - ఈ యయిదును వితర్కములనబడును. ఈ వితర్కములచే యమనియమాదులకు భంగము గలుగునప్పుడు హింసాది సంకల్పములకు విరుద్ధములయిన (నాశకములయిన) భావనలను "సంసారాంగారేష్వహం తప్యమానో యమాదికం శరణముపగతో హింసాదికమత్యజమ్। పునస్తదాదదానః కాలేయకేన వాన్తాశినా సమః॥"

= అయ్యో ! ఈ ఘోరములగు సంసారపు టగ్నులయందు తపించుచున్న నేనిప్పుడు యహింసాదిరూప యోగధర్మయమాదులను శరణుపొందితిని. హింసాదులను విడచితిని. తిరుగా నా దుష్టసంకల్పముల స్వీకరించు నేని, కక్కిన కూడును తిను కుక్కతో సమానుడుగా నేనగుదునుగదా యని విచారించుట మొదలగువానిని యమాద్యనుష్ఠానపరుడు గావింపవలయును. ఈ ప్రకారము హింసా ఉసత్య స్తేయాది దుష్ట సంకల్పములకు నాశకములయిన విరక్తి భావనలను గావింపవలయును. అప్పుడు యమాదిసిద్ధి గలుగును.

సూ॥ వితర్కా హింసాదయః కృతకారితానుమోదితా లోభక్రోధ మోహపూర్వకా మృదుమధ్యాధిమాత్రా దుఃఖాజ్ఞానానన్తఫలా ఇతి ప్రతిపక్షభావనమ్ ॥ 34

పద॥ వితర్కాః - హింసాదయః - కృతకారితానుమోదితాః - లోభ క్రోధ మోహ పూర్వకాః - మృదుమధ్యాధిమాత్రాః - దుఃఖాజ్ఞానానన్తఫలాః - ఇతి - ప్రతిపక్ష భావనం.

క్రమ॥ హింసాదయః = హింస, అసత్యము మొదలగు, వితర్కాః = అహింసాది వ్రతములకు విధ్వంసకములయిన వికల్పములు (దుష్ట సంకల్పములు), కృతకారితానుమోదితాః - కృత = తనచే చేయబడినవియు, కారిత = ఇతరులచే చేయించబడినవియు, అనుమోదితాః = 'బాగు బాగు' అని అనుమోదింపబడినవియు, ఇట్టి త్రివిధ భేదములు గలవిగను, లోభక్రోధమోహపూర్వకాః - లోభ = ధనాదులందాశ, క్రోధ = తన కపకారకులు గలుగజేసినని కోపము, మోహ = ఇది ధర్మమని మోహము, పూర్వకాః = ఇవి మూడు కారణములుగా గలవి, లోభ, క్రోధ, మోహములను త్రివిధ కారణములచే గలిగినవిగను, మృదుమధ్యాధిమాత్రాః = మృదు, మధ్య, తీవ్రములుగను ఈ మూడు విధములను నవాంతర భేదములు గలవిగను అయినవై, దుఃఖాజ్ఞానానన్తఫలాః - దుఃఖ = నరకాది దుఃఖము, అజ్ఞాన = స్థావరాది భావము (వృక్షలతాదులై జన్మించుట), సంశయ భ్రాన్తిరూప అవిద్య, అనంతఫలాః = అపారఫలము - అనేక జన్మపరంపరలనుభవించుట ఇవి గలవిగా నగుచున్నవి (దుఃఖ, అజ్ఞాన అనేక జన్మముల నొసగున

వగుచున్నవి), ఇతి = అని (ఇట్లాంటి విచారము), ప్రతిపక్షభావనం - ప్రతిపక్ష = హింసాది వితర్కములయొక్క, భావనం = భావన అగును.

అవ॥ ఇప్పుడు (1) హింసా, (2) మిథ్యాభాషణ, (3) స్తేయ, (4) మైథున, (5) పరిగ్రహములను పంచవితర్కములయొక్క (1) స్వరూపమును, (2) భేదములను, (3) వాటి కారణములను, (4) అవాంతర భేదములను, (5) ఫలములను, (1) హింసాదయః, (2) కృతకారితానుమోదితాః (3) లోభక్రోధమోహపూర్వకాః, (4) మృదుమధ్యాధిమాత్రాః, (5) దుఃఖాజ్ఞానానంతఫలాః అను అయిదు పదములచే క్రమముగా తెలుపుచు హింసాది విధ్వంసక విచారభావనను తెలుపుచున్నారు.

తా॥ ఈ హింసాదులు యమనియమాదులను నాశమొనరించునవి. మఱియు నివి ధనాదిలోభము చేతను, అపకారమును స్మరించుటచే గలుగు క్రోధము చేతను, ఇటుల జేసిన ధర్మమను మూఢత్వమగు మోహముచేతను గలుగుచున్నవి. మృదువులు, మధ్యములు, తీవ్రములు అను మూడు భేదములతోను నొప్పుచున్నవి. అదియునుంగాక నీహింసాదులు

తనచే చేయబడినను, ఇతరులచే చేయబడినను, అవి చూడబడి యనుమోదింపబడినను, అనన్తములగు దుఃఖములను అజ్ఞానభ్రాన్తి సంశయములను జన్మల నొసగుచున్నవి. ఇట్టి విచారముచే హింసాదులగు వితర్కములు ధ్వంసములగుచున్నవి. అహింసాదులు సుస్థిరము లగుచున్నవి. ఇదియే ప్రతిపక్షభావనయగును. ఇట్టి భావనచే హింసాదులు విడువబడగా యమాద్యనుష్ఠానము నిర్విఘ్నముగా గలుగుచున్నది. యమాది సిద్ధిచే చిత్తశుద్ధి ద్వారా కైవల్యము సిద్ధించుచున్నది.

మొదట హింసయను వితర్కమును (సంకల్పమును) విచారింతము. తరువాత మిగిలిన వితర్కము లూహింపనగును. వితర్కములనగా హింసాదులని వాటి స్వరూపము చెప్పబడెను. వానిలో హింస యనునది (1) కృతము, (2) కారితము, (3) అనుమోదితము (1) తనచే చేయబడినది, (2) ప్రేరణచే నితరులచే చేయింపబడినది, (3) చేయుచుండగా గాంచి అనుమోదింపబడినది అని ముత్త్రివిధ భేదములతో నున్నది. మఱియు లోభ, క్రోధ, మోహములను మూడు కారణములచే కృతము మూడు విధములుగను, కారితము మూడు విధములుగను, అనుమోదితము మూడు విధములుగను అగుచున్నవి. ఈ కృత,

కారిత, అనుమోదితములగు హింసలులోభ క్రోధ మోహములచే పుట్టుచున్నవని భావము. ఈలాగున కృతాదులు మూడును ప్రత్యేకముగా మూడువిధము లయినందుచే హింస తొమ్మిదివిధములాయెను. ఇకను కారణములగు లోభ క్రోధ మోహములు మృదు, మధ్య, తీవ్రములను మూడు భేదములతో నొప్పుచున్నవి. కావున కార్యమగు హింసయు మృదు మధ్య తీవ్ర భేదముల గలదగుచున్నది. ఇప్పుడు కృతమను హింస యొకటియే నవ విధములాయెను. అవెటులనగా,

1. మృదులోభకృత మృదుహింస
2. మధ్యలోభకృత మధ్యహింస
3. తీవ్రలోభ కృత తీవ్రహింస
4. మృదు క్రోధ కృత మృదు హింస
5. మధ్య క్రోధ కృత మధ్యహింస
6. తీవ్రక్రోధ కృత తీవ్రహింస
7. మృదుమోహకృతమృదుహింస
8. మధ్యమోహకృత మధ్యహింస
9. తీవ్రమోహకృత తీవ్రహింస

ఈలాగున కారిత, అనుమోదిత హింస రెంటింటిలోను గణనము చేయవలయును. ఈ ప్రకారము హింస యొకటియే (27) యిరువదియేడు విధములాయెను. ఇకను మృదు, మధ్య

తీవ్రములలోను (1) మృదుమృదువు, (2) మధ్యమృదువు, (3) తీవ్రమృదువు. (1) మృదు మధ్యము, (2) మధ్యమధ్యము, (3) తీవ్రమధ్యము. (1) మృదుతీవ్రము, (2) మధ్య తీవ్రము, తీవ్రతీవ్రము ఇట్టి మూడు భేదములచే (27) యిరువదేడు భేదములున్ను ప్రత్యేక ముగా మూడు విధములుగాగా నంతుమొత్తము 27 × 3 = 81 యెనుబదియొకటి విధము లేర్పడుచున్నవి. ఈలాగున హింసయొక్క పరిగణన చేయబడెను. అలాగున అనృతభాషణ స్తేయాదులలోను భేదముల నెఱుంగునది. ఈలాగున హింసాది వితర్కము లన నంతములు, తత్ఫలితములగు దుఃఖాజ్ఞానము లనంతములు, ఆ ఫలితము ననుభవించు జీవు లనంతములని తెలియవలెను. కాబట్టి హింసాది సంకల్పముల దూరీకరించి యమాదిసిద్ధిని సాధించినవాడు సిద్ధుడగును.

సూ॥ అహింసాప్రతిష్ఠాయాం తత్సన్నిధౌ వైరత్యాగః ॥ 35

పద॥ అహింసాప్రతిష్ఠాయాం - తత్సన్నిధౌ - వైరత్యాగః.

అర్థము॥. అహింసాప్రతిష్ఠాయాం - అహింసా = అహింసయొక్క, ప్రతిష్ఠాయాం = స్థిరత్వము గలుగగా, తత్సన్నిధౌ - తత్ = అహింసకుడగు ఆ యోగిధారే

యొనియొక్క, సన్నిధౌ = సమీపమునందు (ఆ సిద్ధపురుషుని గాలిసోకినను) వైరత్యాగః = పుట్టుకతోనే విరోధముగల ఆవు పులి మొదలగు జంతువులకును విరోధనాశము గలుగుచున్నది.

అవ॥ యమాదుల సిద్ధిని సూచించునట్టి యోగియొక్క ఐశ్వర్యమును క్రమముగా తెలుపుచున్నారు.

తా॥ అహింసావ్రతము త్రికరణశుద్ధిగా సిద్ధమాయెనేని అట్టి అహింసక యోగి పుంగవుని సమీపమున గాలి సోకినంతమాత్రమున స్వభావముగనే భక్ష్యభోజక భావముచే విరుద్ధములయిన గోవ్యాఘ్రాది జంతువులుగూడ వైరమును వదలి పరమశాంతితో మెలగు చుండును. ఇదియే అహింసా సిద్ధిసూచకమగును. ఇదియే వాసిష్ఠమున చెప్పబడియున్నది.

శ్లో॥ మాతరీవ పరం యాన్తి విషమాణి మృదూని చ।
విశ్వాసమిహ భూతాని సర్వాణి శమశాలిని॥

తల్లియందు విశ్వాసముగలిగి వర్తించువిధమున అహింసాసిద్ధిచే శాంతచిత్తుడగు యోగిరాట్టునందు క్రూరమృగములును, శాంతమృగములును యిటులనే సమస్తభూతములును పరమవిశ్వాసమును జెందుచున్నవి.

సూ॥ సత్యప్రతిష్ఠాయాం క్రియాఫలాశ్రయత్వమ్ ॥ 36

పద॥ సత్యప్రతిష్ఠాయాం - క్రియాఫలాశ్రయత్వం.

అర్థము॥ సత్యప్రతిష్ఠాయాం = సత్యముయొక్క స్థిరత్వము గలుగగా, క్రియాఫలాశ్రయత్వం - క్రియా = ధర్మ అధర్మములకు, ఫల = స్వర్గనరకాది ఫలములకు, ఆశ్రయత్వం=ఆశ్రయుడగుట (వాక్కుచేతనే యిచ్చువాడగుట) సిద్ధించుచున్నది.

తా॥ సత్యసిద్ధిని పొందిన మహానుభావుడు పాపాత్ముని జూచి నీవు ధార్మికుడవగుమనియు, అట్టి ధర్మఫలమగు స్వర్గమును పొందుమనియు, వాక్కుతో నుచ్చరించగానే ఎట్టి పాపాత్ముడును, ధార్మికుడగుచున్నాడు. దేని నాచరించకయు, స్వర్గఫలమును పొందుచున్నాడు. అటులనే సిద్ధపురుషుని వాఙ్మాత్రముచేత ధార్మికుడును పాపిగను, పాపఫలమగు నరకమును పొందువాడుగను యగుచున్నాడు. ఈలాగున సత్యప్రతిష్ఠగల యోగి నిగ్రహానుగ్రహ సమర్థుడగుచున్నాడు. ఇట్టి సామర్థ్యమే సత్యసిద్ధిని సూచించుచున్నది.

37

సూ॥ అస్తేయప్రతిష్ఠాయాం సర్వరత్నోపస్థానమ్ ॥

పద॥ అస్తేయప్రతిష్ఠాయాం - సర్వరత్నోపస్థానమ్.

అర్థము॥ అస్తేయప్రతిష్ఠాయాం - అస్తేయ = అస్తేయముయొక్క (ఇతర వస్తువులను దొంగలింపవలెనను బుద్ధి నెప్పుడును లేకుండుట అను యమముయొక్క) ప్రతిష్ఠాయాం సత్యాం = స్థిరత యేర్పడగా, సర్వరత్నోపస్థానం = సమస్త దివ్య రత్నములయొక్క, ఉపస్థానం = ప్రాప్తి గలుగును.

తా॥ ఇతరవస్తువులను పాషాణమువలె తలంచి అస్తేయ యమమును సమగ్రముగా శీలించిన యోగియొక్క ముందర సమస్త దివ్యరత్నములు స్వయముగావచ్చి నిలుచును. ఈ భూమిలో ఉత్కృష్టరత్నములుగూడ నెచ్చోటనుండు విషయమును, అంజనము లేకనే అస్తేయ మహిమాంజనముతో స్పష్టముగా గనుగొనుచున్నాడు.

38

సూ॥ బ్రహ్మచర్యప్రతిష్ఠాయాం వీర్యలాభః ॥

పద॥ బ్రహ్మచర్య ప్రతిష్ఠాయాం - వీర్యలాభః.

అర్థము॥ బ్రహ్మచర్య ప్రతిష్ఠాయాం - బ్రహ్మచర్య = వీర్యసంరక్షణయొక్క (ఊర్ధ్వరేతస్సుయొక్క), ప్రతిష్ఠాయాం = స్థిరముగా నిలుచుటేర్పడగా, వీర్యలాభః - వీర్య = నిరతిశయ సామర్థ్యముయొక్క (బ్రహ్మవర్చస్సుయొక్క), లాభః = ప్రాప్తి (గలుగును).

తా॥ కొంచముగూడ రేతస్సు జెదరనీయక, సంరక్షించుట బ్రహ్మచర్యమగును. అందుచే వీర్యము ఊర్ధ్వగామియై బ్రహ్మతేజస్సును గలిగించును. అట్టి బ్రహ్మచర్య నిష్ఠుడగు మహాయోగి సాక్షాద్దేవుడే యగుచున్నాడు. కావున బ్రహ్మచర్యనిష్ఠ సిద్ధించెనేని నిరతిశయ సామర్థ్యము యోగికి గలుగుచున్నది. నిరతిశయ సామర్థ్యమనగా, అందరి యందున్న ప్రజ్ఞాసామర్థ్యము. ఒకరికన్న యొకరియందు హెచ్చు తగ్గులుగా నుండును. ఇది సాతిశయ సామర్థ్యము. ఎవరియందును అట్టి ప్రజ్ఞాసామర్థ్య ముండదు. బ్రహ్మచర్య దీక్షవహించిన యోగిరాట్టుయందే యుండును. దీనికి సమమగు సామర్థ్య మెవరియందును యుండకపోవుటచే నిది నిరతిశయ ప్రజ్ఞాసామర్థ్యమగును. ఇట్టి యోగివరుడు ఒక క్షణ ములో సమస్తలోకముల జూచుటయేగాక లోకాతిక్రాన్తమయిన నెవరికిని సాధ్యము

గాని అలౌకిక విషయమును యేప్రమాణము లేక ప్రజ్ఞాసామర్థ్యముచే కనుగొనుచున్నాడు. ఇట్టి నిరతిశయ ప్రజ్ఞాశాలియగు గురువరుండు ఉపదేశించిన విషయము శిష్యులయందు తప్పక ఫలించును. శిష్యులనుగూడ తమవంటివారిని జేయు సామర్థ్యముండును. ఇదియే బ్రహ్మచర్యసిద్ధి సూచకమగుచున్నది.

సూ॥ అపరిగ్రహస్థైర్యే జన్మకథన్తాసమ్బోధః ॥ 39

పద॥ అపరిగ్రహస్థైర్యే - జన్మకథన్తాసమ్బోధః.

అర్థము॥ అపరిగ్రహస్థైర్యే - అపరిగ్రహ = శరీరోపభోగవస్తువుల త్యజించుట అను అపరిగ్రహముయొక్క, స్థైర్యే సతి = స్థిరత్వము గలుగగా, జన్మకథన్తాసమ్బోధః - జన్మ = భూత భావి జన్మలయొక్కయును వర్తమాన జన్మయొక్కయు, కథన్తా = స్థితియొక్క, సమ్బోధః = బాగుగా తెలియుట అను సాక్షాత్కారము (సిద్ధమగును).

తా॥ శరీరమునకు సుఖమును గలుగజేయు నేయుపభోగవస్తువు నాశించక సమస్తమును వదలి శరీరస్థితి కనువగుదానినిమాత్రము స్వీకరించియుండుట అపరిగ్రహవ్రతమగును

(ఇతరు లిచ్చినదానిని కోరకనే వచ్చినను స్వీకరింపకనే యుండవలయునని యర్థము గూడ గలదు). ఈ అపరిగ్రహము స్థిరమాయెనేని అపరిగ్రహ సిద్ధివలన తాను పూర్వ జన్మములో నేమిగా నుండెను? తన జన్మమిక నెటుల జరుగును? రాబోవు జన్మ మేదని తాను తెలియడమే గాక బాగుగా నపరిగ్రహ వ్రతసిద్ధి గలిగనేని ఇతరుల జన్మల విషయమును తెలియుచున్నాడు. దీనినంతయు నపరిగ్రహ వ్రతమహిమచే సంకల్పమాత్రమున నెఱుంగుచున్నాడు. ఈ ప్రకారము యమములనబడు అహింసాదులయొక్క స్వరూపమును, వాటి ప్రతిబన్ధ నిరాకరణ ప్రకారమును, వాటి సిద్ధిసూచనలను బాగుగా నిరూపించిరి. యమములనగా 'యమ ఉపరమే' అను ధాతువునుండి పుట్టినవి. అభావమని (లేకుండుట) అర్థము. (1) హింసాభావము అహింసయు, (2) అసత్యాభావము సత్యమున్ను, (3) స్తేయాభావము అస్తేయమున్ను, (4) మిథునకర్మాభావము బ్రహ్మచర్యమున్ను, (5) పరిగ్రహాభావము అపరిగ్రహమున్ను యగుచున్నవి. ఇటుల అహింసాదుల విషయము పూర్ణము.

సూ॥ శౌచాత్స్వాఙ్గజుగుప్సా పరైరసంసర్గః ॥ 40

పద॥ శౌచాత్ — స్వాఙ్గజుగుప్సా — పరైః — అసంసర్గః.

అర్థము॥ శౌచాత్ = శౌచమగు శరీర ప్రక్షాళనరూపశుద్ధిచే, స్వాఙ్గజుగుప్సా = తన యవయవములయందు అసహ్యభావము, పరైః = ఇతరులతో, అసంసర్గః = కలియకుండుటయు (గలుగును).

అవ॥ యమములయొక్క సిద్ధి జెప్పి యిప్పుడు శౌచాది నియమములయొక్క సిద్ధి ప్రయోజనముల వరుస జెప్పుచున్నారు.

తా॥ బాహ్యశౌచమును శరీరప్రక్షాళనాది కార్యములఁ జేయుచున్నయోగి, శరీరమునందు శుద్ధతను గాంచజాలక అసహ్యతను దెచ్చిపెట్టుచున్నాడు. శరీరమందలి జుగుప్స గలుగుటకై బాహ్యశౌచము విధింపబడెను. శిథిల స్వభావముగల నీశరీరము యెన్నటికిని శుద్ధి గాంచ నేరదు. దీని స్వభావ మశుచిత్వమే యని యోగి దృఢముగా దెలియుచున్నాడు. శ్రోత్రనేత్రాది నవరంధ్రములద్వారా నిరంతరము మలము స్రవించుచునే యున్నది. లెక్కలేని రోమకూపములు ఉంటున్నవి. శరీరమెప్పుడును చెమటతో గూడియున్నది. బండ్లు బండ్లుగా మట్టిని తీసికొనివచ్చి శుద్ధజలముల స్నానమాడినను, యీ శరీరము శుద్ధముగాక నేయున్నది. ఇటుండ నెవడు దీనిని శుద్ధము గావించును?

"నవచ్ఛిద్రకృతా దేహాః స్రవన్తి ఘటికా ఇవ ।
బాహ్యశౌచైః న శుధ్యన్తి నాన్తశ్శౌచన్తు విద్యతే ॥"

నవరంధ్రములు చేయబడిన ఘటములవలె నీదేహములనుండి మాలిన్యజల మెడతెగక కారుచునేయున్నది. బాహ్యశౌచములచే ప్రయోజనములేదు. అంతశ్శౌచమా సంభవించనే సంభవించదు. ఈ ప్రకారము తన శరీరమునందే యసహ్యభావమును నూనువాడు యితర శరీరములను స్పృశించనే స్పృశించడు. జనయోగమును, అహియోగమును వలె విసర్జించి నిస్సంగుడగును. తన దేహమందు జుగుప్స యుదయించకుండిన నట్టి వైరాగ్యమే గలుగదు.

"స్వదేహాశుచిగంధేన న విరజ్జేత యః పుమాన్ ।
విరాగకారణం తస్య కిమన్యదుపదిశ్యతే ॥"

తన దేహమందే అశుచిత్వము జూడక విరక్తుడు గానివానికిక విరాగకారణమే లేదు. కావున దేహమశుచియనియు, అస్థిరమనియు దలంచి దేహముపై నాశమాని సుఖమునుగోరక సర్వదా యోగసిద్ధిని కాంక్షింపవలయును.

సూ॥ సత్త్వశుద్ధిసౌమనస్యైకాగ్ర్యేంద్రియజయాత్మదర్శనయోగ్యత్వాని చ ॥ 41

పద॥ సత్త్వ శుద్ధి సౌమనస్య ఏకాగ్ర్య ఇంద్రియ జయ ఆత్మదర్శనయోగ్యత్వాని - చ.

అర్థము॥ (శౌచాత్ = అభ్యంతర శౌచమువలన) అంతఃకరణమునందు రాగద్వేషాది మాలిన్యములు లేకపోవుటవలన, సత్త్వశుద్ధి.........యోగ్యత్వాని చ - సత్త్వశుద్ధి = బుద్ధియొక్క అసూయేర్ష్యాది మలరాహిత్యము (అందుచే), సౌమనస్య = సత్త్వోత్కర్షము (తేజస్త్వము) (అందుచే), ఐకాగ్ర్యం = నిశ్చలత్వము (అందుచే) ఇంద్రియజయ = బాహ్యేంద్రియజయము (అందుచే), ఆత్మదర్శనయోగ్యత్వాని చ = ఆత్మను సాక్షాత్కరించు యోగ్యతయు క్రమముగా గలుగుచున్నవి.

అవ॥ అంతశ్శౌచముచే గలుగు సిద్ధిని జెప్పుచున్నారు.

తా॥ మైత్రీ కరుణాది భావనవలన నంతఃకరణము శుద్ధమగుచున్నది. స్ఫటికమణి వలెస్వచ్ఛతచే జేగీయమానమగుచున్నది. ఇదియే అభ్యంతర శౌచము. దీనిచే బుద్ధి శుద్ధ

మగుచున్నది. ఆ శుద్ధిచే ప్రసన్నత సౌమనస్యము తేజస్త్వము గలుగుచున్నది. అద్దానిచే మనోనిశ్చలతయు, అందుచే బాహ్యములకు కర్మేంద్రియ జ్ఞానేంద్రియముల జయము గలుగుచున్నవి. వీనన్నిటిచే ఆత్మను సాక్షాత్కరించు యోగ్యతయు గలుగును. ఈలాగున నొకదానికొకటి కారణభూతములై యున్నవి. అభ్యంతర శౌచముచే ఆత్మదర్శనము నిర్విఘ్నముగా గలుగును. ఇదియే అంతశ్శౌచసిద్ధి.

## సూ॥ సంతోషాదనుత్తమసుఖలాభః ॥ 42

పద॥ సంతోషాత్ - అనుత్తమసుఖలాభః.

అర్థము॥ సంతోషాత్ = కోరకనే దొరికినదానితో తృప్తిని వహించి విషయసుఖమును విడనాడుటచే గలుగు సంతోషమువలన, అనుత్తమసుఖలాభః = అత్యుత్కృష్టమైన నిర్విషయముయొక్క ప్రాప్తి (గలుగుచున్నది).

తా॥ తాను గోరకయే తనకు లభించినదానితో సంతుష్టచిత్తుండగు యోగివరునకు మనోవికసనరూప సత్త్వముయొక్క ప్రాబల్యముచే అనంత నిరతిశయసుఖ మావిర్భవించి విషయసుఖము విషమువలె దోచుచున్నది.

"సంతోషామృతపానేన యే శాంతా స్తృప్తిమాగతాః।
భోగశ్రీగతులా తేషా మేషా ప్రతివిషాయతే॥"

సంతోషామృతమును పానము జేయుటచే శాంతులై తృప్తిని బొందినవారు అనంతము భోగలక్ష్మి స్వయముగా వచ్చినను, అద్దానిని విషమునువలె తుచ్ఛముగా జూతురు. వారి యానందమునకు బ్రహ్మలోకమునను సాటిలేదు.

సూ॥ కాయేన్ద్రియసిద్ధిరశుద్ధిక్షయాత్తపసః ॥ 43

పద॥ కాయేన్ద్రియసిద్ధిః - అశుద్ధిక్షయాత్ - తపసః.

అర్థము॥ తపసః = దృఢమగు వ్రతానుష్ఠానమువలన, అశుద్ధిక్షయాత్ = క్లేశపాపముల మాలిన్యము నశించుటవలన, కాయేన్ద్రియసిద్ధిః = కాయసిద్ధియు (అణిమా మహిమాద్యష్టసిద్ధులు) ఇంద్రియ సిద్ధియు (దూరశ్రవణ దూరదర్శనాది సిద్ధియు) గలుగుచున్నవి.

తా॥ తీవ్రవ్రతముల నాచరించుటచే సమస్త క్లేశములు పాపములు నశించుచున్నవి. అందుచే శరీరము శుద్ధమై, అణిమాద్యష్ట సిద్ధులును గలుగుచున్నవి. ఇదియే కాయసిద్ధి

యగును. మఱియు నిన్ద్రియములును శుద్ధములై, సూక్ష్మపదార్థములను వ్యవహిత (చాటున నున్న) పదార్థములను దూరముననున్న పదార్థములను గ్రహించుచున్నవి. దూరముననుండియే వినుచున్నాడు. ఎచ్చటనోయున్న విషయములను తెలియుచున్నాడు. ఈ మొదలయినవి యింద్రియసిద్ధిచే నేర్పడునవి.

## సూ॥ స్వాధ్యాయాదిష్టదేవతాసంప్రయోగః ॥ 44

పద॥ స్వాధ్యాయాత్ - ఇష్టదేవతాసంప్రయోగః.

అర్థము॥ స్వాధ్యాయాత్ = గీతోపనిషదాది పఠనమువలనను గాయత్రీప్రణవాది మంత్ర జపములవలనను, ఆయాదేవతోపాసనవలనను, ఇష్టదేవతా సంప్రయోగః = తనకిష్టమగు దేవతయొక్క సాక్షాత్కారము లభించును.

తా॥ వేదోపనిషదాద్యధ్యయనమువలనను, అభిమత గాయత్ర్యాది మంత్రజపము వలనను, తన కభిమతమగు దేవతానుగ్రహము గలుగుచున్నది. ఆ దేవతా సాక్షాత్కారము గలిగి సంభాషణాదులుగూడ సిద్ధములగును.

సూ॥ సమాధిసిద్ధిరీశ్వరప్రణిధానాత్ ॥ 45

పద॥ సమాధిసిద్ధిః - ఈశ్వరప్రణిధానాత్.

అర్థము॥ ఈశ్వరప్రణిధానాత్ = ఈశ్వరునియందు ఫలాపేక్షలేక సమస్త కర్మలను సమర్పించుటచేతను, భక్తివిశేషమువలనను, సమాధిసిద్ధిః = చిత్తసమాధానము మనః ప్రసన్నత, ఏకాగ్రత, ఇవి గలుగుచున్నవి.

తా॥ అకామవాబుద్ధితో సమస్త కర్మల నీశ్వరార్పణముజేసిన అనన్యభక్తివలనను, చిత్తైకాగ్ర్యరూప సమాధి (చిత్తసమాధానము, ప్రసన్నత ధ్యానమందు మనస్సు స్థిరముగా నిలుచుట) గలుగుచున్నది.

సూ॥ స్థిరసుఖమాసనమ్ ॥ 46

పద॥ స్థిరసుఖం - ఆసనం.

అర్థము॥ స్థిరసుఖం = దేహచలనములేక స్థిరమైనదియును అవయవములకు బాధను కలుగజేయక సుఖకరమైనదియును (యేదియో అది), ఆసనం = ఆసనమగును.

అవ॥ యమనియమములను నంగములను నిరూపించి క్రమముగా ప్రాప్తమయిన మూడవ

దగు యోగాంగమును, దాని ఫలమును నిరూపించుచున్నారు.

తా॥ ఆసనమనగా నెటులుండిన దేహేన్ద్రియములు చలించవో, బాధయు గలుగదో, అదియే ఆసనమగును. స్థిర సుఖ పదములచే దానిని తెలిపిరి. ఈ ఆసనములు పద్మస్వస్తికాదులగును. పద్మాసన లక్షణమును యాజ్ఞ్యవల్క్యుడు నిరూపించియున్నాడు.

శ్లో॥ ఊర్వోరుపరి విన్యస్య కృత్వా పాదతలే శుభే।
అఙ్గుష్ఠౌ చ నిబధ్నీయాత్ హస్తాభ్యాం వ్యుత్క్రమేణ తు।
పద్మాసనం భవేదేతత్సర్వేషామభిపూజితమ్॥

ఎడమపాదమును కుడితొడమీదను, కుడిపాదము నెడమతొడమీదను నుంచి వ్యత్యస్తముగా కుడిచేతితో ఎడమకాలి బొటనవ్రేలిని, ఎడమచేతితో కుడికాలి బొటనవ్రేలిని పట్టుకొని కదలక కూరుచుండవలయును. ఇది పద్మాసనమగును. ఇది అన్నిటిలోను శ్రేష్ఠము; యోగులందరికి చాల యిష్టమై యున్నది.

సూ॥ ప్రయత్నశైథిల్యానన్తసమాపత్తిభ్యామ్॥ 47

పద॥ ప్రయత్నశైథిల్యానన్తసమాపత్తిభ్యాం.

అర్థము॥ ప్రయత్న శైథిల్య అనన్తసమాపత్తిభ్యాం - ప్రయత్నశైథిల్య = శరీరమును కదల్పకుండుటయు, ఎచ్చోటికైనను పోవుటయందును, గృహకృత్యములయందును, తీర్థస్నానాదులయందును ఉన్నట్టి మానసిక ఉత్సాహమును తగ్గించుకొనియుండుటయు, అనన్తసమాపత్తిభ్యాం = ఆదిశేషునియందు చిత్తముంచి ధ్యానించుటయు, ఈ రెంటిచేతను ఆసనము సిద్ధించును.

తా॥ ఆసనసిద్ధ్యుపాయమును తెలుపుచున్నారు. గమన గృహకృత్య తీర్థస్నానాది విషయమైన మానసిక ఉత్సాహమును తగ్గించుకొనుట ప్రయత్నశిథిలత్వమనబడును. ఇది లౌకికమగు నుపాయమగును. అటుగానిచో నుత్సాహబలముచే నెచ్చోటనైనను సంచరించును. అందుచే యోగవిఘ్న మేర్పడును. ఆసనము సిద్ధించదు. కావున ప్రయత్నమును శిథిలము గావింపవలయు. ఇక ననన్తసమాపత్తియను నలౌకిక ఉపాయమును జెప్పుచున్నాడు. ఎవడు వేయిపడగలచే భూమినంతయు మోయుచుండినను కదలక స్థిరముగా నుంటున్నాడో, అట్టి ఆదిశేషుడనే నేనని దృఢభావనచేసి చిత్తమందు ధ్యానించుట సమాపత్తియగును. ఈ రెండు ప్రయత్నశైథిల్య అనన్తసమాపత్తులచే ఆసనసిద్ధి గలుగును. ఇందుచే స్థిరసుఖాసన, అదృష్టము లభించుచున్నది.

సూ॥ తతో ద్వంద్వానభిఘాతః ॥ 48

పద॥ తతః - ద్వంద్వానభిఘాతః.

అర్థము॥ తతః = స్థిరసుఖాసనము సిద్ధించుటవలన, ద్వంద్వానభిఘాతః - ద్వంద్వ = శీతోష్ణ, సుఖ దుఃఖ, మానావమానాది ద్వంద్వములచే, అనభిఘాతః = కొట్టబడకుండుట గలుగును.

తా॥ ఆసనము స్థిరముగను, సుఖకరముగను సిద్ధించెనేని, శీతోష్ణ, సుఖ దుఃఖ, మానావమాన ద్వంద్వములచే పూర్వమువలె బాధింపబడడు. శీతోష్ణాది ద్వంద్వములను జయించుటయే ఆసనసిద్ధి సూచకమగును.

సూ॥ తస్మిన్సతి శ్వాసప్రశ్వాసయోర్గతివిచ్ఛేదః ప్రాణాయామః॥ 49

పద॥ తస్మిన్ - సతి - శ్వాసప్రశ్వాసయోః - గతివిచ్ఛేదః - ప్రాణాయామః.

అర్థము॥ తస్మిన్ సతి = ఆ యాసనస్థైర్యము సిద్ధించగా, శ్వాసప్రశ్వాసయోః = నిశ్వాస ఉచ్ఛ్వాసములయొక్క (వాయువు లోపల ప్రవేశించిన అది నిశ్వాసమగును,

అదియే శ్వాస; బయటకు బయలుదేరిన వాయువు ఉచ్ఛ్వాసము, అదియె ప్రశ్వాస, వీనియొక్క), గతివిచ్ఛేదః — గమనమాగిపోవుట (వాయువును సంచరింపనీయకుండుట) ఉచ్ఛ్వాస నిశ్వాస సంచారమును లేకుండ చేయుట, ప్రాణాయామః — ప్రాణాయామ మనబడును. (వాయుసంయమనము)

అవ॥ యోగమునకు మూడవసాధనమగు ఆసనాంగము సిద్ధించిన తరువాత నాల్గవదియగు ప్రాణాయామమను నంగమును విశదీకరించుచున్నారు.

తా॥ ఆసనస్థైర్యము గలిగిన వెంబడే ప్రాణాయామముగూడ సిద్ధమగుచున్నది. ప్రాణాయామమనగా, ప్రాణవాయువును చలింపనీయక తన వశములో నుంచుకొనుటగును. ఉచ్ఛ్వాసనిశ్వాసముల స్వేచ్ఛగా పోనీయక వాటిని నిరోధించుట ప్రాణాయామము. (1) బయటవాయువును లోపలికి పొందించుట శ్వాసయగును. మరల నుదరములోనున్న వాయువును బయటకు త్రోయుట ప్రశ్వాసయగును. ఈ రెండింటియొక్క సంచారాభావమే ప్రాణాయామమగును. వాయుగతి నిరోధము ప్రాణాయామ సామాన్య లక్షణమని ఫలించినది. ఈ సామాన్యలక్షణము వాయువును లోపల స్తంభింప జేయుట

యను కుంభకమునందుమాత్రము గతినిరోధ మున్నందుచే సంగతమగుచున్నది. లోపలి వాయువును బహిర్గతము జేయుటను రేచకమందును, బయట వాయువును లోపలికి పూరించుటను పూరకమందును సంచారనిరోధము లేనందుచే, అనుగతము కాలేదని యూహింప నవసరములేదు. కుంభకమునందు మాత్రము కడవలో జలమువలె ప్రాణము నిశ్చలముగా నున్నది. అందుచే గతినిరోధము సిద్ధమాయెను. రేచకమందును బయటనే వాయువు కొంతవరకు నిలుచును గాన గతినిరోధమున్నది. పూరకమందును వాయువు లోపల నిలువబడును గాన గమననిరోధమున్నది. అందుచే త్రివిధములగు రేచక పూరక కుంభకములందును వాయుసంచారాభావ సామాన్యలక్షణము సంగతమేను. అయినను రేచకపూరకముల యందు మాత్రము వాయుసంచారమున్నదిగదా యని మరల శంకింపగూడదు. ఎందువలననగా అధిక మాత్రాభ్యాసముచే స్వభావముగానున్న సమప్రాణమునకు గతినిరోధము గలుగుచున్నది. అధికముగా రేచకపూరక ప్రాణాయామముల అభ్యాసముచే నదివరకున్న వాయువేగము తగ్గి స్వభావముగనే ప్రాణసంచారము సూక్ష్మముగను, సమముగను నగుచున్నది. క్రమముగా రేచకపూరకములుగూడ నిలిచిపోవుచున్నవి. గాన అచ్ఛిన్న గతినిరోధమున్నది. ఇటుల ప్రాణాయామ విషయమును తెలియవలయు,

సూ॥ బాహ్యాభ్యన్తరస్తమ్భవృత్తిర్దేశకాలసఙ్ఖ్యాభిః పరిదృష్టః దీర్ఘసూక్ష్మః ॥ 50

పద॥ బాహ్యాభ్యన్తరస్తమ్భవృత్తిః - దేశకాలసంఖ్యాభిః - పరిదృష్టః - దీర్ఘసూక్ష్మః.

అర్థము॥ బాహ్యాభ్యన్తరస్తమ్భవృత్తిః - బాహ్య = బయటను, అభ్యన్తర = లోపలను, స్తమ్భ = కుంభనమందును, వృత్తిః = స్థితిగల (ఉంటున్న) ప్రాణాయామము (వృత్తి శబ్దము మూడింటిలోను అన్వయించుటచే), బాహ్యవృత్తిః = శ్వాసను బయట వదలునప్పుడా వాయువు బయటనే గొంత నిలుచుచున్నదను రేచకము, అభ్యన్తరవృత్తిః = శ్వాసను లోపలికి తీసికొనినప్పుడది లోన గొంత నిలుచుచున్నదను పూరకము, స్తంభవృత్తిః = కుంభనముచే లోపలనే యధికముగా వాయువుంటున్నదను కుంభకము· ఈ ప్రకారము త్రివిధమై, దేశకాలసంఖ్యాభిః = దేశకాల సంఖ్యలను మూడింటిచేతను, పరిదృష్టః = పరీక్షింపబడినదై, దీర్ఘసూక్ష్మః = దూదిని వడికిన కొలది యది పొడవై సూక్ష్మమగులాగున అభ్యాసముకొలది దీర్ఘముగను, సూక్ష్మముగను అగుచున్నది.

అవ॥ ప్రాణాయామ విశేషలక్షణ పూర్వకముగా దాని యభ్యాసమును తెలుపుచున్నారు.

తా॥ ప్రాణవాయువు బయట సంచరించునప్పుడు బాహ్యావృత్తియగు రేచకమగును. లోపల సంచరించునప్పు డాభ్యంతరవృత్తియగు పూరకమగును. లోపలనే స్తంభించినప్పుడు స్తమ్భవృత్తియగు కుంభకమగును. లోపలి వాయువును బయటకు పంపుట రేచక ప్రాణాయామము. బయట వాయువును లోపలికి పూరించుట పూరక ప్రాణాయామమగును. వాయువును లోపలనే నిలపెట్టుట కుంభక ప్రాణాయామమగును. అభ్యాసకుడీమూడింటిని అభ్యసించినమాత్రాననే ప్రాణాయామానుష్ఠానము పూర్తియగును. గతినిరోధ మున్నందుచే మూడును ప్రాణాయామము లగుచున్నవి. ఈ రేచక పూరక కుంభక ప్రాణాయామముల దేశకాలసంఖ్యలచే పరీక్షింపవలయును. అందులో రేచకపరీక్ష:- స్వభావముగా రేచకమందు శ్వాస హృదయమునుండి బయట వెడలినదై ముక్కుకొనయందు 12 అంగుళ పర్యన్తము వ్యాపించి పర్యవసన్నమగుచున్నది. మఱియు నభ్యాసపాటవముచే మూలాధారమునుండిగాని, నాభినుండిగాని, బయట 24 అంగుళముల పర్యన్తముగాని, 36 అంగుళముల పర్యన్తముగాని, అంత దూరములో వ్యాపించి శ్వాస ముగియుచున్నది.

అచ్చోట రేచించు ప్రయత్న మధికము కాగా, మూలాధారాదులనుండి శ్వాసయు నెటుల బయట వెడలుచున్నదో, అను విషయము మూలాధారాది ప్రదేశ శోధచే తెలియంగ వచ్చును. బయటనో దూదిని వ్రేలాడకట్టి దానియొక్క చలనముచే శ్వాస చలన పరిమితిని గనుగొనవచ్చును. ఇది రేచకముయొక్క దేశపరీక్ష. పూరకమందును శరీరమంతటను ఎంతవరకు శ్వాస వ్యాపించినదని తెలియవలయు. రేచించినప్పుడు ప్రాణవాయువులు 10 పర్యాయములా, 20 సార్లా, 30 సార్లా యని లెక్కించుట కాలపరీక్ష యగును. మరియు ఈ మాసమందు ప్రతిదినము పది పది రేచకము లభ్యసింపబడెను. రాబోవు మాసమందు 20 రేచకములు, తర్వాత 30 రేచకముల నభ్యసింపవలయునని పరిగణించుట సంఖ్యా పరీక్షయగును. ఇటులనే పూరకమందును గనందగును. అయితే కుంభక ప్రాణాయామ మందుమాత్రము దేశపరిమితి తెలియబడదు. కాలసంఖ్యాపరీక్షలు సుగమములే. ఇట్టి అభ్యాసముచే ప్రాణవాయువు పడికిన దూదివలె దీర్ఘముగను, దుర్లక్ష్యముగుటచే సూక్ష్మముగను యగుచున్నది.

సూ॥ బాహ్యాభ్యన్తరవిషయాక్షేపీ చతుర్థః ॥ 51

పద॥ బాహ్యాభ్యన్తరవిషయాక్షేపీ - చతుర్థః.

అర్థము॥ బాహ్యాభ్యన్తరవిషయాక్షేపీ - బాహ్య = బయటనున్న (ప్రశ్వాసకు సంబంధించిన, అభ్యన్తర = లోపలనున్న శ్వాసకు సంబంధించిన, విషయ = విషయములను (బాహ్యవిషయ = రేచకమును, అభ్యన్తరవిషయ = పూరకమును), అనపేక్షీ = అపేక్షింపనిది, చతుర్థః = కేవల కుంభకమగు నాల్గవ ప్రాణాయామము.

అవ॥ అత్యుత్తమమైన రేచక పూరక కుంభకములను వ్యతిరిక్తమైన కేవల కుంభకస్వరూపమును నిరూపించుచున్నారు.

తా॥ కుంభకము రెండువిధములుగా నున్నది. వాయువును యథాశక్తి రేచించి బయట వదలి) తర్వాత చేయబడు కుంభకము బహిః కుంభకము. యథాశక్తి వాయువును పూరించి తర్వాత అనుష్ఠింపబడునది అన్తఃకుమ్భకమగును. ఈ బాహ్యాభ్యన్తర కుంభకముల వదలియు, రేచకపూరకములనుగూడ విడచి బయటనున్న వాయువును లోపలికి రానీయకయు, లోపలి వాయువును బయటికి పోనీయకయు, నెటులున్న వాయువును నటులనే నిలిపి సదాత్మభావముతో చిత్స్వరూపమందు లక్ష్యముంచుట కేవల కుంభకమగును.

రేచక పూరక కుంభక ప్రాణాయామత్రయముకంటే ఇది సులభమయినది. అపాయరహిత మయినది. ఇది చతుర్థ ప్రాణాయామము. రజోగుణ తమోగుణ ప్రయుక్త నిద్రాలస్యాది దోషములుగల మందమధ్యమాధికారులకే రేచక పూరక కుమ్భకములు విధింపబడినవి. నిద్రాతంద్రాలు లేని ఉత్తమాధికారులకు కేవల కుంభకము విహితము.

శ్లో॥ రేచకం పూరకం త్యక్త్వా సుఖం యద్వాయుధారణం।
ప్రాణాయామోఽయమిత్యుక్తః స వై కేవలకుమ్భకః ॥

రేచక పూరకముల వదలి సుఖముగా వాయుధారణజేసి పరమాత్మభావనతో నుండుట కేవల కుమ్భకము.

కేవలే కుంభకే సిద్ధే రేచపూరకవర్జితే।
న తస్య దుర్లభం కించిత్ త్రిషు లోకేషు విద్యతే॥

తా. రేచక పూరకముల వదలి కేవల కుంభకము సిద్ధించిన దుర్లభమైనది మూడు లోకములలోను లేదు.

సూ॥ తతః క్షీయతే ప్రకాశావరణమ్ ॥ 52

పద॥ తతః - క్షీయతే - ప్రకాశావరణం.

అర్థము॥ తతః = ఆ కేవల కుమ్భక ప్రాణాయామ సిద్ధివలన, ప్రకాశావరణం - ప్రకాశ= బుద్ధిసత్త్వమునకు (చిత్ప్రకాశమునకు వివేకఖ్యాతికి), ఆవరణం = ఆచ్ఛాదకమైన, నిద్రాలస్యాదిహేతువగు తమస్సు, (అజ్ఞానమాలిన్యము), క్షీయతే = నశించుచున్నది.

అవ॥ కేవల కుమ్భక ప్రాణాయామముయొక్క ఫలమును చెప్పుచున్నారు.

తా॥ ఆ కేవల కుమ్భకాభ్యాస సిద్ధివలన బుద్ధికున్నట్టి పరమాత్మను మరుగుపరచునట్టియు, నిద్రాలస్యాదులకు కారణమైనట్టి తమోగుణము నాశమగును. అనగా, వివేకఖ్యాతి గలిగి అజ్ఞానము నశించును. (బుద్ధి శుద్ధమై పరమాత్మ ప్రకాశరూపమగును)

సూ॥ ధారణాయోగ్యతా మనసః ॥ 53

పద॥ ధారణాయోగ్యతా - మనసః.

అర్థము॥ మనసః = మనస్సునకు, ధారణాయోగ్యతా = ఆధారాది షట్చక్రస్థానములందు చిత్తమును స్థిరముగా నుంచుటయను ధారణముయొక్క అర్హత గలుగుచున్నది.

అవ॥ ఆ కేవల కుమ్భకముచే గలుగు మరియొక ఫలమును తెలుపుచున్నారు.

టీ॥ ఆ కేవల కుమ్భక ప్రాణాయామానుష్ఠానముచే రజోగుణకార్యమగు చాంచల్యము, తమోగుణకార్యమగు నిద్రాలస్యాదులు నశించి మనస్సు ఆధారాది షట్చక్రస్థానములయందు స్థిరముగా నిలుచుచున్నది. పరమాత్మస్వరూపమును ధారణ చేయుచున్నది. ఇట్టి చిత్తముయొక్క ధారణాయోగ్యతచే నిరావరణ స్వస్వరూపజ్ఞానము గలుగుచున్నది.

సూ॥ స్వస్వవిషయాసంప్రయోగే చిత్తస్వరూపానుకార ఇవే-న్ద్రియాణాం ప్రత్యాహారః ॥ 54

పద॥ స్వస్వవిషయాసంప్రయోగే - చిత్తస్వరూపానుకారః - ఇవ - ఇన్ద్రియాణాం - ప్రత్యాహారః.

అర్థము॥ స్వస్వవిషయాసంప్రయోగే సతి - స్వస్వవిషయ = తమ తమ విషయములగు శబ్దస్పర్శాదులయొక్క, అసంప్రయోగే సతి = సంబంధము లేకపోగా, ఇన్ద్రియాణాం = శ్రోత్రాదీన్ద్రియములకు, చిత్తస్వరూపానుకారః ఇవ - చిత్త

స్వరూప = మనోరూపమునకు, అనుకారః ఇవ = సమానరూపమువలె యున్న స్థితి,
ప్రత్యాహారః = ప్రత్యాహారమగును.

అవ॥ క్రమముగా ప్రాప్తించిన అయిదవ యోగాంగమగు ప్రత్యాహారమును నిరూపించుచున్నారు.

తా॥ శబ్దాదివిషయములనుండి శ్రోత్రాదీన్ద్రియములను నివర్తించగానే, ఆయిన్ద్రియములు చిత్తస్వరూపము ననుసరించునవివలె నుంటున్నవి. అనగా నాయావిషయములనుండి, మరలింపబడిన నేత్రాదీన్ద్రియములు, చిత్తము నిరుద్ధమై శుద్ధమై, ధ్యేయాకారమును పొందు విధమున శుద్ధములై ధ్యేయస్థితిని పొందుచున్నవని తాత్పర్యము. చిత్తమువలె నిరోధింపబడిన ఇంద్రియములు చిత్తముయొక్క స్వరూపమునే పొందుచున్నవి. చిత్తనిరోధముచే సకలేన్ద్రియనిగ్రహము సుకరమని తాత్పర్యము.

సూ॥ తతః పరమావశ్యతేన్ద్రియాణామ్ ॥ 55

పద॥ తతః - పరమా - వశ్యతా - ఇన్ద్రియాణాం.

అర్థము॥ తతః = ఆ ప్రత్యాహారముచేత, ఇన్ద్రియాణాం = ఇన్ద్రియములయొక్క,
పరమా వశ్యతా = అతి శ్రేష్ఠమగు వశీకరణము నిశ్చలత్వము గలుగుచున్నది.

అవ॥ ప్రత్యాహారఫలమును తెలుపుచున్నారు.

తా॥ చిత్తనిరోధముతోపాటు శబ్దాదివిషయములనుండి ఇంద్రియముల నిరోధించుటను ప్రత్యాహారముచే వశపడిన యిన్ద్రియములు నిశ్చలములై విషయాదులందు ప్రవర్తించక నుంటున్నవి. ధ్యేయవస్తువందు సంలగ్నమయిన చిత్తపుటాకారమున కనుగుణముగా సమస్త ఇంద్రియములను నుంచుకొనుటయే ప్రత్యాహారము. అందుచే నవి స్వతన్త్రములు గాక విషయాదులందు ప్రవర్తించవు.

ఇతి శ్రీమత్పతఞ్జలిప్రణీతే యోగశాస్త్రే యోగసుధాకరాభిధాయాం వృత్తౌ

సా ధ న పా దః స మా ప్తః

ఓమ్ తత్ సత్



ఓమ్

# అథ విభూతిపాదః

## ప్రార్థనా శ్లోకః

యదారాధనతస్సిద్ధాస్సిద్ధీరష్టావవాప్నువన్ ।
తమపాయతమోభానుముమాపతిముపాస్మహే ॥

తా॥ ఏ భగవంతు నారాధించి సనకాది మహాసిద్ధపురుషులు అష్టసిద్ధులను బడసిరో, అట్టి నిరన్తర మహాయమును కలిగించు అజ్ఞానమునకు భాస్కరుడయిన భవానీపతిని (పార్వతీ పరమేశ్వరుని) నేనుపాసించుచున్నాను.

అవ॥ ముందు సాధనపాదమున, సమాధికి విఘ్నములను గలిగించు అవిద్యాది పంచక్లేశముల నాశనము కొరకును, సమాధిభావనకొరకును (చిత్తైకాగ్ర్యముతో ధ్యేయవస్తు భావనకొరకును) వేరుగా క్రియాయోగమును (తపస్స్వాధ్యాయాదులను) నిరూపించి, క్లేశములు, వానిచే గలుగు కర్మసంస్కారములు, తత్ఫలితములగు జాత్యాయుర్భోగములు దుఃఖకరములగుటచే హేయములను విషయమును, వానిని విడుచు

కారణమును, అపానముచే గలుగు కైవల్యమును, ఆ ముక్తికి మూలకారణమైన ఆత్మ జ్ఞానమును, ఆ విజ్ఞానమునకు బహిరంగ సాధనమైన యమనియమాదులను తెలిపి, ఇప్పుడీ తృతీయపాదమున పరమాత్మ జ్ఞానమున కంతరంగములును, సంయమమని చెప్పబడునవియు నయిన ధారణ, ధ్యాన, సమాధులను (ఈ మూడింటిని) ప్రతిపాదించుచు నాధారణాదిత్రయమునకు అవాన్తర ఫలములయిన (అముఖ్య ప్రయోజనములయిన) విభూతులను తెలుపుచున్నారు. అవాన్తర ఫలములని చెప్పుటచే సంయమమునకు ముఖ్యఫలము కైవల్యమని తెలియవలెను. అది చతుర్థపాదమున తెలుపబడును. ఇప్పుడు సంయమములో మొదటిదగు ధారణను నిరూపించుచున్నారు.

సూ॥ దేశబన్ధశ్చిత్తస్య ధారణా ॥ 1

పద॥ దేశబన్ధః - చిత్తస్య - ధారణా.

అర్థము॥ చిత్తస్య = మనస్సుయొక్క, దేశబంధః - దేశ = మూలాధారాది షట్చక్రములయందుగాని, బ్రహ్మరంధ్ర సహస్రారకమలమందుగాని లేక ఆత్మయందుగాని

బంధః = స్థాపన (చిత్తమును నాసాగ్రాది ప్రదేశములయందు స్థిరముగా నిలుపుట),
ధారణా = ధారణయగును.

తా॥ పురుషఖ్యాతికి (ఆత్మజ్ఞానమునకు) అంతరంగసాధనలు ధారణాధ్యాన సమాధులు. ఈ మూటికి సంయమమని పేరు. కావున మొదట ధారణాలక్షణమును తెలుపుచున్నారు. ధారణయనగా కదలక నిలుపుట యని యర్థము. అందుచే చిత్తమును యోగశాస్త్రమందు తెలుపబడిన ధ్యానయోగ్యములయిన మూలాధారాది స్థానములందుగాని బ్రహ్మరంధ్రమందుగాని, శిఖాగ్రమందుగాని, స్వస్వరూపమగు నాత్మయందుగాని స్థిరముగా నిలుపుట ధారణయగును. ఇది ఆరవ యోగాంగము. అన్ని స్థానములకన్న నాత్మయందే మనస్సు నిలుపుట యథార్థమయిన స్వస్వరూపజ్ఞానప్రయోజకమయిన ధారణయనబడును. యోగయాజ్ఞవల్క్యమను శాస్త్రమం దీవిషయమును తెలిపినారు.

శ్లో॥ యమాదిగుణయుక్తస్య మనసః స్థితిరాత్మని।
ధారణేత్యుచ్యతే సద్భిర్యోగశాస్త్రవిశారదైః॥

యమ నియమాది గుణములతో గూడుకొన్నవాడై ఆత్మయందు చిత్తస్థాపనము ధారణయని యోగులు తెలిపిరి.

" యోగీ యుంజీత సతతమాత్మానం రహసి స్థితః ।
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీరపరిగ్రహః ॥ "

మొదలగు భగవద్గీతా వాక్యములు నావిషయమునే తెలుపుచున్నవి.

సూ॥ తత్ర ప్రత్యయైకతానతా ధ్యానమ్ ॥ 2

పద॥ తత్ర - ప్రత్యయైకతానతా - ధ్యానం.

అర్థము॥ తత్ర = ముందు వచింపబడిన స్థానములందు (ధారణచే గలిగిన), ప్రత్యయైకతానతా - ప్రత్యయ = చిత్తమునకు ధ్యేయాలవ్బన బ్రహ్మాకారవృత్తియొక్క, ఏకతానతా = ఇతర విషయములు గోచరింపక ఏకదేక స్థిరమైన తైలధారవలె అవిచ్ఛిన్న ఏకవిషయ సదృశప్రవాహము, ధ్యానం = ధ్యానము.

అవ॥ ధారణాభ్యాసముచే నేడవ యోగాంగమయిన ధ్యానము సిద్ధమగునని తెలుపుచున్నారు.

తా॥ ధ్యానమనగా మనస్సుయొక్క యెడతెగని ధ్యేయాకార భావనయగును. మూలాధారాది ధ్యేయస్థానములందు ధారణామహిమచే చిత్తమేకాగ్రమై బ్రహ్మాకార

వృత్తిని జెందుచున్నది. అట్టి బ్రహ్మాకారవృత్తి యితర విషయములచే ననువిద్ధము గాక (చేరక) తైలధారవలె నవిచ్ఛిన్నమై బ్రహ్మైక విషయమై సదృశప్రవాహమై యుండి నచో ధ్యానమని చెప్పబడును. ఒకే బ్రహ్మాకారవృత్తి గలిగినద్ది యనుభూతమగుటయే ఏకతానతయని చెప్పబడును. నిరంతర బ్రహ్మైక విషయము తైలధారవదవిచ్ఛిన్న ప్రవాహ బ్రహ్మాకారవృత్తియే ధ్యానమని తెలియవలయును. ఇచ్చోట యోగసుధాకరవృత్త్యాను సారముగా ఆ బ్రహ్మాకారవృత్తి విచ్ఛేదము జెంది అనుభూతమయిన ధ్యానమని తెలియ వలయు. ఆ వృత్తి ఎడతెగనిచో సమాధియని తెలియవలయు. దీనికి ప్రమాణశ్లోకము:

"విలాప్య వికృతిం కృత్స్నాం సంభవవ్యత్యయాత్క్రమాత్ ।
పరిశిష్టం చ సన్మాత్రం చిదానందం విచింతయేత్ ॥"

సమస్త మనోవికారములను నశింపజేసి, ఒకప్పుడుండు టొకప్పుడు లేకుండుటను క్రమముచే మిగిలిన సన్మాత్ర చిదానంద పరబ్రహ్మమును బాగుగా చింతించవలయును. ఇదియే ధ్యానమని చెప్పబడెను. ఇచ్చోట బ్రహ్మాకారవృత్తి యప్పుడప్పుడు గలుగుట యను ధ్యానముయొక్క యభ్యాసముచే సంప్రజ్ఞాతసమాధి గలుగుననియు, సంతతబ్రహ్మా

కారవృత్తియగు సంప్రజ్ఞాతసమాధిచే (అవిచ్ఛిన్న బ్రహ్మాకారవృత్తియగు ధ్యానముచే) నిర్వికల్పసమాధి గలుగునని తెలియవలయును. ఇటుల సంప్రజ్ఞాత అసంప్రజ్ఞాత సమాధుల రెంటి కనువగునటుల ధ్యానభాగమును తెలియవలయును. అనగా ధ్యానముచే సంప్రజ్ఞాతసమాధియా నందుచే నసంప్రజ్ఞాతసమాధియు గలుగునని తెలియవలయును.

సూ॥ తదేవార్థమాత్రనిర్భాసం స్వరూపశూన్యమివ సమాధిః ॥ 3

పద॥ తత్ - ఏవ - అర్థమాత్రనిర్భాసం - స్వరూపశూన్యం - ఇవ - సమాధిః.

అర్థము॥ తత్ ఏవ = ఆ ధ్యానమే, అర్థమాత్రనిర్భాసం - అర్థమాత్ర = ధ్యేయవస్తుమాత్రము చేత, నిర్భాసం = భాసించునదియును, స్వరూపశూన్యం ఇవ = ధ్యాతృధ్యాన ధ్యేయములను త్రిపుటిస్వరూపముచే రహితమైనదివలె నుండుట, సమాధిః = సమాధియగును.

అవ॥ ధ్యానప్రకర్షచే గలుగు బ్రహ్మాత్మక విషయప్రవాహమును సంప్రజ్ఞాతసమాధిని దానిచే గలుగు అసంప్రజ్ఞాతసమాధిని తెలుపుచున్నారు.

తా॥ బ్రహ్మాకారవృత్తిరూపధ్యానమే కేవల ధ్యేయవస్తు గోచరమయినదై (ఇతర

విషయచిత్త లేనిదై) ధ్యానస్వరూపమునుగూడ వదలి ("నేను భావించుచున్నాను, నేను ధ్యానించుచున్నానను భావనగూడ వదలి) ఉంటున్నదివలె భాసించుట సమాధియగును. అనగా నేను బ్రహ్మమను భావనారూప ధ్యానముచే బ్రహ్మాకారవృత్తిగలది చిత్తమగుట యను సంప్రజ్ఞాతసమాధి సిద్ధించగా తదనన్తరం బ్రహ్మాకారవృత్త్యతీతమగు బ్రహ్మములో చిత్తము లయించి యుండుట బ్రహ్మమే యుండుట అను అసంప్రజ్ఞాతసమాధి త్రిపుటిరహితస్థితి సిద్ధించును. ఇందులకు ప్రమాణశ్లోకము:

> బ్రహ్మాకారమనోవృత్తిప్రవాహోఽహంకృతిం వినా ।
> సంప్రజ్ఞాతసమాధిస్స్యాద్ధ్యానాభ్యాసప్రకర్షతః ॥

ధ్యానాభ్యాసాతిశయముచే నహంకారవృత్తి లేక బ్రహ్మాకార మనోవృత్తి ప్రవాహమేదిగలదో అదియే సంప్రజ్ఞాతసమాధియగును. ఈ ప్రకారము నుడువుటచే ధ్యాన సమాధులకు భేదము లేదని చెప్పతగదు. వాటికిభేదముండియే యున్నది. అది యుక్తమేను. ధ్యాతృధ్యానధ్యేయములను త్రిపుటి సాపేక్షతచే గలుగు బ్రహ్మాకార చిత్తవృత్తి ధ్యానము, ఆ ధ్యానముయొక్క ప్రకర్షచే ధ్యాతృధ్యానధ్యేయముల యనుసంధానము

లేకుండగనే ధ్యేయమాత్రము అగునట్టి వైరాగ్యముచేతను, సాదర దీర్ఘకాల నైరంతర్యముల చేతను సేవింపబడినది. కనుక నే రజస్తమోగుణములు నశించుటచే సత్త్వగుణోద్రేకముచే నిరంతరము విస్పష్టమగు స్ఫూర్తినే అది సంప్రజ్ఞాతసమాధియగును. పరవైరాగ్యము చేతను, నిరుద్ధప్రయత్నముచేతను సత్త్వగుణావరణముగూడ దొలంగగా, సంప్రజ్ఞాతసమాధి గూడ నిరుద్ధము గాగా, సర్వవృత్తులు నశించగా బ్రహ్మమే భాసిల్లుచున్నదను నిర్బీజసమాధి సిద్ధించును.

శ్లో॥ మనసో వృత్తిశూన్యస్య బ్రహ్మాకారతయా స్థితిః ।
యాఽసంప్రజ్ఞాతనామాసౌ సమాధిరభిధీయతే ॥

వృత్తిశూన్యమైన మనస్సు బ్రహ్మాకారముగా నుండుట అసంప్రజ్ఞాత సమాధి యగును. ఇటుల వీటి విభాగము తెలియనగును.

## సూ॥ త్రయమేకత్ర సంయమః ॥ 4

పద॥ త్రయం - ఏకత్ర - సంయమః.

అర్థము॥ ఏకత్ర = ధ్యేయవిషయమునందలి, త్రయం = ధారణాధ్యానసమాధులు మూడును, సంయమః = సంయమమని చెప్పబడును.

అవ॥ ధారణాధ్యానసమాధుల స్వరూపనిరూపణను గావించి ఉత్తరత్ర వీనిని సులభముగా వ్యవహరించుటకై సంయమమనగా ధారణాదిత్రయమని చెప్పుచున్నారు.

తా॥ ధారణాధ్యానసమాధులు ధ్యేయబ్రహ్మ మొకదానికే విషయములగుటచే నీ మూడును జేరి సంయమసంజ్ఞ గలవయినవి. సంయమమను నొకేపదముచే ధారణాదిత్రయము చెప్పబడుచున్నదని తెలియావలయును.

## సూ॥ తజ్జయాత్ప్రజ్ఞాలోకః ॥ 5

పద॥ తజ్జయాత్ - ప్రజ్ఞాలోకః.

అర్థము॥ తజ్జయాత్ = ఆధారణాధ్యానసమాధులయొక్క జయమువలన, ప్రజ్ఞాలోకః - ప్రజ్ఞా = సమాధిప్రజ్ఞయొక్క, ఆలోకః = ఋతంభరత్వమను దీప్తి గలుగును.

అవ॥ సంయమముయొక్క ప్రయోజనమును తెలుపుచున్నారు.

తా॥ ఈ సంయమముయొక్క (ధారణాదిత్రయముయొక్క) స్థిరత్వమువలన ఋతంభరాప్రజ్ఞ గలుగును. దీని స్వరూపము ప్రథమపాదమున తెలుపబడెను.

సూ॥ తస్య భూమిషు వినియోగః ॥ 6

పద॥ తస్య - భూమిషు - వినియోగః.

అర్థము॥ భూమిషు = ముందు చెప్పబడిన సవితర్క నిర్వితర్క సవిచార నిర్విచార మొదలగు యోగభూమికలలో, తస్య = ఆ సంయమముయొక్క (ధారణాది త్రయముయొక్క), వినియోగః = అభ్యాసోపయోగము చేయవలయును.

అవ॥ ఆ సంయమము ఎచ్చట వినియోగింపబడవలయునో తెలుపుచున్నారు.

తా॥ ప్రథమపాదమున చెప్పబడిన స్థూలవిషయములను సాక్షాత్కరించు సవితర్క నిర్వితర్కములు, సూక్ష్మవిషయములను విషయీకరించు సవిచార నిర్విచారములు మొదలగు యోగభూమికలయందు ఈ సంయమాభ్యాసము చేయబడే నేని (ధారణాధ్యానసమాధులను ఆ భూమికలయందు శీలించినచో) ఋతంభరాప్రజ్ఞ దేదీప్యమానమగును.

సూ॥ త్రయమన్తరఙ్గం పూర్వేభ్యః ॥ 7

పద॥ త్రయం - అన్తరఙ్గం - పూర్వేభ్యః.

అర్థము॥ పూర్వేభ్యః = మొదటివగు యమనియమాది పంచాంగములకంటె, త్రయం = ధారణ ధ్యాన సమాధులు మూడు, అన్తరఙ్గం = అంతరంగసాధనములు.

అవ॥ సంప్రజ్ఞాత సమాధిప్రజ్ఞకు ధారణాత్రయ మంతరంగమని చెప్పుచున్నారు.

తా॥ సంప్రజ్ఞాతసమాధికి యమ నియమ ఆసన ప్రాణాయామ ప్రత్యాహారములను నైదంగములును బహిరంగములు. యమనియమములు హింసాది ప్రతిబంధకరూపములు; శౌచాది నియమములు ప్రవృత్తివిషయము; ఆసనము శరీరవిషయము; ప్రాణాయామము ప్రాణవాయువిషయము, పాపనాశవిషయము; ప్రత్యాహారము ఇంద్రియజయవిషయము. ఇటులా యైదంగములున్ను భిన్నవిషయములు గలవగుటచేతను, సాక్షాత్తుగా చిత్తైకాగ్రరూపసమాధిని గలిగింపజాలనివగుటచేతను బహిరంగములు. ధారణా ధ్యాన సమాధుల మూడగు సంయమమో, సాక్షాత్తుగా సంప్రజ్ఞాతసమాధిలాభమును గలుగజేయుటవల్లను, ధ్యేయమగు నొకే బ్రహ్మవిషయమగుటచేతను అంతరంగమని తెలియవలయు.

సూ॥ తదపి బహిరఙ్గం నిర్బీజస్య ॥ 8

పద॥ తత్ - అపి - బహిరఙ్గం - నిర్బీజస్య.

అర్థము॥ తత్ అపి = అంతరంగసాధనమగు సంయమమున్ను (ధారణాదిత్రయం), నిర్బీజస్య = సకలవృత్తిశూన్య చిత్తనిరోధరూప అసంప్రజ్ఞాతసమాధికి, బహిరంగం = బహిరంగసాధనమే యగును (దూరమున నున్నదియే యగును).

అవ॥ ధారణాదిత్రయముకూడ సంప్రజ్ఞాతసమాధి కంతరంగమే కాని వృత్తిరహిత, అసంప్రజ్ఞాత సమాధికి విజాతీయమగుటచే (వృత్తిరాహిత్యమును గలుగచేయదు గాన) బహిరంగమే యని స్పష్టపరచుచున్నారు.

[illegible] సాక్షాద్గా సాధనమయినది (ఉపకారకమయినది) అన్తరంగమనియు, పరంపరా సాధనమయినది (పరంపరగా ఉపకారమయినది - మరియొక దానిని ఆశ్రయించి ప్రయోజనమును గలిగించునది), బహిరంగమని యు తెలియవలయును. ఈ ధారణాది త్రయము సంప్రజ్ఞాతసమాధికి సాక్షాద్గా దేనిని ఆశ్రయించకనే ఉపకారకముగా నున్నందుచే నన్తరంగముగాను, అసంప్రజ్ఞాత సమాధికి పరంపరయా - సంప్రజ్ఞాతసమాధి ద్వారా ఉపకారకముగా నున్నందుచే వృత్తిశూన్యత్వమును గలుగజేయక దానికి సహాయకముగా నుండుటచే బహిరంగముగానున్నది. "శ్రద్ధా వీర్య స్మృతి సమాధి ప్రజ్ఞా

పూర్వక ఇతరేషాం" అను సూత్రముచే ప్రథమపాదమున ఆ ఉపకారకద్వయమును సూత్రకారుడు వివరించెను.

సూ॥ వ్యుత్థాననిరోధసంస్కారయోరభిభవప్రాదుర్భావౌ నిరోధక్షణ
చిత్తాన్వయో నిరోధపరిణామః ॥ 9

పద॥ వ్యుత్థాననిరోధసంస్కారయోః - అభిభవప్రాదుర్భావౌ - నిరోధక్షణచిత్తాన్వయః - నిరోధపరిణామః.

అర్థము॥ వ్యుత్థాననిరోధసంస్కారయోః - వ్యుత్థానసంస్కార = రజోగుణ తమోగుణములచే గలుగు సమాధి విరోధిసంస్కారములయొక్కా, నిరోధసంస్కారయోః = సమాధి కనుకూలములయిన చిత్తవృత్తినిరోధ సంస్కారములయొక్కాయు, అభిభవప్రాదుర్భావౌ = తిరస్కారము, ఉదయమున్ను (గలుగుచున్నవి) చిత్తవృత్తి నిరోధప్రయత్నముచే సమాధి విరోధి సంస్కారములు అణగుచున్నవి. సమాధి కనుకూలములగు నిరుద్ధసంస్కారము లుదయించుచున్నవి. అప్పుడు, నిరోధ = నిరోధప్రయత్నమందు, క్షణచిత్తాన్వయః - క్షణ = ప్రతిక్షణము, చిత్త =

మనస్సుయొక్క, అన్వయః = అనుసరించుట, నిరోధపరిణామః = నిరోధపరిణామమనబడును.

అవ॥ నిర్బీజసమాధిస్వరూపమును నిరూపించుచున్నారు.

తా॥ చిత్తమందు వ్యుత్థానసంస్కారములనియు, నిరోధసంస్కారములనియు రెండువిధములయిన సంస్కారము లుంటున్నవి. అందులో వ్యుత్థానసంస్కారములనగా రజస్తమోగుణములచే గలుగు చిత్తవృత్తులు, దుష్ట సంకల్పములు క్షిప్త విక్షిప్త మూఢములను చిత్తముయొక్క భేదములలో వివరింపబడినవి. ఆ సంస్కారములు సమాధికి భంగమును గలుగజేయు వ్యుత్థానసంస్కారములు. అవి చిత్తవృత్తుల నిరోధించుటను నిరోధప్రయత్నముచే, యోగాభ్యాసముచే నిరుద్ధములు గాగా, ఆ వ్యుత్థానసంస్కారములు నశించిపోవుచున్నవి. నిరోధసంస్కారము ఉదయించుచున్నవి. ఈలాగుండగా యోగసిద్ధిచే ప్రతిక్షణమందును చిత్తమందు నిరోధసంస్కారము ప్రబలముగుచున్నది. కావున చిత్తముయొక్క నిరోధపరిణామమే సకల వృత్తిరాహిత్య, సంస్కారశేష నిర్బీజసమాధియగును. అప్పుడు చిత్తము అవిద్యానిర్ముక్తమగును. ఇదియే నిర్వికల్పము.

సూ॥ తస్య ప్రశాన్తవాహితా సంస్కారాత్ ॥ 10

పద॥ తస్య - ప్రశాన్తవాహితా - సంస్కారాత్.

అర్థము॥ తస్య = ఆ నిరుద్ధచిత్తమునకు, సంస్కారాత్ = నిరోధసంస్కారాభ్యాస పాటవముపలన, ప్రశాన్తవాహితా = ఉత్తరోత్తర మధికమగు ప్రశమరూపవ నిరోధసంస్కారప్రవాహము (గలుగుచున్నది).

అవ॥ "ప్రతిక్షణం పరిణామినో హి భావా ఋతే చితిశక్తేః" చితిశక్తి = ఆత్మశక్తి తప్ప ప్రతిక్షణము చిత్తమందు భావములు మారుచుండును అను న్యాయానుసార ముగా చిత్తమునకు సర్వదా పరిణామప్రవాహము సంభవించుచునే యుండునని చెప్పవలయును. ఇటులైనను వ్యుత్థాన సంస్కారములు గల చిత్తమునకు వృత్తుల ప్రాదుర్భావము గలుగుచున్నది. నిరుద్ధచిత్తమున కెటుల వృత్తిప్రవాహ ముపపన్న మగును, పరిణామ మెటుల సంభవించునని సందేహించ తగదనియు, నిరుద్ధచిత్త మునకు వృత్తిరాహిత్యరూప ప్రశమప్రవాహామున్నదనియు తెలుపుచున్నారు.

తా॥ చిత్తమందు సకల వృత్తులను నిరోధించు ప్రయత్నబలిమివలన విక్షేపములగు వ్యుత్థాన సంస్కారములు నశించినవగుచున్నవి. అందుచే చిత్తము వృత్తిరహితమగుచున్నది. ప్రశాన్తిని జెందుచున్నది. అప్పుడు వృత్తినిరోధరూప ఉపశమముచే నిరోధసంస్కారప్రవాహము చిత్తమునకు గలుగుచు నేయున్నది. ఇందుచే చిత్తమునకు నిరోధపరిణామము వృత్తినిరోధప్రయత్న మధికమగుకొలది వృద్ధిని జెందుచు నేయున్నది. ఇటుల నిరుద్ధచిత్తమందును నిరుద్ధపరిణామము సంభవించినది. ఎప్పుడు వృత్తులనిరోధించు ప్రయత్నము మందమగునో, అప్పుడు తిరుగా వ్యుత్థానసంస్కారరూప విక్షేపములు గలిగి చిత్తము సమాధికి యోగ్యము గాదని తెలియవలయు. దీనినే దృష్టాంతపూర్వకముగా వివరించుచున్నారు. అగ్నియందు కట్టెలు నేయి మొదలగు నాహుతులను వేయుకొలది వహ్ని యభివృద్ధిని జెందుచు నేయున్నది. ఎప్పుడు సమిధాజ్యాహుతులను వేయకుందుమో, అప్పుడే అగ్ని శమింప ప్రారంభమగును. క్రమముగా వహ్ని ఉపశమించుచు నేయుండును. అప్పుడు అగ్నికి ఉపశమప్రవాహము ఉత్తరోత్తర మధికమగునటుల సకలవృత్తు లుపశమించిన చిత్తమునకును వృత్తి నిరోధ ప్రయత్నము సిద్ధించినందుచే నుపశమ సంస్కార

ప్రవాహము ఉత్తరోత్తర మధికమై సంభవించుచు నేయున్నది. అందులో ముందు గలిగిన ఉపశమ సంస్కారములు వెనుకనున్న ఉపశమసంస్కారములకు కారణములగుచున్నవి. ఇంతకు సిద్ధించిన యర్థమేమనగా నిరుద్ధచిత్తమునకు నుపశమసంస్కార ప్రవాహము బలమగుచునే యుండుటచే నిరోధపరిణామ మెంతయో పొసగియున్నది. నిర్వికల్పసమాధియు చిత్తముయొక్క ఉపశమరూప ధర్మమని రహస్యము. తర్వాత చిత్శక్తి దేజరిల్లునని భావము.

## సూ॥ సర్వార్థతైకాగ్రతయోః క్షయోదయౌ చిత్తస్య సమాధి పరిణామః ॥ 11

పద॥ సర్వార్థతైకాగ్రతయోః - క్షయోదయౌ - చిత్తస్య - సమాధిపరిణామః.

అర్థము॥ చిత్తస్య = చిత్తమునకు, సర్వార్థతైకాగ్రతయోః - సర్వార్థతా = ఏక కాలమునందువలె సమస్త విషయములను గ్రహించుటయొక్కయు, ఏకాగ్రతయోః = ఒకే విషయమును గ్రహించుటను నేకాగ్రతయొక్కయు, క్షయోదయౌ = క్రమముగా నాశము ఆవిర్భావమును, సమాధిపరిణామః = సమాధి పరిణామమగును

అవ॥ నిరోధ పరిణామరూప అసంప్రజ్ఞాత (నిర్బీజ) సమాధిని నిరూపించి సంప్రజ్ఞాత సమాధి పరిణామమును నిరూపించుచున్నారు.

తా॥ చిత్తము రజోగుణముయొక్క ప్రాబల్యముచే మిగుల చాంచల్యమును జెందినదై అనేక విషయములయందు పరుగిడుచున్నది. ఒకేసారిగా నన్నిటిని గ్రహించుచున్నదివలె సంచరణశీలమై సర్వార్థముల విషయము చేయుచున్నది. ఇదియే చిత్తమునకు సర్వార్థగ్రహణరూప విక్షేపధర్మము. రజోగుణ ప్రయుక్తమగు యిట్టి చాపల్యధర్మము యోగాభ్యాస ప్రయత్నముచే రజోగుణమును నిరోధించునట్టి యోగికి సర్వార్థగ్రహణత (అన్ని విషయములయందు పరుగిడుట) తగ్గుకొలది పూర్తిగా నాశమగుచున్నది. ప్రతిదినము చిత్తమందొకే విషయమును (బ్రహ్మమును) గ్రహించుటయను నేకాగ్రత ఆవిర్భూతమై అతిశయించుచున్నది. వృత్తి నిరోధప్రయత్నముచే చిత్తమందు విక్షేపసంస్కారములు నాశమగుటయు, ఏకాగ్రత గలుగుటయు సంప్రజ్ఞాతసమాధిపరిణామమగును. అనగా మనస్సు విక్షేపరహితమయ్యెనేని ఏకాగ్రతారూపసంప్రజ్ఞాతసమాధికి యోగ్యమగునని భావము.

సూ॥ శాన్తోదితౌ తుల్యప్రత్యయౌ చిత్తస్యైకాగ్రతాపరిణామః ॥ 12

పద॥ శాన్తోదితౌ - తుల్యప్రత్యయౌ - చిత్తస్య - ఏకాగ్రతాపరిణామః.

అర్థము॥ చిత్తస్య = సమాహితచిత్తముయొక్క, శాన్తోదితౌ - శాన్త = పుట్టి నశించినట్టి, ఉదితౌ = పుట్టినట్టి, (పోయినట్టి, ఉంటున్నట్టి), తుల్యప్రత్యయౌ - తుల్య = ఏకవిషయము నవలంబించినవగుటచే సమానములయిన, ప్రత్యయౌ = వృత్తులు, ఏకాగ్రతాపరిణామః = ఏకాగ్రతాపరిణామమనబడును.

అవ॥ చిత్తముయొక్క ఏకాగ్రతాపరిణామమును (మనస్సు ఏకాగ్రమగుటను) నిరూపించుచున్నారు.

తా॥ పరిణామమనగా, చిత్తమందు కొన్ని ధర్మరూపసంస్కారములు పుట్టి నశించుచుండును. మరికొన్ని యుదయించుచుండును. చిత్తము మాత్రము ఆధారముగా నన్నిటికుండును. యోగాభ్యాసమహిమచే చిత్తమునందలి విక్షేపవృత్తులు నశించుచున్నవి. అప్పుడు మనస్సు నిశ్చలమగుటచే చిత్తవృత్తిని నిరోధించునట్టి (వృత్త్యభావ) సంస్కారములు చిత్తమున దృఢముగా నిలుచుచున్నవి. విక్షేపవృత్తి నాశముచే నట్టి నిరోధసంస్కారమే యేర్పడును. తరువాత ఆ నిరోధసంస్కారము నశించగా, అట్టి నిరోధసంస్కా

రమే మరల పుట్టుచున్నది. అనగా చిత్తమందు ఉపశమవృత్తి పుట్టి నశించెను. తిరుగా నా ఉపశమమునే అవలంబించి మఱియొక నుపశమవృత్తి గలిగెను. అప్పుడు ఆ రెండు ఉపశమ (నిరోధ) వృత్తులు నిరోధమునే విషయముగా గలవగుచున్నవి. పుట్టి నశించిన (అతీత) వృత్తి యేపదార్థమును గ్రహించుచున్నదో, ఇప్పుడు పుట్టినవృత్తి (వర్తమానవృత్తి) ఆ పదార్థమునే గ్రహించినచో నవి సమానవృత్తులగును. మొదట విక్షేప వృత్త్యుపశమపూర్వకమైన చిత్తవృత్తుల నిషేధించుటయను నిరోధ ప్రయత్నవృత్తి ధ్యేయ వస్తువును గ్రహించుచున్నది. వృత్తికి స్థిరస్వభావము లేదు గనుక ఆ నిరోధవృత్తి లయము గాగా నట్టి నిరోధవృత్తి ఆ ధ్యేయవస్తువునే గ్రహించుచు నుదయమగుచున్నది. కావున పూర్వోత్తరముగా గలిగిన వృత్తులు సమాధియందు సమానములుగా నగుచున్నవి. ఇదియే సమాహితచిత్తమునకు ఏకాగ్రతాపరిణామము. ఇందుచే నిరోధసంస్కారములు బలము లగుచున్నవి. ఇది తాత్పర్యము: సమానములుకాని విక్షేపాదివృత్తులు నాశమగుటయు, తరువాత సమానములయిన నిరోధవృత్తులు గలుగుటయు చిత్తముయొక్క పరిణామమగును. వృత్తులయొక్క క్షయోదయములే పరిణామమనబడును. మొదట అసదృశములయిన విక్షే

పాదివృత్తులు ఏకముఖములుగా నగుచున్నవి. అందుచే చిత్తము నిశ్చలమగును. విక్షేపాదివృత్తులు నాశనమగును. అప్పుడు చిత్తమున నేకాగ్రత గలుగుచున్నది. అదియే (1) ఏకాగ్రతాపరిణామము. తరువాత సకలవిషయములను గ్రహించుటయను సర్వార్థసంస్కారములు నాశనములై చిత్తమందు ఏకాగ్రతాసంస్కారములు వృద్ధి నొందుచున్నవి. ఇది చిత్తమునకు (2) సమాధిపరిణామము. ఇచ్చోట నేకాగ్రత స్థిరపడినది. ఇకను వ్యుత్థానసంస్కారములు (విక్షేపాదివృత్తులు) పూర్తిగా నాశమగుటచే నిరోధప్రయత్నదృఢత్వముచే నిరోధసంస్కారములు ప్రవాహరీతిగా వృద్ధినొందుచున్నవి. ఇది (3) నిరోధపరిణామము. ఈ ప్రకారము చిత్తమునకు మూడు పరిణామముల దెలియవలయును. మఱియు (1) నిరోధపరిణామము, (2) సమాధిపరిణామము, (3) ఏకాగ్రతాపరిణామము. ఈ మూడు చిత్తమునొక్క ధర్మపరిణామములని తెలియవలయును. ఇదియే వాస్తవమయిన పరిణామము. ఇటులనే లక్షణపరిణామమనియు, అవస్థాపరిణామమనియు రెండు గలవు. ఇవి వాస్తవములుగావు; కల్పితములు. అనగా (1) ధర్మపరిణామము, (2) లక్షణపరిణామము, (3) అవస్థాపరిణామము అనియు మూడు భేదములు గలవు. పైజెప్పిన సమాధి పరిణామ

దులు మూడున్ను ధర్మపరిణామములో చేరినవే. లక్షణపరిణామమనగా కాలపరిణామమని అర్థము. కాలముచే చిత్తమునకు మార్పు యేర్పడుటయగును. ఈ లక్షణపరిణామము "నిరోధక్షణచిత్తాన్వయః" అను సూత్రముచే ముందు సూచింపబడెను. (1) చిత్తవృత్తి నిరోధము కాలేదు. ఇది అనాగత (భావి)కాల చిత్తపరిణామము, (2) చిత్తవృత్తి నిరోధమున్నది. ఇది వర్తమానకాల చిత్తపరిణామము, (3) చిత్తవృత్తి నిరోధము ముగినెను. ఇది అతీత (పోయిన) కాలచిత్తపరిణామము. ఇదియే లక్షణపరిణామమనబడును. ఇక అవస్థాపరిణామమనగా, ప్రతిక్షణము అవస్థాభేదము గలుగుట. ఈ అవస్థాపరిణామము "వ్యుత్థాననిరోధసంస్కారయోరభిభవప్రాదుర్భావౌ" అను సూత్రముచే తెలియజేయబడెను. ప్రతిక్షణము నిరోధసంస్కారము నవీనముగా, నవీనముగా (క్రొత్త క్రొత్తగా) పుట్టుచుండుట దానిలో మొదటిది పురాతనమగుచున్నది. రెండవది నవీనమగుచున్నది ఇదియే అవస్థాపరిణామము. ధర్మపరిణామవిషయములో లక్షణ, అవస్థాపరిణామములు రెండును సూచితములాయెను. అటులనే ఏకాగ్రతాసమాధిపరిణామవిషయములలోను లక్షణ అవస్థాపరిణామముల దెలియవలయును. ఫలితార్థమేమనగా చిత్తమును ప్రతిక్షణము

నిరోధించుచు సమాధిస్థితిలో నుండవలయునని భావము.

**సూ॥ ఏతేన భూతేన్ద్రియేషు ధర్మలక్షణావస్థాపరిణామా వ్యాఖ్యాతాః॥**

పద॥ ఏతేన - భూతేన్ద్రియేషు - ధర్మలక్షణావస్థాపరిణామాః - వ్యాఖ్యాతాః.

అర్థము॥ ఏతేన = చిత్తమునకు పరిణామము మూటిని వచించుటచే, భూతేన్ద్రియేషు - భూత = పంచభూతములయందును, ఇంద్రియేషు = నేత్రాదీన్ద్రియముల యందును, ధర్మలక్షణావస్థాపరిణామాః = ధర్మ లక్షణ అవస్థాపరిణామములు, వ్యాఖ్యాతాః = వివరింపబడెను.

అవ॥ మూడు విధములగు పరిణామముల దెలిపిరి. ధారణాదిత్రయమగు సంయమమువలన గలుగు విభూతులను వివరింపబోవుచు సంయమమునకు లక్ష్యమగువాని నిక దెలుపు చున్నారు. చిత్తమునందే పరిణామసంభవము గాదు, భూతేన్ద్రియములందును పరిణామము సంభవించుననియును విశదపరచుచున్నారు.

తా॥ చిత్తముయొక్క (1) ధర్మ, (2) లక్షణ, (3) అవస్థాపరిణామముల దెలిపి

నందుచే పృథివ్యాది పంచభూతములందు, నేత్రాదీన్ద్రియములందును, ఆ మూడు పరిణామము లుంటున్నవని విశదమగుచున్నది. అందులో మృత్తు పృథివీభూతమునకు చేరినది. దాని నుదాహరించుచున్నారు. మృత్తు ధర్మిగానున్నది. ఆ మట్టియే ఘటమాయెనేని ధర్మపరిణామమగును. మట్టియందు పిండత్వ ఘటత్వ చూర్ణత్వాది ధర్మము లనేకములు గలుగుచున్నవి. ఇది ధర్మపరిణామము. (1) అయం ఘటః అతీతః = ఈకుండుండెను, ఇది భూతకాలము. (2) అయం ఘటః వర్తమానః = ఈకుండున్నది, ఇది వర్తమానకాలము. (3) అయం ఘటః భవిష్యః = ఈకుండ ఇక నుండగలదు, ఇది భవిష్యత్కాలము. ఇట్టి త్రికాలముల భేదముతో నొకే ఘటరూపధర్మము వ్యవహరింపబడుట అతీతానాగత వర్తమానలక్షణపరిణామమగును. ((1) అతీత, (2) అనాగత, (3) వర్తమాన లక్షణపరిణామములగును). మట్టియొక్క ధర్మమగు కుండ పగిలిపోయెను, మృద్ధర్మమగు చూర్ణమా పుట్టెను ఇత్యాదులు లక్షణపరిణామమగును. తరువాత నా ఘటము ప్రతిక్షణము మారుచుండినచో నవస్థాపరిణామమగును. ఇప్పుడున్న కుండలలో నిది ప్రాతది, ఇది క్రొత్తది మొదలగు వ్యవహారము లవస్థాపరిణామమగును.

సూ॥ శాన్తోదితావ్యపదేశ్యధర్మానుపాతీ ధర్మీ ॥ 14

పద॥ శాన్తోదితావ్యపదేశ్యధర్మానుపాతీ - ధర్మీ.

అర్థము॥ శాన్తోదితావ్యపదేశ్యధర్మానుపాతీ - శాన్త = అతీతములయిన (గడచిపోయినవియు), ఉదిత = ఉంటున్నవియు (వర్తమానకాలీనములయినవియు), అవ్యపదేశ్య = చెప్పవీలుకానివియు (ఇకను రాకుండుటచే రాబోవుచున్నవియు) నగు, ధర్మ = ధర్మములను, అనుపాతీ = అనుసరించునది, ధర్మీ = ధర్మియగును.

అవ॥ త్రివిధ పరిణామముల కాధారమయిన ధర్మిలక్షణమును తెలుపుచున్నారు.

తా॥ అనేకధర్మములు పుట్టుచు వచ్చుచుండినను నశించుచుండినను యేది మాత్రము ఆ ధర్మములకెల్ల నాధారమైయుండునో, వికారములు లేనిదైయుండునో, అదియే ధర్మియగును. చిత్తమందెన్నియో వృత్తు లుద్గతములగుచున్నవి, విలయము నొందుచున్నవి. చిత్తము మాత్రము మారకయు చెడకయు నున్నది. అదియే ధర్మి అగును. మృత్తికయందు చూర్ణపిండాదిరూపములు గలిగెను. ఘటము నిష్పన్నమైయున్నది. చూర్ణపిండాది ధర్మములు అతీతములు, ఘటము వర్తమానము. ఆ మట్టియందు ఘటత్వ

శక్తియున్నది. అవ్యపదేశ్యము ప్రకటముగానిది; ఘటము కలిగిన తర్వాత ఆశక్తి అభివ్యక్తమగును. అంతసముందు ఆశక్తి కనబడనందుచే భవిష్యత్తనియు, అవ్యపదేశ్యమనియు చెప్పబడెను. కావున చూర్ణపిండాది ధర్మములు పరిణామమును జెందుచున్నను (మారుచున్నను) మట్టి మాత్ర మట్లనే యున్నది. కనుక మృత్తికయే ధర్మియగును. చూర్ణపిండాదు లేతమువలె వచ్చిపోవునవి. ఇటుల ధర్మి స్వరూపము నిరూపితమాయెను.

సూ॥ క్రమాన్యత్వం పరిణామాన్యత్వే హేతుః ॥ 15

పద॥ క్రమాన్యత్వం – పరిణామాన్యత్వే – హేతుః.

అర్థము॥ క్రమాన్యత్వం = క్రమము భిన్నముగా నుండుట, పరిణామాన్యత్వే = పరిణామములు వేరువేరుగా గలుగుటలో, హేతుః = కారణము.

అవ॥ ఒకే ధర్మికి అనేకవిధ పరిణామములు గలుగుటలో కారణమును తెలుపుచున్నారు.

తా॥ ఒకే వస్తువునం దనేకవిధ ధర్మపరిణామములు క్రమము భిన్నభిన్నముగా నున్నందుచే గలుగుచున్నవి. ఒకే మట్టియందు చూర్ణపిండరూప ధర్మములు గలుగు

చున్నవి. మట్టి చూర్ణమై పిండమయినది. ఇందున చూర్ణమయిన తరువాతనే పిండము (ముద్ద) ఏర్పడెను. కావున చూర్ణపిండములకు క్రమమున్నది. ఇకను పిండఘటములు ఘటకపాలములు యేర్పడుచున్నవి. పిండమై ఘటమై పగిలి పెంకులుగా మట్టియగు చున్నది. ఇటు లొకటేర్పడిన దరువాతనే మఱియొకటేర్పడుచున్నది. అదియే క్రమ మనబడును. ఆ క్రమములు మట్టియను ధర్మి మొదలుజేసికొని చూర్ణపిండాదిరూపములై మట్టి మట్టిలో కలియువరకు అనేకములుగా నున్నవి. కావున క్రమభేదముచే పరిణామ బహుత్వమును తెలియవలయును. ఇటులనే లక్షణాపరిణామము, అవస్థాపరిణామము, కాలక్రమ, దుర్లక్ష్య సూక్ష్మపరిణామ క్రమముల అనేకత్వముచే ననేకములని దెలియ వలయును.

## సూ॥ పరిణామత్రయసంయమాదతీతానాగతజ్ఞానమ్ ॥ 16

పద॥ పరిణామత్రయసంయమాత్ – అతీతానాగతజ్ఞానం.

అర్థము॥ (యోగికి) పరిణామత్రయసంయమాత్ – పరిణామ = ధర్మ, లక్షణ, అవస్థా పరిణామములను, త్రయ = మూడింటియందు, సంయమాత్ = సంయమమువలన

(ధారణ ధ్యాన సమాధులొనర్చుటవలన), అతీతానాగతజ్ఞానమ్ - అతీత = భూతములయిన, అనాగత = భవిష్యత్తులయిన వస్తువులయొక్క, జ్ఞానమ్ = సాక్షాత్కారము గలుగుచున్నది.

అవ॥ ఈ ప్రకారము సంయమమునకు లక్ష్యస్థానముల వక్కాణించి ప్రస్తుత మీపాదము పూర్తియగువరకు సంయమసిద్ధిని సూచించు విభూతులను తెలుపుచున్నారు.

తా॥ ఈ ధర్మియందు ధర్మములివి; వీనియందలి లక్షణములు అతీత, అనాగత, వర్తమానములై యున్నవి. నవీనప్రాచీనావస్థలివి యను విచారణచే ధర్మ లక్షణ అవస్థాపరిణామముల మూటియందు ధారణాధ్యాన సమాధులను శీలించిన యోగికి వర్తమాన పదార్థ సాక్షాత్కారము సిద్ధమయ్యేయున్నది. ఇక భూతభవిష్యత్పదార్థముల సాక్షాత్కారము గలుగును. జరిగినవి, జరుగనున్నవి యగు పదార్థముల జ్ఞానము గలుగుచున్నదని భావము. త్రికాలజ్ఞానియు నగుచున్నాడు. చిత్తసత్త్వము = చిత్తమునందలి శక్తి సర్వార్థముల గ్రహించు స్వభావముగలదియై యున్నది. ఇక రజోగుణ తమోగుణ మాలిన్యములు పూర్తిగా సంయమముచే నశించగా చిత్తసత్త్వము ప్రకాశకమగు శుద్ధచిత్తము యేప్రమా

ణము నపేక్షింపక సమస్తమును తెలిసికొనుచున్నదని భావము, చిత్తమందు సత్త్వోత్కర్ష అధికరించుచున్నదని తెలియవలయును. ఆ యోగి త్రికాలములయందలి యెట్టి సూక్ష్మ పదార్థములను గ్రహించునని భావము.

సూ॥ శబ్దార్థప్రత్యయానామితరేతరాధ్యాసాత్సంకరస్తత్ప్రవిభాగ-
సంయమాత్సర్వభూతరుతజ్ఞానమ్ ॥ 17

పద॥ శబ్దార్థప్రత్యయానాం - ఇతరేతరాధ్యాసాత్ - సంకరః - తత్ప్రవిభాగసంయమాత్ - సర్వభూతరుతజ్ఞానం.

అర్థము॥ శబ్దార్థప్రత్యయానాం - శబ్ద = (గౌరితిశబ్దః) గోవు అను మొదలగు శబ్దములు, అర్థ = (గౌరితి అర్థః) గోవు అను మొదలగు అర్థములు, ప్రత్యయానాం = (గౌరితి ప్రత్యయః) గోవు అను మొదలగు జ్ఞానములు (అర్థవిషయక జ్ఞానములు) ఈ మూడింటికి, పరస్పరాధ్యాసాత్ - పరస్పర = అన్యోన్యము యొక్క, అధ్యాసాత్ = అభేదనిశ్చయమువలన, సంకరః = ఒకదానిలో నొకటి కలియుట యను సంబంధము (గలుగును), తత్ప్రవిభాగసంయమాత్ -

తత్ = ఆ శబ్దార్థ జ్ఞానముల యొక్క, ప్రవిభాగ = విభేదమందు, సంయమాత్ = సంయమనము వలన (ధారణాధ్యాన సమాధుల శీలించుటవలన), సర్వభూతరుత జ్ఞానం - సర్వభూత = సమస్తప్రాణులయొక్క (పశుపక్ష్యాదులయొక్కయు), రుత = శబ్దములయొక్క, జ్ఞానం = జ్ఞానము గలుగుచున్నది. అనగా పశుపక్ష్యాది సంభాషణమునుగూడ తెలియు తెలివి గలుగును.

అవ॥ యోగివరుడు పశుపక్ష్యాది భాషణమును సంయమనశక్తిచే తెలియుచున్నాడను విషయమును తేటపరచుచున్నారు.

తా॥ బాలురు మొదలుకొని పండితులును గవాది శబ్దములను, గవాది అర్థములను, గవాది జ్ఞానములను అభేదమునుగానే వేరు వేరు విభాగములేకనే వ్యవహరించుచున్నారు. వానికి పరస్పరవిభాగమున్నను (గోశబ్ద ముచ్చరించిన తర్వాతనే గోరూప అర్థము తెలియబడుచున్నది. అర్థస్ఫూర్తి గలిగిన తర్వాతనే తద్విషయక జ్ఞానమున్ను గలుగుచున్నది. అప్పుడు పురుషుడు గోశబ్దోచ్చారణచే గోరూపార్థమును తెలిసి గోవిషయక జ్ఞానము గలవాడను నేనగుచున్నానని నిశ్చయించుకొనుచున్నాడు. ఇట్టి క్రమమున్నను)

ఆ విభాగముయొక్క యనుసంధానము లేకనే శబ్దార్థ ప్రత్యయములు వ్యవహారగోచరములగుచున్నవి. పామరులుగూడ శబ్దార్థజ్ఞానములయొక్క విభాగము తెలియబడకున్నను శబ్దార్థజ్ఞానములను ప్రయోగదశయందు గలవారగుచున్నారు, విషయీకరించుచున్నారు, క్రమమున్నను ఒకేసారి అంత శీఘ్రముగా శబ్దార్థముల తెలియుచున్నారు. ఇది సర్వసామాన్యము. ఇందుచే శబ్దార్థజ్ఞానములను మూడింటికి పరస్పర సాంకర్యమేర్పడి విభాగము తెలియక పోవుచున్నది. ఇది లోకప్రసిద్ధము. కావున శబ్దార్థజ్ఞానముల విభాగమందు సంయమనమును యోగి జేయవలయును; విభాగము = వర్ణ (అక్షర)ములచే నభివ్యక్తమగునది పదము, పదములచే ప్రకటమగునది వాక్యము. కొన్ని వర్ణములు జేరి పదమగుచున్నది, కొన్ని పదములు జేరి వాక్యమగుచున్నది. (1) వర్ణములు, (2) పదములు, (3) వాక్యములు, (4) శబ్దతత్త్వము = శబ్దము, శక్తిలక్షణములచే నర్థమును బోధించుట యను శబ్దస్వరూపము, (5) అర్థతత్త్వము = ద్రవ్యాది వాచ్యార్థములు, లక్ష్యార్థములు, ("గంగాయాం ఘోషః" అను ప్రయోగమున్నప్పుడు - గంగాశబ్దమునకు తీరరూప అర్థము లక్ష్యము), (6) శబ్దజన్య అర్థవిషయ ప్రత్యయము = శబ్దమువలన అర్థము తెలియ

బడుట ప్రత్యయము. ఇదియే జ్ఞానతత్త్వము. ఇదియే శాస్త్రయుక్తులచే సిద్ధమయిన శబ్దార్థజ్ఞానముల విభాగము. అందునధారణాధ్యాన సమాధులచే చిత్తమును దృఢముగా సంయమనము జేసినచో యోగికి శబ్దాదులయొక్క వశీకరణములు తెలుపు పశుపక్ష్యాది సమస్త ప్రాణుల శబ్దజ్ఞానసిద్ధి గలుగుచున్నది. ఏ యే ప్రాణి ఏ యే విషయములను రుత ములచే సంభాషించుచున్నవో, అద్దానినంతయును సంయమి తెలిసికొనుచున్నాడు.

సూ॥ సంస్కారసాక్షాత్కరణాత్పూర్వజాతిజ్ఞానమ్ ॥ 18

పద॥ సంస్కారసాక్షాత్కరణాత్ - పూర్వజాతిజ్ఞానం.

అర్థము॥ సంస్కారసాక్షాత్కరణాత్ - సంస్కార = చిత్తమునందలి అనాదిగా నున్న వాసనలయొక్క, సాక్షాత్కరణాత్ = ధారణ ధ్యాన సమాధిరూపవ సంయమముచే సాక్షాత్కరించుటవలన, పూర్వజాతిజ్ఞానం - పూర్వజాతి = ముందుజన్మలయొక్క, జ్ఞానం = జ్ఞానము గలుగును.

అవ॥ సంస్కారసంయమప్రయోజనమును తెలుపుచున్నారు.

తా॥ సంస్కారములు (1) అనుభవక్లేశజన్యములు, (2) పుణ్య పాపకర్మజన్యములు అని రెండు విధములు. అందులో మొదటి సంస్కారము లనేకజన్మలనుండియు నవిద్యాదిక్లేశముల ననుభవించుటచే బుట్టినవై స్మరణరూపములుగా నున్నవి. అనగా నవన్నియు చిత్తమున స్మరణకువచ్చి విక్షేప (చలన) మును గలుగజేయుచున్నవి. రెండవవిధమైన సంస్కారములు పుణ్యపాపములచే గలిగినవై సుఖదుఃఖములకు కారణములుగా నుంటున్నవి. చిత్తధర్మములగు నీ సంస్కారములన్నియు పూర్వజన్మపరంపరచే సంచితములై (సంపాదింపబడినవై) యున్నవి. ఇట్టి సంస్కారములు శాస్త్రములద్వారా వినబడినవియు, అనుమాన ప్రమాణముచే సిద్ధములయినవియు (ఊహింపబడినవియు) నగు సంస్కారములున్న చిత్తముయొక్క సంయమనశక్తిచే (ధారణ ధ్యాన సమాధులచే) సాక్షాత్కరింపబడినప్పుడు యోగి తనయొక్కయు నితరులయొక్కయు పూర్వజన్మపరంపరలను తెలియుచున్నాడు. ఈ సంస్కారములను మాత్రము సాక్షాత్కారముచే పూర్వజన్మజ్ఞాన మెటుల గలుగునని శంకింపరాదు. సానుబంధసంస్కార

ములు (దేశకాలాదులతో గూడిన సంస్కారముల) సాక్షాత్కారముచే పూర్వజన్మసాక్షాత్కార మబ్బును. తాను ఏయే దేశములయందు కాలములయందు జేసినదంతయును సాక్షాత్కరించిన అట్టి పూర్వజన్మ జ్ఞానోదయమగును.

సూ॥ ప్రత్యయస్య పరచిత్తజ్ఞానమ్ ॥ 19

పద॥ ప్రత్యయస్య - పరచిత్తజ్ఞానం.

అన్వ॥ ప్రత్యయస్య — పరులచిత్తముయొక్క సంయమముచే (సాక్షాత్కరించుటవలన)
పరచిత్తజ్ఞానం = ఇతరుల చిత్తముయొక్క (జ్ఞానం) ఎఱుంగుట యేర్పడును.

అవ॥ పరచిత్తముయొక్క సంయమప్రయోజనము దెలుపుచున్నారు.

తా॥ ఇతరుల మనస్సునందు సంయమము సంయమనమును శీలించినచో, ఇతరుల చిత్త మెట్టిదో, అద్దానిని తెలియును. తెలివిగలవాడగుచున్నాడు.

సూ॥ న చ తత్సాలమ్బనం తస్యావిషయీభూతత్వాత్ ॥ 20

పద॥ న - చ - తత్ - సాలమ్బనం - తస్య - అవిషయీభూతత్వాత్.

అర్థము॥ తస్య = ఇతరుల చిత్తమునకు ఆలంబనమయిన విషయము, అవిషయీభూతత్వాత్ = యోగికి విషయము గాకపోవుటవలన (యోగిచే పరచిత్త మేవిషయములో ప్రవర్తించుచున్నదో యను విషయము తెలియబడకుండుటవలన), సాలమ్బనం = విషయముతోఁగూడిన, తత్ = ఆ పరుని చిత్తము, న చ = తెలియబడని విషయమందు సంయమముజేయ సాధ్యముగానందుచే సాక్షాత్కరింపబడదు.

అవ॥ చిత్తమందలి సంస్కారముల సాక్షాత్కరించుటచే వానికాధారమగు దేశకాలాదులను ననుబంధములుగూడ సాక్షాత్కృతములగును గాన (గోచరములగును గాన) ఆలాగున నితరుల చిత్తమును సాక్షాత్కరించుటచే పరుల మనస్సు యే విషయములో ప్రవర్తించుచున్నదో, యే పదార్థమును గోరుచున్నదో అవి యితర చిత్తములకు విషయములయిన పదార్థములనుగూడ సాక్షాత్కరింపవచ్చునా? అట్టి పరచిత్తవిషయకజ్ఞానము గలుగవచ్చునుగదా? అని చెప్పుటకు సాధ్యముగాదని నుడువుచున్నారు.

తా॥ యోగివరుడు సంయమనశక్తిచే పరచిత్తమును మాత్రము సాక్షాత్కరింప

గలుగును. ఆ పరుని చిత్త మేవిషయమందు ప్రవర్తించుచున్నదో, ఆ విషయమును తెలియజాలడు. ఎందుకనగా — యోగి విషయమైనదానిని (గోచరించినదానిని) సంయమనశక్తిచే ప్రత్యక్షగోచరముగా జేసికొనుచున్నాడు. పరుని చిత్తము మాత్రము విషయమగుచున్నది. ఆ యితరుని చిత్తమున కాధారమయిన విషయమెద్దియో తెలియబడుట లేదు. తెలియబడని వస్తువునందు సంయమనముజేయ సాధ్యముగానందుచే సంయమనశక్తిచే నితరుని చిత్తము సాక్షాత్కరించునటుల నితరుని చిత్తమున కాలంబనమయిన విషయమును యోగి తెలియజాలడని తాత్పర్యము. ఇది సూత్ర తాత్పర్యము. మఱియు యోగి పర చిత్తమును సాక్షాత్కరించిన తరువాత వీని చిత్తము యద్విషయకమని తిరుగా తనయొక్క చిత్తమును పరచిత్తమున కాధారమయిన విషయమందుంచెనేని అప్పుడా కాలములోనున్న పరుని చిత్తవిషయమునున్ను సాక్షాత్కరించుచున్నాడు. ఇటుల సాలమ్బనమగు (విషయముతో గూడిన) చిత్తమునుగూడ పైవిధమున యోగి సాక్షాత్కరించుచున్నాడు. చిత్తమందలి రాగాదులు సమానముగా నున్నందుచే సదా సాక్షాత్కృతములే యగుచున్నవి.

సూ॥ కాయరూపసంయమాత్తద్గ్రాహ్యశక్తిస్తమ్భే చక్షుఃప్రకాశా-
సంప్రయోగేఽన్తర్ధానమ్ ॥ 21

పద॥ కాయరూపసంయమాత్ - తద్గ్రాహ్యశక్తిస్తమ్భే - చక్షుఃప్రకాశాసంప్రయోగే - అన్తర్ధానం.

అర్థము॥ కాయరూపసంయమాత్ = తన శరీరముయొక్క రూపమందు సంయమమువలన, తద్గ్రాహ్యశక్తిస్తమ్భే సతి - తత్ = ఆ రూపముయొక్క, గ్రాహ్య = గ్రహణ యోగ్యమైన యితరుని నేత్రశక్తియొక్క, స్తమ్భే సతి = నిరోధము (అడ్డము) గలుగగా, చక్షుఃప్రకాశాసంప్రయోగే - చక్షుఃప్రకాశ = పరుని నేత్రప్రకాశముయొక్క, అసంప్రయోగే = వియోగమందు (సంబంధము లేనప్పుడు), అన్తర్ధానం = ఇతరుల కన్నుల కగపడకుండుట యను సిద్ధి గలుగును.

అవ॥ ఇకను సంయమసిద్ధులను వచించుచున్నారు.

తా॥ యోగివరుడు తన దేహముయొక్క రూపమందే (అద్దమునందు గాని యందు ప్రతిఫలించిన దేహమందు గాని లేక తన ఛాయయందు గాని) చిత్తముంచి ధారణ ధ్యాన

ముల జేయుట, సమాధిస్థితి నొందుట, చిత్తము తదాకారమగుట అను సంయమన శక్తిచే నితరుల నేత్రములకు కానబడుట యను శక్తి నిలిచిపోవుచున్నది. అప్పుడు ఆ యోగిని యితరులు చూడజాలకపోవుచున్నారు. యోగి శరీరరూపమం దితరుల నేత్రప్రసారము పడకపోవుచున్నది. అందుచే యోగికి శరీరమును కనపరచకుండుటను అన్తర్ధానశక్తి యథేచ్ఛగా సిద్ధించును.

## సూ॥ ఏతేన శబ్దాద్యన్తర్ధానముక్తమ్ ॥ 22

పద॥ ఏతేన - శబ్దాద్యన్తర్ధానం - ఉక్తం.

అర్థము॥ ఏతేన = ఈ యన్తర్ధానశక్తి నుడువుటచే (రూపసంయమము చెప్పుటచే),

శబ్దాద్యన్తర్ధానం - శబ్దాది = శబ్ద, స్పర్శ, రస, గంధముల నాలుగింటియందును (సంయమమువలన), అన్తర్ధానం = ఇతరులు తనయొక్క శబ్దాదుల తెలియరను అన్తర్ధానసిద్ధి గలుగును.

అవ॥ రూపసంయమమువలె శబ్దాది సంయమములను తెలుపుచున్నారు.

తా॥ రూపమందువలె శబ్ద, స్పర్శ, రస, గంధములయందు సంయమము జేసిన యోగి తన శబ్ద, స్పర్శ, రస, గంధముల నితరులు తెలియజాలనట్టి శక్తిరూప అన్తర్ధాన సిద్ధిని పొందుచున్నాడు.

సూ॥ సోపక్రమం నిరుపక్రమం చ కర్మ తత్సంయమాదపరాన్త-జ్ఞానమ్ ॥ 23

పద॥ సోపక్రమం - నిరుపక్రమం - చ - కర్మ - తత్సంయమాత్ - అపరాన్తజ్ఞానం.

అర్థము॥ సోపక్రమం = శీఘ్రముగా ఫలము నిచ్చునట్టియు (ప్రారబ్ధమైన), నిరుపక్రమం చ = చాలకాలమునను ఫలించిపోవునదియున్న (ఆగామి) అయిన, కర్మ= ఏ కర్మగలదో, తత్సంయమాత్ - తత్ = ఆ ద్వివిధకర్మలయందు, సంయమాత్ = సాక్షాత్కారమువలన, అపరాన్తజ్ఞానం = కర్మ ఫలితమైన ఆయుస్సు యొక్క అవసానకాలము యొక్క జ్ఞానము గలుగుచున్నది. తాను మరణించు కాలమును తెలియుచున్నాడు.

అవ॥ యోగికి సంయమశక్తిచే నవసానకాల జ్ఞానసిద్ధిని తెలుపుచున్నారు.

తా॥ కర్మ శీఘ్రవిపాకమగు సోపక్రమమనియు, చిరవిపాకమగు నిరుపక్రమమనియు రెండు విధములైయున్నది. అనగా ప్రారబ్ధకర్మ ఫలోన్ముఖమగుటచే శీఘ్రముగా ఫలము నిచ్చుచునేయున్నది. ఆగామికర్మ యెప్పుడో ఫలము నీయబోవుచున్నది. ఆ ప్రారబ్ధ ఆగామి కర్మలయందు చిత్తమును సంయమనముజేసి సాక్షాత్కరించిన కర్మఫలితమగు ఆయుస్సుయొక్క పూర్తికాలము తెలియబడుచున్నది. ద్వివిధకర్మసాక్షాత్కారముచే నీప్రదేశమం దీసమయమున శరీరము వియోగము జెందునని తెలియుచున్నాడు. ఇదియే మరణసమయ జ్ఞానసిద్ధియగును.

## సూ॥ అరిష్టేభ్యో వా ॥ 24

పద॥ అరిష్టేభ్యః – వా.

అర్థము॥ అరిష్టేభ్యః వా = మరణసూచకములగు ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవిక అరిష్టములవలనగాని మరణసమయజ్ఞానము గలుగును.

అవ॥ ప్రసంగవశమున రోగి కానివానికికూడ గలుగు సాధారణ మరణసూచనను తెలుపుచున్నారు.

తా॥ మరణమును తెలియజేయునట్టి అరిష్టములు (1) ఆధ్యాత్మికారిష్టము, (2) ఆధిభౌతికారిష్టము, (3) అధిదైవికారిష్టము అని మూడు విధములుగా నున్నవి. వీటిచే యోగి కానివారందఱికిగూడ మరణసూచన గలుగుచున్నది.

అరిష్టములనగా అరివత్ త్రాసయన్తి అను వ్యుత్పత్తిచే శత్రువువలె భయపెట్టునవి. మరణసూచకములు: (1) ఆధ్యాత్మికారిష్టమనగా – ఇంద్రియములకు సంబంధించినవి. చెవులు మూసికొనిన ప్రణవశబ్దము వినకుండుట లేక ఏశబ్దము వినకుండుట. కన్నుల నదిమిన జ్యోతిదర్శనము కాకుండుట. ఇవి మొదలగునవి. ఇవి మరణసమయమును జూపును (2) ఆధిభౌతికారిష్టము – యమభటాది పిశాచముల భీకరదర్శనము. (3) అధిదైవికారిష్టము – హఠాత్తుగా సిద్ధాదుల దర్శించుట. ఇది పుణ్యపురుషులకు గలుగును. స్వభావమునకు విపరీతముగా గనబడుటంతయును నరిష్టమేయగును.

సూ॥ మైత్ర్యాదిషు బలాని ॥ 25

పద॥ మైత్ర్యాదిషు – బలాని.

అర్థము॥ మైత్ర్యాదిషు – మైత్రి మొదలగున భావనలయందు (ఆదిశబ్దముచే కరుణా

ముదిత భావనల వలన (సంయమముచే) మైత్ర్యాది బలములు గలుగుచున్నవి.

అవ॥ ఇకను కొన్ని సిద్ధులను వర్ణించుచున్నారు.

తా॥ మైత్రి కరుణా ముదితలను మూడు భావనలను సంయమముచే సాక్షాత్క-రించిన యోగి "సుఖితేషు మైత్రిం భావయేత్" అన్నటుల సుఖవంతులయెడ సుఖమునే భావించిన మైత్రీబలమును పొందుచున్నాడు. సకల ప్రాణులును వీనియెడ సఖ్యతతో మెలంగును. సకల ప్రాణులకును సుఖమును గలుగజేయు సామర్థ్యమున్న గలుగును. "దుఃఖితేషు కరుణాం భావయేత్" అన్నట్లు దుఃఖమును జెందినవారి విషయమై కరుణను భావించిన కరుణాబలమును పొందుచున్నాడు. సకల ప్రాణులను దుఃఖముల నుండి రక్షించునట్టి యుద్ధరణసామర్థ్యము గలవాడగుచున్నాడు. "పుణ్యాత్మేషు ముదితాం భావయేత్" అన్నట్లు పుణ్యవంతులయెడ ముదితను (సంతోషమును) భావించిన ముదితాబలమును పొందుచున్నాడు. చింతాయుక్తులగు ప్రాణులను సంతోషపెట్టు సామర్థ్యము గలవాడగును, ఉపేక్షయనగా నౌదాసీన్యముగా నుండుట గనుక నచ్చోట భావనాసంయమము కుదురదు గాన నేబలము లేదు.

సూ॥ బలేషు హస్తిబలాదీని॥ 26

పద॥ బలేషు - హస్తిబలాదీని.

అర్థము॥ బలేషు = గజము, గరుత్మంతుడు, హనుమంతుడు మొదలగువారియొక్క బలములయందు (సంయమముచే), హస్తిబలాదీని = గజబలము మొదలయినవి గలుగుచున్నవి.

తా॥ గజముయొక్కయు, గరుత్మంతుడు, హనుమంతుడు మొదలగువారియొక్కయు బలముల భావించి సంయమనసామర్థ్యముచే యోగి గజబలమును, గరుత్మంతుని బలమును, ఆంజనేయుని బలమును యిటుల దేనిని భావించిన నాబలమును పొందుచున్నాడు. ఎందువలన ననగా చిత్తమునకట్టి సామర్థ్యము స్వతస్సిద్ధముగనే యున్నది. దేనిని భావించిన అట్టి సామర్థ్యమును మనస్సే గలుగజేయునని తాత్పర్యము.

సూ॥ ప్రవృత్త్యాలోకన్యాసాత్సూక్ష్మవ్యవహితవిప్రకృష్టజ్ఞానమ్॥ 27

పద॥ ప్రవృత్త్యాలోకన్యాసాత్ - సూక్ష్మవ్యవహితవిప్రకృష్టజ్ఞానం.

అర్థము॥ ప్రవృత్త్యాలోకన్యాసాత్ - ప్రవృత్తి = జ్యోతిష్మతీ ప్రవృత్తియొక్క, ఆలోక = జ్యోతిస్సుయొక్క (ప్రకాశముయొక్క ఆధారమైన నిర్మల బుద్ధి సత్త్వముయొక్క), న్యాసాత్ = సంయమముద్వారా యుంచుటవలన, సూక్ష్మ వ్యవహిత విప్రకృష్టజ్ఞానం = సూక్ష్మములయిన వ్యవధానము (అడ్డు) గలిగిన వయిన దూరస్థలములనున్న పదార్థములయొక్క సాక్షాత్కారజ్ఞానము గలుగును.

అవ॥ సకల వస్తువుల విషయీకరించు ఆధిభౌతిక సిద్ధిని తెలుపుచున్నారు.

తా॥ హృదయకమలమునందలి సుషుమ్నాస్థానమందు ధ్యానమహిమచే సకలమును ప్రకాశింపజేయు ప్రవృత్తి చిత్తమున నుదయించుచున్నది. దానినే జ్యోతిష్మతీ ప్రవృత్తి యందురు. సర్వప్రకాశక జ్యోతిష్మతీ ప్రవృత్తికాధారమైన, నిర్మలమైన, ప్రకాశరూపమైన బుద్ధిసత్త్వమును బుద్ధిప్రభాశక్తిని సూక్ష్మములగు పరమాణ్వాదులయందును, భూమిచే వ్యవహితములయిన నిధి మొదలయినవానియందును, దూరములోనున్న అనగా మేరుపర్వత గుహలోపలయున్న రసాయనాదులయందును ధారణా ధ్యాన సమాధి రూపమున ప్రయోగించి సాక్షాత్కరించిన, సూర్యకాంతి ప్రసారముచే చిన్న చిన్న

కూటములుగూడ (గుహలుగూడ) సాక్షాత్కరించు విధమున, సూక్ష్మవ్యవహిత దూరస్థము లయిన పైన జెప్పబడిన పదార్థములన్నిటియొక్కయు సాక్షాత్కారజ్ఞానము గలుగును. యోగి యిటులన్నిటిని తెలియుచున్నాడని భావము.

## సూ॥ భువనజ్ఞానం సూర్యే సంయమాత్ ॥ 28

పద॥ భువనజ్ఞానం - సూర్యే - సంయమాత్.

అర్థము॥ సూర్యే = సూర్యభగవానునియందు, సంయమాత్ = సంయమమువలన, భువనజ్ఞానం = పదునాలుగు లోకములయొక్క జ్ఞానము గలుగుచున్నది.

అవ॥ చతుర్దశలోకవిజ్ఞానసిద్ధి సంయమసాధ్యమని తెలుపుచున్నారు. ఇది అధిదైవికము.

తా॥ సుషుమ్న మొదలగు సహస్ర కిరణ సమూహముతో నొప్పుచున్న యాకాశమందు సూర్యమండలము ప్రకాశించగా దానియందు అనగా యోగశాస్త్రము రీతిగా సుషుమ్నాస్థానమనబడు భ్రూమధ్యస్థానమునకు పైన సూర్యమండలము సర్వదా భాసమానమై యున్నది. దానియందుగాని చిత్తముంచి సంయమనము జేసిన చిత్తమంతర్ము

దృశ్యమగు చతుర్దశ (14) లోకముల యాకారమును ధరించినందుచే నా యోగివరుడు సమస్తలోకముల సాక్షాత్కరించుచున్నాడు. మఱియు తుమ్మెద అన్నిపుష్పముల దగ్గ ఱకుపోయి వాని రసమును, ఆయా పుష్పాకారమును తెలియువిధమున చిత్తము సకల భువనముల యాకారమును ధరించి సమస్తలోకములను సాక్షాత్కరించుచున్నది గాన దీని నే మధుమతీసిద్ధియని యోగశాస్త్రమున జెప్పుచున్నారు.

## 29 సూ॥ చన్ద్రే తారకావ్యూహజ్ఞానమ్ ॥

పద॥ చన్ద్రే - తారకావ్యూహజ్ఞానమ్.

అర్థము॥ చన్ద్రే = నక్షత్రపతియగు చంద్రునియందు (సంయమమువలన), తారకా వ్యూహజ్ఞానం - తారకా = నక్షత్రములయొక్క, వ్యూహ = విశిష్టస్థానముల యొక్క, జ్ఞానం = జ్ఞానము గలుగును.

తా॥ నక్షత్రములకు రాజగు చంద్రబింబమందు చిత్తముయొక్క సంయమమువలన యోగివరుడు నక్షత్రముల విశేషస్థానముల (యే నక్షత్ర మెటుల యున్నదో అని) సాక్షా

త్కరించుచున్నాడు. సూర్యకాంతిచే నక్షత్రములు ప్రకాశింపనందుచే సూర్యసంయమముచే నక్షత్రజ్ఞానము గలుగదు అని భావము.

## సూ॥ ధ్రువే తద్గతిజ్ఞానమ్ ॥ 30

పద॥ ధ్రువే - తద్గతిజ్ఞానం.

అర్థము॥ ధ్రువే = ధ్రువజ్యోతిస్సునందు (సంయమమువలన), తద్గతిజ్ఞానం - తద్గతి = ఆ నక్షత్రములయొక్క గమనముయొక్క, జ్ఞానం = సాక్షాత్కారము గలుగుచున్నది.

తా॥ ధ్రువజ్యోతిస్సునందు సంయమమును శీలించు యోగి యీ నక్షత్రము యీ గ్రహముతోగూడ నీ గమనముతో నింతకాలము పోవుచున్నదను నక్షత్రగమనజ్ఞానమును పొందును.

## సూ॥ నాభిచక్రే కాయవ్యూహజ్ఞానమ్ ॥ 31

పద॥ నాభిచక్రే - కాయవ్యూహజ్ఞానం.

అర్థము॥ నాభిచక్రే – శరీరమునకు మధ్యభాగమగు నాభియందలి మణిపూరకమను పేరుగల పది దళములుగల చక్రమునందు (సంయమనమువలన), కాయవ్యూహజ్ఞానం – కాయ = శరీరమునందలి, వ్యూహ = వాతపిత్తాది స్థితి విశేషముయొక్క, జ్ఞానం భవతి = జ్ఞానము గలుగుచున్నది.

అవ॥ బాహ్యములయిన ఆధిభౌతిక ఆధిదైవిక సిద్ధులను తెలిపి యిప్పుడు శరీరేన్ద్రియములకు సంబంధించిన ఆధ్యాత్మిక సిద్ధులను తెలియజేయుచున్నారు.

తా॥ శరీరమధ్యమున నాభియందు మణిపూరకమను దశదళచక్రమున్నది. దానియందు చిత్తసంయమనముచే (ధారణ ధ్యాన సమాధులచే) యోగీశ్వరుడు శరీరమునందలి వాతపిత్తశ్లేష్మాదుల స్థితిని తెలియుచున్నాడు. అటులనే రక్తమాంసాది సప్తధాతువుల సశేషవిషయమును తెలియును.

## సూ॥ కణ్ఠకూపే క్షుత్పిపాసానివృత్తిః ॥ 32

పద॥ కణ్ఠకూపే – క్షుత్పిపాసానివృత్తిః.

అర్థము॥ కంఠకూపే = కంఠముయొక్క కుహరమునందు సంయమమువలన, క్షుత్పిపాసా

నివృత్తిః - క్షుత్ = ఆకలియొక్క, పిపాసా = దప్పియొక్క, నివృత్తిః = నివారణము గలుగును.

అవ॥ ఆకలిదప్పు లుపశమించు సిద్ధిని తెలుపుచున్నారు.

తా॥ నాలుకయొక్క అధోభాగమున దారమువలె ప్రసరించిన నాడిగలదు. దానికి క్రింది భాగమున కంఠమునకు సమ్బన్ధించి కుహర (రంధ్ర) మొకటియున్నది. ఆ కంఠరన్ధ్రములో ప్రాణాది వాయుస్పర్శచే (సంఘర్షణచే) క్షుత్పిపాసలు గలుగుచున్నవి. అట్టి కంఠకుహరమున సంయమశక్తిచే యోగికి నాకలిదప్పులు లేకపోవుచున్నవి.

## సూ॥ కూర్మనాడ్యాం స్థైర్యమ్ ॥ 33

పద॥ కూర్మనాడ్యాం - స్థైర్యం.

అర్థము॥ కూర్మనాడ్యాం = కూర్మనాడియందు సంయమమువలన, స్థైర్యం = చిత్తస్థిరత్వము సిద్ధించును.

అవ॥ చిత్తస్థైర్యము గలుగు నుపాయము దెలుపుచున్నారు.

తా॥ కంఠరంధ్రముయొక్క క్రిందిభాగమున (గొంతుకు దిగువ) వక్షస్థలమందు తాబేలువలె ప్రసరించిన యొక నాడిగలదు. అదియే కూర్మనాడియగును. ఆ నాడియందు చిత్తముయొక్క సంయమనముచే చిత్తస్థైర్యము సిద్ధించును.

సూ॥ మూర్ధజ్యోతిషి సిద్ధదర్శనమ్ ॥ 34

పద॥ మూర్ధజ్యోతిషి – సిద్ధదర్శనం.

అర్థము॥ మూర్ధజ్యోతిషి = బ్రహ్మరంధ్రమున జ్యోతిరూపమై సర్వదా వెలుగు సుషుమ్నాగ్రస్థానమందు సంయమమువలన, సిద్ధదర్శనం = సిద్ధుల దర్శనము సిద్ధించుచున్నది.

అవ॥ సిద్ధాది మహాపురుషులగు వశరీరుల దర్శనసిద్ధిని తెలుపుచున్నారు.

తా॥ బ్రహ్మరంధ్రము సహస్రారము అను పేర్లతో నొప్పుచు సుషుమ్నా సంబంధముచే (సూక్ష్మమగు బుద్ధియొక్క నిర్విషయ బ్రహ్మభావనామహిమచే) సదా భాస్వరమైన అత్యధిక తేజోరూపమైన బ్రహ్మజ్యోతి దేదీప్యమానమగుచున్నది. అచ్చోట చిత్తసంయమముచే నా మూర్ధస్థానమునందుండి బయలుదేరినదై, శరీరమంతటను వ్యాపించిన

చిత్తమణిప్రభ అనగా చిత్తము బ్రహ్మతేజోరూపమును ధరించినదై యెవరికిని కనపడని సిద్ధాది దివ్యపురుషులను సాక్షాత్కరించు శక్తివంతమగుచున్నది. ఆ యోగి సిద్ధపురుషులను దర్శించుచున్నాడు.

సూ॥ ప్రాతిభాద్వా సర్వమ్ ॥ 35

పద॥ ప్రాతిభాత్ - వా - సర్వం.

అర్థము॥ ప్రాతిభాత్ వా = స్వయముగా సిద్ధించిన ఊహాశక్తి మాత్రముచే గలిగిన జ్ఞానమువలనగాని, సర్వం (జానాతి) = సమస్తము నెరుగుచున్నాడు (ఆత్మను సంయమనము చేయుటచే సర్వజ్ఞుడగుచున్నాడు).

అవ॥ సర్వజ్ఞతాసిద్ధిని తెలియపరచుచున్నారు.

తా॥ సంసారమునుండి తరింపజేయునదియు, ప్రసంఖ్యానమని చెప్పబడునదియు నగు వివేకఖ్యాతికొరకు (ఆత్మసాక్షాత్కార జ్ఞానముకొరకు) చిత్తమును ఆత్మయందుంచి ధారణా ధ్యాన సమాధులభ్యసించిన యోగికి, సూర్యోదయమునకు ముందు అరుణప్రభ ఉదయమగునటులను, దానిచే జనులు సమస్తపదార్థముల తెలియునటులను, వివేకఖ్యాతికి

ముందు స్వయంసిద్ధప్రతిభయు నుదయించుచున్నది. దానిచే సర్వమును దెలిసి యోగి సర్వజ్ఞుడగుచున్నాడు. తర్వాత తప్పక ఆత్మసాక్షాత్కారమున్ను యోగికి కలుగుచున్నది.

## సూ॥ హృదయే చిత్తసంవిత్ ॥ 36

పద॥ హృదయే - చిత్తసంవిత్.

అర్థము॥ హృదయే = హృదయమునందు సంయమమువలన, చిత్తసంవిత్ = మనస్సు యొక్క సాక్షాత్కారము గలుగును.

అవ॥ చిత్తస్వరూప సాక్షాత్కారసిద్ధిని తెలుపుచున్నారు.

తా॥ అధోముఖమైన చిత్తమునకు స్థానమైన అనేక విషయవాసనలకు అభిముఖమయిన హృదయకమలమునందు సంయమముచే ననేక రాగాదివృత్తులతోడ చిత్తము తెలియబడుచున్నది. వేరు పదార్థమువలె విస్పష్టముగా గోచరించును. చిత్తముయొక్క వాసనలు ప్రత్యక్షములగును.

సూ॥ సత్త్వపురుషయోరత్యన్తాసంకీర్ణయోః ప్రత్యయావిశేషో భోగః పరార్థాత్స్వార్థసంయమాత్పురుషజ్ఞానమ్॥ 37

పద॥ సత్త్వపురుషయోః - అత్యన్తాసంకీర్ణయోః - ప్రత్యయావిశేషః - భోగః - పరార్థాత్ - స్వార్థసంయమాత్ - పురుషజ్ఞానం.

అర్థము॥ అత్యంతాసంకీర్ణయోః = (బుద్ధి భోగ్యము భోక్త అత్మయగుచున్నది). ఇట్టి విరుద్ధధర్మము లుండుటచే, అత్యన్త = మిక్కిలి, అసంకీర్ణయోః = భిన్నములైన (వేరైన), సత్త్వపురుషయోః = బుద్ధి ఆత్మలయొక్క, ప్రత్యయావిశేషః - ప్రత్యయ = బుద్ధియొక్క పరిణామములైన సుఖదుఃఖ మోహావృత్తులచే, అవిశేషః = సమానరూపత్వము - ఆత్మయొక్క ప్రతిబిమ్బమగు జీవునిద్వారా సుఖదుఃఖాద్యారోపము, భోగః = భోగమునబడును (భోగ్యము బుద్ధి, భోక్త ఆత్మ ఈ రెంటియొక్క అభేదారోపమే భోగము. సుఖదుఃఖాద్యనుభవము దృశ్యమగును), పరార్థాత్ = భోక్తయగు జీవునికొరకైనందుచే పరార్థమైన, బుద్ధి

ధర్మమైన, జడమైన, దృశ్యమైన, భోగముకన్న (ఆ భోగమును వదలి), స్వార్థ సంయమాత్ — స్వార్థ = పరార్థ గకైన చిత్స్వరూప పురుషునియందు (పరమాత్మ యందు) సంయమాత్ = సంయమమువలన (చిత్తమునుంచి ధారణా ధ్యాన సమాధులు సలుపుటవలన), పురుషజ్ఞానం = ఆత్మసాక్షాత్కారము గలుగుచున్నది.

అవ॥ ఆత్మసాక్షాత్కారజ్ఞానము ఆత్మసంయమముచే గలుగునని స్పష్టపరచుచున్నారు.

తా॥ భోగ మే బిమ్బమైన పరిశుద్ధాత్మయందు ప్రతిబిమ్బమైన జీవద్వారా జడ బుద్ధి ధర్మములగు సుఖదుఃఖాదులను కల్పించుటయే (ఆరోపము) అజ్ఞానహేతువగుచున్నది. వస్తుతః విచారించిన భోగ్యమైనందుచే బుద్ధియు, భోక్తయయినందుచే పురుషుడును (ఆత్మయు) వేరుగానున్నారు. ఇటుల విరుద్ధధర్మములు బుద్ధి ఆత్మలకున్నవి. అయినను అవివేకముచే బుద్ధి పరిణామధర్మములైన సుఖదుఃఖ మోహావృత్తులచే శుద్ధాత్మ బుద్ధియందు ప్రతిబింబించినదని భావించి బుద్ధ్యాత్మలకు సమానరూపత్వమును గ్రహించుచున్నారు. అనగా శుద్ధాత్మయందు బుద్ధ్యాత్మలు కలిసియున్నవను జీవత్వబుద్ధిచే సుఖదుఃఖ మోహావృత్తు లారోపించుచున్నారు. ఆత్మయు సుఖదుఃఖాదులుగలదని తలంచు

చున్నారు. అందుచేతనే దృశ్యమేర్పడుచున్నది. ఈ దృశ్యము బుద్ధికల్పితము. జీవుని భోగముకొఱకైనది. అందుచే నిది పరార్థము. కాన పరార్థమై జడమైన, బుద్ధికల్పితమైన దృశ్యప్రపంచమగు పురుషునికి శేషమని చెప్పబడు (పురుషునికన్న వేఱైనది మిగిలినది జీవునికి భోగరూపమైనది శేషమని చెప్పబడును) భోగమును వదలి దృశ్యప్రపంచమందాశ గొనక స్వార్థమైన స్వస్వరూపమైన పరమాత్మయందు చిత్తముంచి సంయమనము జేసిన ధారణా ధ్యాన సమాధుల శీలించిన పరమాత్మసాక్షాత్కారజ్ఞానము సిద్ధించును. కావున నాత్మసంయమనము గావింపవలయు. ఆత్మసాక్షాత్కారము నాత్మపురుషుడే తెలియు చున్నాడు. జ్ఞాతయగు జీవుడుగాని, జ్ఞేయమగు బుద్ధిగాని తెలియజాలవు. ఎందుకనగా జాతృజ్ఞేయములు పరస్పర విరుద్ధధర్మములుగలవి. అనగా ఆత్మస్వరూపసాక్షాత్కార మాత్మకే గలుగుచున్నది. అచ్చోట జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయములను త్రిపుటి లేదు.

సూ॥ తతః ప్రాతిభశ్రావణవేదనాదర్శాస్వాదవార్తా జాయన్తే ॥ 38

పద॥ తతః – ప్రాతిభ శ్రావణ వేదనా దర్శా స్వాద వార్తాః – జాయన్తే.

అర్థము॥ తతః = స్వార్థమైన యాత్మపురుషునియందు సంయమమువలన, ప్రాతిభ ...

వార్తాః - ప్రాతిభ = దివ్యజ్ఞానమును గ్రహించు మనస్సు, శ్రావణ = దివ్యశబ్దమును గ్రహించు శ్రోత్రము (చెవి), వేదన = దివ్యస్పర్శమును గ్రహించు త్వక్కు, ఆదర్శ = దివ్యరూపమును గ్రహించు నేత్రము, ఆస్వాద = దివ్యరసమును గ్రహించు జిహ్వా, వార్తా = దివ్యగంధమును గ్రహించు నాసిక, ఈ ఆరు ఇంద్రియములు, జాయన్తే = (యోగికి) గలుగుచున్నవి.

అవ॥ స్వార్థమగు ఆత్మపురుషునియందు సాక్షాత్కారముచే ఆత్మజ్ఞానమునకు ముందు గలుగు సిద్ధుల తెలుపుచున్నారు.

తా॥ స్వార్థ పరమాత్మయందు సంయమముచే నిన్ద్రియములన్నియు దివ్యత్వము నొందుచున్నవి. ఈ దివ్యత్వము పరమాత్మపురుష జ్ఞానసిద్ధికి ముందు గలుగుచున్నవి. దివ్యత్వమనగా మనుష్యులకు సాధ్యముగానిది, దేవతలకు యోగులకు సాధ్యమగునది. యోగశక్తిచే (ఆత్మసంయమనముచే) దివ్యత్వము నొందిన (1) మానస, (2) శ్రోత్ర, (3) త్వక్, (4) నేత్ర, (5) జిహ్వా, (6) ఘ్రాణేన్ద్రియము లారున్న క్రమముగా, (1) ప్రాతిభ, (2) శ్రావణ, (3) వేదన, (4) ఆదర్శ, (5) ఆస్వాద, (6) వార్తలను

పేర్లతో యోగశాస్త్రమున ప్రసిద్ధములై యున్నవి. (1) ప్రాతిభమను మనస్సువలన సూక్ష్మవ్యవహిత విప్రకృష్ట అతీతానాగత జ్ఞానసిద్ధియు, (2) శ్రావణమను శ్రోత్రమువలన దివ్యశబ్ద శ్రవణసిద్ధియు, (3) వేదనమను త్వక్కుచే దివ్యస్పర్శసిద్ధియు, (4) ఆదర్శమను నేత్రముచే దివ్యరూపదర్శనసిద్ధియు, (5) ఆస్వాదమను జిహ్వచే దివ్యరసగ్రహణసిద్ధియు (6) వార్తయను నాసికముచే దివ్యగంధసిద్ధియు గలుగుచున్నవి. ఈయారును సిద్ధులనబడును.

## సూ॥ తే సమాధావుపసర్గా వ్యుత్థానే సిద్ధయః ॥ 39

పద॥ తే - సమాధౌ - ఉపసర్గాః - వ్యుత్థానే - సిద్ధయః.

అర్థము॥ తే = ఆ ప్రాతిభాది సాక్షాత్కారము లాయను సాక్షాత్కార సమాధియందు, ఉపసర్గాః = విఘ్నములుగను, వ్యుత్థానే = ఆత్మజ్ఞానమును కోరక చిత్తము బహిర్ముఖమగునప్పుడు సిద్ధులుగను అగుచున్నవి.

అవ॥ ఈయారు సిద్ధులచేత యోగి కృతకృత్యుడు, వానికి చేయదగినది లేదని తలంపకూడదని చెప్పుచున్నారు.

తా॥ ఆ మానసాది (యోగసిద్ధి)యులు దివ్యత్వమును వహించుటచే గలుగు ప్రాతిభాది దివ్యసిద్ధులారయను ఆత్మసాక్షాత్కారజ్ఞానరూప సమాధిని (మోక్షమును) గోరు యోగిపుంగవునకు విఘ్నజనకము లగుచున్నవి. కావున సిద్ధులన్నిటి నుపేక్షింపవలయును. అటుగాక నాసిద్ధుల నపేక్షించినచో, యోగి కాత్మసాక్షాత్కారము తప్ప మఱియొకటి ధన్యత్వమును, కృతకృత్యత్వమును గలిగించునది లేదు గాన నట్టి కృతకృత్యతను యోగి పొందక మోక్షమునుండియు, నాత్మజ్ఞానమునుండియు భ్రష్టుడగుచున్నాడు. ఈ సిద్ధు లాత్మజ్ఞానమం దుపకరించవు. ఏ సిద్ధియుగూడ చిత్తమునకు సమ్బన్ధించినదే గాన, దృశ్యాతీతమగు నిష్కల్మష నిర్వికార నిష్పరిణామ పరమాత్మజ్ఞానమునకు సిద్ధు లుపకరింపజాలవు. చిత్తమును దృశ్యములోనికి ప్రవేశపెట్టి సిద్ధిప్రదర్శనమే పరమోద్దేశ్యమని తలంచు యోగికి ఆ ప్రాతిభాది సాక్షాత్కారములు సిద్ధులగుచున్నవి. ఈ విషయమున మహర్షుల సూక్తులను గాంచుడు.

శ్లో॥ ద్రవ్యమన్త్రక్రియాకాలశక్తయః సాధు సిద్ధిదాః ।
పరమాత్మపదప్రాప్తౌ నోపకుర్వన్తి కాశ్చన ॥

తా॥ యోగికి సంయమనశక్తిచే (1) ద్రవ్య, (2) మన్త్ర, (3) క్రియా, (4) కాలములకు సమ్బన్ధించిన శక్తులు తొందరగనే సిద్ధిని గలుగజేయుచున్నవి. ఆ శక్తులన్నియు పరమాత్మప్రాప్తియం దుపయోగపడవు. ఇందులకు కారణమును యీ క్రింది శ్లోకమున నిరూపించుచున్నారు.

శ్లో॥ సర్వేచ్ఛాలాభసంశాన్తావాత్మలాభోదయో హి యః ।
స కథం సిద్ధివాంఛాయాం మగ్నచిత్తే న లభ్యతే ॥

తా॥ ఆత్మసాక్షాత్కారప్రాప్తి, సర్వసంకల్పములు, సర్వాశ లుడిగిన మాత్రమే గలుగుచున్నది గాన నాత్మజ్ఞానము సర్వఇచ్ఛారాహిత్యరూపము. సిద్ధులో సకల వాంఛా రూపములు కాన సిద్ధిగోరువానిచే నాత్మజ్ఞానము లభింపదు.

సూ॥ బన్ధకారణశైథిల్యాత్ప్రచారసంవేదనాచ్చ చిత్తస్య పరశరీరావేశః ॥ 40

పద॥ బన్ధకారణశైథిల్యాత్ - ప్రచారసంవేదనాత్ - చ - చిత్తస్య - పరశరీరావేశః,

అర్థము॥ బన్ధకారణశైథిల్యాత్ - బన్ధ = సర్వత్ర వ్యాపించు శక్తిగల చిత్తమొకశరీర మందే సంకోచావస్థతో నుండుటయను బన్ధమునకు, కారణ = హేతువులైన ధర్మాధర్మరూప పుణ్యపాప కర్మలయొక్క, శైథిల్యాత్ = శిథిలత్వమువలన (సంయమముచే నాశమగుటవలన), ప్రచారసంవేదనాత్ చ - ప్రచార = చిత్తమును సంచరింపజేయు నాడీ సంఘముయొక్క, సంవేదనాచ్చ = (సంయమముచే) సాక్షాత్కారమువలనను, చిత్తస్య = చిత్తమునకు, పరశరీరావేశః = ఇతర శరీరమందలి ప్రవేశము గలుగును.

అవ॥ ఈ ప్రకారము సంయమమునకు ఆత్మసాక్షాత్కారసిద్ధి పర్యన్తము విభూతులను చెప్పి యిప్పుడు సంయమమునకు క్రియారూపసిద్ధులను తెలుపుచున్నారు.

తా॥ పరకాయ ప్రవేశసిద్ధి గలుగువిధమును తెలుపుచున్నారు. సర్వత్ర వ్యాపించు శక్తిగల చిత్తమొకశరీరమందుండుటచే సంకుచితమై యొకచోట బంధింపబడుచున్నది. ఆ చిత్తబంధమునకు కారణములు ధర్మాధర్మరూప పుణ్యపాప కర్మలేయగును. ఆ కర్మల యందు సంయమముచే చిత్తబంధకారణ కర్మలు శిథిలములగుచున్నవి. చిత్తమును సంచ

రింపజేయు నాడీ సంఘమున్నది. ఈ నాడీ సమూహబలముచేతనే చిత్తము ప్రచారము జేయుచున్నది (ప్రవర్తించుచున్నదని భావము). ఆ నాడీ సంఘముయొక్క సాక్షాత్కారము సంయమనముచే గలుగుచున్నది. కావున చిత్తబంధకారణ కర్మలు శిథిలములగుట వలనను, చిత్తప్రచార కారణ నాడీసంఘ సాక్షాత్కారమువలనను, చిత్తము పరకాయములో ప్రవేశించు సామర్థ్యము గలదగుచున్నది. అట్టి చిత్తము మరణించి యుండువాని యొక్కయు, జీవించి యుండువానియొక్కయు శరీరములో ప్రవేశించుచున్నది. చిత్తముతోపాటు ఇంద్రియములన్నియు పోతీగతో తుమ్మెదలువలె ప్రవేశించుచున్నవి. ఇదియే పరకాయప్రవేశ విద్యయగును.

## సూ॥ ఉదానజయాజ్జలపంకకంటకాదిష్వసంగ ఉత్క్రాంతిశ్చ ॥ 41

పద॥ ఉదానజయాత్ - జలపంకకంటకాదిషు - అసంగః - ఉత్క్రాంతిః - చ.

అర్థము॥ ఉదానజయాత్ - ఉదాన = నాసికాగ్రమునుండి శిరస్సువరకు వ్యాపించి యున్న వాయువుయొక్క, జయాత్ = (సంయమముచే) జయించుటవలన, జల పంకకంటకాదిషు = జలము బురద ముండ్లు మొదలైనవానియందు, అసంగః =

తగులకుండుటయు, ఉత్క్రాంతిశ్చ = ఊర్ధ్వగమనమున్ను సిద్ధించును.

అవ॥ యోగికి సముద్రగమనాది సిద్ధులను తెలుపుచున్నారు.

తా॥ దూదియందు మహాగ్నిజ్వాలవలె సమస్తేంద్రియములయందును నొకేసారి పుట్టిన వృత్తి జీవమని వచింపబడును. ఆ జీవవృత్తియే ప్రాణాపానాది పంచవాయువులుగా నగుచున్నది. అందులో నుదానవాయువనగా నాసికాగ్రమునుండి శిరఃపర్యన్త ముండు నది. ఆ ఉదానవాయువును సంయమముచే జయించిన జలము, పంకము, కంటకము మొదలగువానియందు తగులకనే యోగి శరీరలాఘవము గలవాడై పైన సంచరించు చున్నాడు; స్వేచ్ఛామరణమున్ను పొందుచున్నాడు.

## సూ॥ సమానజయాజ్జ్వలనమ్ ॥ 42

పద॥ సమానజయాత్ – జ్వలనమ్.

అర్థము॥ సమానజయాత్ = హృదయము మొదలు బొడ్డువరకు వ్యాప్తమైన సమాన వాయువుయొక్క జయమువలన, జ్వలనం = నాభివద్దనున్న నగ్నియొక్క దీప్తి గలుగును.

తా॥ హృదయము మొదలు నాభివరకు వ్యాపించియుండునది సమానవాయువనం బడును. ఆ సమానవాయువును వశీకరించుటచే నాభిలోనున్న నగ్నిజ్యోతి యుద్దీప్తమగు చున్నది. ఇట్టిజ్యోతిచే యోగి జ్వలించునట్టి తేజోవంతుడగును.

సూ॥ శ్రోత్రాకాశయోస్సంబంధసంయమాద్దివ్యం శ్రోత్రమ్॥ 43

పద॥ శ్రోత్రాకాశయోః - సంబంధసంయమాత్ - దివ్యం - శ్రోత్రమ్.

అర్థము॥ శ్రోత్రాకాశయోః = శ్రోత్రేంద్రియాకాశములయొక్క, సంబంధసంయమాత్ = ఆధారాధేయభావ సంబంధమునందలి సంబంధమువలన, దివ్యంశ్రోత్రం = దివ్యమగు శ్రోత్రేంద్రియము గలుగును. అనగా చెవి దివ్యశబ్దముల గ్రహించు శక్తిగలదగును.

తా॥ శ్రోత్రేంద్రియమునకు ఆకాశ మాధారము. అనగా నాకాశమువలన చెవి యేర్పడెను. చెవి ఆధేయముగానున్నది; ఆకాశము నాధారముగా జేసికొనియున్నది. ఈ శ్రోత్రేంద్రియమునకును, ఆకాశమునకును యున్న ఆధారాధేయభావరూపమైన సంబంధమందు సంయమమువలన దివ్యశబ్దముల నన్నిటిని నొకేతూరి గ్రహించునదిగా చెవి యగుచున్నది.

సూ॥ కాయాకాశయోః స్సంబంధసంయమాల్లఘుతూలసమాపత్తేశ్చ ఆకాశగమనమ్ ॥ 44

పద॥ కాయాకాశయోః - సంబంధసంయమాత్ - లఘుతూలసమాపత్తేః - చ - ఆకాశగమనమ్.

అర్థము॥ కాయాకాశయోః = శరీరాకాశములయొక్క, సంబంధసంయమాత్ = సంబంధమందు సంయమమువలన, లఘుతూలసమాపత్తేశ్చ - లఘుతూల = తేలికయైన దూదియందున్న, సమాపత్తేశ్చ = సమాధివలనను, ఆకాశగమనం = ఆకాశగమనము గలుగును.

తా॥ శరీరమందు చొట్టు ఆకాశమున్నదను ఆకాశ శరీరములయొక్క సంబంధమును సంయమమును జేయుటవలన, తరువాత చులకనైన దూది మొదలైనవానియందు భావించి చిత్తము తదాకారముగుటను సమాధి నభ్యసించుటచేతను లఘుశరీరుండై ఆకాశమున విహరించును. తరువాత సాలెపురుగు నిర్మించిన దారములపైనను, తదనంతరము సూర్యకిరణములయందును సంచరించుచున్నాడు. పిమ్మట స్వేచ్ఛగా నాకాశగమనమును జేయుచున్నాడు.

**సూ॥ బహిరకల్పితా వృత్తిర్మహావిదేహా తతః ప్రకాశావరణక్షయః॥**

పద॥ బహిః - అకల్పితా - వృత్తిః - మహావిదేహా - తతః - ప్రకాశావరణక్షయః.

అర్థము॥ అకల్పితా = కల్పింపబడని అహంకారశూన్యమైన, బహిర్వృత్తిః = వెలుపల ప్రసరించు మనోవృత్తి, మహావిదేహా = మహావిదేహామను పేరు గలదగును, తతః = ఆ మహావిదేహాఖ్య మనోవృత్తి సంయమమువలన, ప్రకాశావరణక్షయః = ప్రకాశమైన చిత్తముయొక్క ఆవరణములగు క్లేశాదిమలములయొక్క నాశము గలుగుచున్నది.

తా॥ దేహామం దహంభావపూర్వకముగా మనోవృత్తి దృశ్యమందు ప్రవర్తించిన అది కల్పితమగు విదేహాఖ్యవృత్తి, దేహాభావములేక స్వాయముగానే ప్రవర్తించిన చిత్తముయొక్క బాహ్యవృత్తి మహావిదేహామగును. దానియందు సంయమముచే చిత్తమందలి క్లేశాది మలావరణములు పూర్తిగా నశించుచున్నవి. అప్పుడు చిత్తము స్వాయం ప్రకాశమగును. ఇదియే పరకాయప్రవేశప్రయోజకము.

**సూ॥ స్థూలస్వరూపసూక్ష్మాన్వయార్థవత్త్వసంయమాద్భూతజయః॥**

పద॥ స్థూల స్వరూప సూక్ష్మ అన్వయ అర్థవత్త్వ సంయమాత్ - భూతజయః.

అర్థము॥ స్థూలస్వరూపసూక్ష్మాన్వయార్థవత్త్వ సంయమాత్ - స్థూల = శబ్ద స్పర్శ రూప రస గంధములను నారు గుణములతో నభివ్యక్తమై కనబడునది స్థూలము, స్వరూప = కాఠిన్య, స్నేహ, ఉష్ణత్వ, ప్రేరణ, సర్వగతత్వ లక్షణములు స్వరూపము, సూక్ష్మ = అవిభక్తములయిన శబ్ద స్పర్శాది పంచతన్మాత్రలు సూక్ష్మము, అన్వయ = కార్యభూత పంచభూతములందు కారణరూపముగా నన్వయించిన గుణత్రయ మన్వయము, అర్థవత్త్వ = త్రిగుణములలో నున్న భోగ మోక్ష జ్ఞాన సామర్థ్య మర్థవత్త్వము, వీనియందు (పంచభూతముల ధర్మములయిన స్థూల, స్వరూప, సూక్ష్మ, అన్వయ, అర్థవత్త్వములను నయిదింటి యందును), సంయమాత్ = సంయమమువలన, భూతజయః = పంచభూత వశీకరణము సిద్ధించును.

అవ॥ పంచభూతములును యోగికి లోబడి వశములో నుండుటను పంచభూతవశీకరణ సిద్ధిని తెలుపుచున్నారు.

తా॥ (1) స్థూలము, (2) స్వరూపము, (3) సూక్ష్మము, (4) అన్వయము, (5) అర్థవత్త్వమనునవి పంచభూతముల పంచరూపములగును. 1. స్థూలమనగా – (1) పృథివి = శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను నయిదు గుణములతో గూడుకొని, (2) జలము = శబ్ద, స్పర్శ, రూప, రసములను నాలుగు గుణములతో గూడుకొని, (3) అగ్ని = శబ్ద, స్పర్శ, రూపములను మూడు గుణములతో గూడుకొని (4) వాయువు = శబ్ద, స్పర్శలను రెండు గుణములతో గూడుకొని, (5) ఆకాశము = శబ్దమను నొకే గుణముతో గూడుకొని ఈలాగున హెచ్చుతగ్గులగు గుణములు గలవై పంచభూతములు నింద్రియములకు గోచరములై యుండుటయే స్థూలధర్మము. 2. సూక్ష్మమనగా – (1) భూమియందు కాఠిన్యము, (2) జలమందు స్నేహము ద్రవత్వము, (3) అగ్నియం దుష్ణత్వము, (4) వాయువునందు ప్రేరణ, (5) ఆకాశమందు వ్యాపకత్వమను పంచభూతలక్షణములు స్వరూపధర్మము. 3. సూక్ష్మమనగా – అహంకారాత్ పంచతన్మాత్రాణి. అహంకారతత్త్వమునుండి పుట్టిన విభజింపబడని (1) శబ్ద, (2) స్పర్శ, (3) రూప, (4) రస, (5) గంధములు స్వరూపధర్మము. 4. అన్వయమనగా –

కార్యములయిన పంచభూతములయందును కారణరూపముగా ననుగతములై యుండు సత్త్వరజస్తమోగుణము లన్వయధర్మము. 5. అర్థవత్త్వమనగా - త్రిగుణములయం దుండు భోగమోక్షముల నొసగు సామర్థ్యము అర్థవత్త్వ ధర్మమగును. కావున పంచ భూతముల రూపములయిన 1. స్థూల, 2. స్వరూప, 3. సూక్ష్మ, 4. అన్వయ, 5. అర్థ వత్త్వములయందు క్రమముగా సంయమమువలన క్రమముగా పంచభూతములును వశ్య ములై, ఆవులు దూడ ననుసరించు విధమున, యోగి ననుసరించి తదాజ్ఞానువర్తములై యుండును.

సూ॥ తతోఽణిమాదిప్రాదుర్భావః కాయసమ్పత్తద్ధర్మానభిఘాతశ్చ॥

పద॥ తతః - అణిమాదిప్రాదుర్భావః - కాయసమ్పత్ - తద్ధర్మానభిఘాతః - చ.

అర్థము॥ తతః = ఆ భూతజయమువలన, అణిమాది ప్రాదుర్భావః = అణిమాది అష్ట మహాసిద్ధుల సిద్ధియు, కాయసమ్పత్ = రూపలావణ్యాది ప్రాప్తియు, తద్ధర్మానభి ఘాతశ్చ - తద్ధర్మ = పంచభూత ధర్మములయిన కాఠిన్య స్నేహాదులచే, అనభి ఘాతః = కొట్టబడకుండుటయు గలుగుచున్నవి.

అవ॥ పంచభూతముల వశీకరణప్రయోజనమును స్పష్టపరచుచున్నారు.

తా॥ 1. అణిమా = పరమాణువుతో సమానమై యుండుటయగును. 2. మహిమా = విభువై యుండుట, అన్నిటియందును వ్యాపించియుండుట. 3. లఘిమా = దూదివలె చులకనై యుండుట. 4. గరిమా = మేరుపర్వతమువలె బరువై యుండుట. 5. ప్రాప్తి = చేతివ్రేలితో చంద్రుని తాకుట. 6. సత్యసంకల్పుడై యుండుట ప్రాకామ్యమగును. 7. వశిత్వం = సర్వభూతముల నియమించుట. 8. ఈశిత్వం = సకల భూతముల సృజించుట. ఇవి అష్టైశ్వర్యములు. ఇవియే సిద్ధులు. పంచభూతములయొక్క (1) స్థూలధర్మ సంయమమువలన 1. అణిమా, 2 మహిమా, 3. లఘిమా, 4. గరిమా, 5. ప్రాప్తి ఈ అయిదు సిద్ధులున్ను, (2) స్వరూపధర్మ సంయమమువలన ప్రాకామ్యసిద్ధియు, (3) సూక్ష్మ ధర్మసంయమమువలన వశిత్వసిద్ధియు, (4) అన్వయ, (5) అర్థవత్త్వ ధర్మద్వయసంయమము వలన ఈశిత్వసిద్ధియు గలుగును. మరియు రూపలావణ్యాది శరీరసమ్పత్తున్ను, పంచ భూతధర్మములగు కాఠిన్య స్నేహాదులచే బాధింపబడకుండుటయున్ను భూతముల జయముచే యోగి పొందును.

సూ॥ రూపలావణ్యబలవజ్రసంహననత్వాని కాయసమ్పత్ ॥ 48

పద॥ రూప లావణ్య బల వజ్ర సంహననత్వాని - కాయసమ్పత్.

అర్థము॥ రూప ... ... సంహననత్వాని - రూప = నేత్రప్రియము, లావణ్య = సర్వాంగ సౌన్దర్యము, బల = వీర్యము, వజ్రసంహననత్వాని = వజ్రమువలె దృఢములయిన అవయవముల సన్నివేశము గలిగియుండుట, కాయసమ్పత్ = కాయసమ్పదయగును.

తా॥ కాయసమ్పత్తనగా, 1. నయనప్రియమైన రూపము, 2. సర్వాంగ సౌన్దర్యము, 3. వీర్యము, 4. వజ్రసమాన దృఢావయవములు గలిగియుండుటయగును. ఇదంతయు నాంజనేయునియందున్నది.

సూ॥ గ్రహణస్వరూపాస్మితాఽన్వయార్థవత్త్వసంయమాదిన్ద్రియ-జయః ॥ 49

పద॥ గ్రహణ స్వరూప అస్మితా అన్వయ అర్థవత్త్వ సంయమాత్ - ఇన్ద్రియజయః.

అర్థము॥ గ్రహణ ... ... సంయమాత్ - గ్రహణ = శబ్దస్పర్శాదులను గ్రహించు వృత్తులు, స్వరూప = ఆ శబ్దస్పర్శాదులను ప్రకాశింపజేయుట, అస్మితా = సాత్త్వికాహంకారము, అన్వయ = కారణరూపేణ అనుసరించియున్న త్రిగుణములు, అర్థవత్త్వ = భోగ మోక్ష జననసామర్థ్యము వీనియందు (జ్ఞానేన్ద్రియములగు శ్రోత్ర త్వగాదులయొక్క రూపము లయిదింటియందును), సంయమాత్ = సంయమమువలన, ఇన్ద్రియజయః = ఇంద్రియముల వశీకరణము గలుగును.

అవ॥ భూతజయమును సాధనోపాయఫలితములతోడ వివరించి ఇన్ద్రియజయమునకును ఉపాయఫలముల నుడువుచున్నారు.

తా॥ శబ్దస్పర్శాదులను గోచరించు వృత్తులు 1. గ్రహణము, ఆ శబ్దాది ప్రకాశకత్వము 2. స్వరూపము (శబ్దస్పర్శాదులను ప్రకాశింపజేయుట, తెలియజేయుట), అహంకారములేక నేదియూ జరుగదు గనుక కారణమయిన 3. సాత్త్వికాహంకారము, 4. సత్త్వ రజ స్తమో గుణములు అన్వయమగును, ఆ త్రిగుణములయందున్న భోగ మోక్ష

ఫలదాతృత్వ సామర్థ్యము 5. అర్థవత్త్వము. ఈ యయిదు ధర్మములున్ను త్వక్చక్షు శ్రోత్ర జిహ్వా ఘ్రాణములను జ్ఞానేన్ద్రియముల రూపములు కావున 1. గ్రహణ, 2. స్వరూప, 3. అస్మితా, 4. అన్వయ, 5. అర్థవత్త్వమను నింద్రియధర్మము లయి దింటియందును సంయమమువలన నింద్రియజయము సిద్ధమగును. ఆ యోగికి నింద్రియము లన్నియు వశములై యుంటున్నవి.

## సూ॥ తతో మనోజవిత్వం వికరణభావః ప్రధానజయశ్చ ॥ 50

పద॥ తతః – మనోజవిత్వం – వికరణభావః – ప్రధానజయః – చ.

అర్థము॥ తతః = ఆ యిన్ద్రియజయమువలన, మనోజవిత్వం = మనస్సువలె శరీరమున్ను అతి వేగము గలిగియుండుట, వికరణభావః = శరీరము నపేక్షింపకనే యింద్రియములు ఆయా దేశకాల విషయముల గనుగొను వృత్తిలాభము, ప్రధాన జయశ్చ = ప్రకృతి వికారముల జయించుటయు గలుగును.

అవ॥ ఇంద్రియజయముచే గలుగు సిద్ధులను తెలుపుచున్నారు.

తా॥ ఇంద్రియజయముచే మనస్సెంత వేగము గలదగుచున్నదో శరీరముగూడ నట్టి వేగముగలదై అతిశీఘ్రగామియై నడుచున్నది. ఇది మనోజవిత్వ సిద్ధియగును. మఱియు ఇంద్రియములు శరీరము నపేక్షింపకనే ఆయా దేశకాల విశేషముల గోరినచో దెలియుచున్నవి. అనగా కాశిలో నున్నని రామేశ్వరములోని ప్రదేశ కాల విశేషములను చూచుచున్నాడు. వర్తమానకాలములో నుండియు భూతభవిష్యత్తుల తెలియుచున్నాడు. ఇదియే వికరణభావసిద్ధి. (వికరణభావమనగా = విశేష ఇంద్రియముల భావము, ఇంద్రియములు విశేషజ్ఞానము గలిగియుండుట). ప్రకృతియొక్క వికారములను జయించుట ప్రధాన జయసిద్ధియగును. ఈ మూడు సిద్ధులు గలుగుచున్నవి. ఇకను 1. అణిమాద్యష్ట సిద్ధులు, 2. కాయసమ్పత్సిద్ధియు, 3. కాఠిన్యాది, 4. ధర్మానభిఘాత సిద్ధియు, 5. మనోజవిత్వము, 6. వికరణభావము, 7. ప్రధానజయము అను సిద్ధులు, అనగా భూతజయముచేతను, ఇంద్రియముచేతను గలుగు సిద్ధులన్నియు నీ యోగశాస్త్రమున మధుప్రతీక సిద్ధులని చెప్పబడుచున్నవి. తేనెయొక్క యే వైపుగూడ ఆస్వాదయోగ్యమై ఆనందకరమగునటుల యీ సిద్ధులలో నేయొకటి పొందినను మనోహరమై మధుతుల్య

యుగ నున్నందుచే మధుప్రతీకములని యీ సిద్ధులకు పేరు పొందికమైయున్నది.

సూ॥ సత్త్వపురుషాన్యతాఖ్యాతిమాత్రస్య సర్వభావాధిష్ఠాతృత్వం సర్వజ్ఞాతృత్వం చ ॥ 51

పద॥ సత్త్వపురుషాన్యతాఖ్యాతిమాత్రస్య - సర్వభావాధిష్ఠాతృత్వం - సర్వజ్ఞాతృత్వం - చ.

అర్థము॥ సత్త్వపురుషాన్యతాఖ్యాతిమాత్రస్య - సత్త్వపురుష = బుద్ధ్యాత్మలయొక్క, అన్యతా ఖ్యాతి మాత్రస్య = (జడమైన బుద్ధికన్న ఆత్మ చైతన్యవంతమై విలక్షణముగా నున్నదను) వివేకజ్ఞానమేగల అనగా వివేకజ్ఞానమందే యుంటున్న యోగికి, సర్వభావాధిష్ఠాతృత్వం - సర్వభావ = భూతేన్ద్రియముల రూపములై గుణ పరిణామ రూపములైన సకల పదార్థములయొక్క, అధిష్ఠాతృత్వం = ప్రభువువలె ఆక్రమణము (సకల పదార్థములకు అధిష్ఠానముగా నుండుటయు, సర్వజ్ఞాతృత్వం = భూత భవిష్యద్వర్తమాన కాలీన సర్వవిషయములయొక్క యథార్థజ్ఞానమున్ను గలుగును.

అవ॥ ఈ ప్రకారము సంయమమువలన జ్ఞానక్రియాసిద్ధులు వాని ప్రయోజనమగు వివేకఖ్యాతియు శ్రద్ధామూలమ్మున గలుగుననియు దెలిపి యిప్పుడు వివేకఖ్యాతికి అవాన్తర సిద్ధులను తెలుపుచున్నారు.

తా॥ ముందు జెప్పబడిన స్వార్థమను నాత్మయందు సంయమమువలన చిత్తము రజస్తమోగుణముల మాలిన్యరహితమై స్వచ్ఛమై తనకు వశమగుచున్నది. అప్పుడు పరవైరాగ్యమునందున్న యోగివరునకు వశీకారసంజ్ఞగల సత్త్వపురుష వివేకజ్ఞాన ముదయమగుచున్నది. అనగా పరవైరాగ్యముచే బుద్ధికన్న పరమాత్మపురుషుడు విలక్షణముగా నున్నాడను వివేచనచే నాత్మజ్ఞానము గలుగుచున్నది. అట్టి ఆత్మసాక్షాత్కారము సిద్ధించిన యోగికి త్రిగుణపరిణామములయిన భూతేన్ద్రియముల రూపములయిన సకల పదార్థములను ప్రభువువలె నాక్రమించు సిద్ధి గలుగుచున్నది. ప్రభువు ననుసరించి సేవకు లుండువిధమున సమస్త పదార్థము లాయోగి ననుసరించియుండును. సమస్తము వానికి వశమైయుండును. మఱియు సకల పదార్థములకు నధిష్ఠానముగా నుండుటయు గలుగును. ఇకను భూతభవిష్యద్వర్తమాన కాలీన సకలపదార్థముల వేరు వేరుగా తెలియు వివేక

జ్ఞానముప్న ఆ యోగికి గలుగును. ఆ యోగి సర్వజ్ఞత్వ సిద్ధిని పొందుచున్నాడు. సర్వ వస్తువులను సర్వకాలములయందును యథార్థముగా తెలియుటయు, సర్వభూతేన్ద్రియాది పదార్థములకు స్వామియై, సాక్షియై, అధిష్ఠానమై యుండుటయు నను సిద్ధులు సంపూర్తిగా శోకనాశకములు గాన యోగశాస్త్రమున నీ రెంటిని విశోకసిద్ధి అనిరి.

## 52

సూ॥ తద్వైరాగ్యాదపి దోషబీజక్షయే కైవల్యమ్ ॥

పద॥ తద్వైరాగ్యాత్ - అపి - దోషబీజక్షయే - కైవల్యం.

అర్థము॥ తత్ వైరాగ్యాత్ - తత్ = విశోకసిద్ధికి కారణమైన వివేకఖ్యాతియందు, వైరాగ్యాత్ = ఇచ్ఛ లేకపోవుటయను వైరాగ్యమువలన, దోషబీజక్షయే - దోషబీజ = అవిద్యాది సర్వక్లేశములకు కారణములయిన సర్వసంస్కారముల యొక్క, క్షయే సతి = సంపూర్ణనాశము గలుగగా, కైవల్యం అపి = స్వస్వరూపస్థితియను ముక్తి సిద్ధించును.

అవ॥ వివేకఖ్యాతికి ముఖ్యప్రయోజన సిద్ధిని తెలుపుచున్నారు.

తా॥ పై జెప్పిన రీతిగా నాత్మసంయమమువలన సర్వభావాధిష్ఠాతృత్వ సర్వజ్ఞాతృత్వరూప సర్వశోకరాహిత్య విశోకసిద్ధి గలుగగా సిద్ధులు ప్రతిబంధకములగుటచే సిద్ధిహేతుభూత వివేకఖ్యాతియందును యోగి ఇచ్ఛారహితుడగుచున్నాడు. అట్టి పరవైరాగ్యముచే సకల చిత్తవృత్తులు నశించిపోగా పరవైరాగ్య మాశ్రయించి పురుషశ్రేష్ఠుడైన మహానుభావునకు సకల అవిద్యాబీజములు సంపూర్ణముగా సంకల్పరూప మనస్సుతో పాటు నశించుచున్నవి. ఈ ప్రకారము సకల అజ్ఞానసంస్కారములు సర్వప్రతిబంధములు నాశమొందగా, అసంప్రజ్ఞాతసమాధియగు సంస్కారశేషతాపదవాచ్యమైన నిర్బీజ సంపూర్ణసమాధి దృఢముగా లభించుచున్నది. అప్పుడు పరిశుద్ధమైన చితిశక్తికి (ఆత్మశక్తికి) స్వరూప ప్రతిష్ఠారూప కైవల్యము సిద్ధించుచున్నది. అనగా ఆత్మస్వరూప స్థితిలో నుంటున్న మోక్షమిదియే. ఇది సంస్కారశేషమను సిద్ధియగును. పరవైరాగ్య ప్రాప్యము.

సూ॥ స్థాన్యుపమన్త్రణే సంగస్మయాకరణం పునరనిష్టప్రసంగాత్ ॥

పద॥ స్థాన్యుపమన్త్రణే – సంగస్మయాకరణం – పునః – అనిష్టప్రసంగాత్,

అర్థము॥ స్థాన్యుపనిమన్త్రణే - స్థాని = దేవేన్ద్రాదులయొక్క, ఉపనిమన్త్రణే = సత్కారవిశిష్ట ఆహ్వానపూర్వక ప్రార్థనయందు, సంగస్మయాకరణం - సంగ = ఆసక్తియు, స్మయ = యోగప్రభావగర్వము ఈ రెంటియొక్క, అకరణం = చేయకుండుట (చేయవలయును), (అన్యథా యని = మాఱియొక విధమాయెనేని) పునః = తిరుగా పూర్వమువలె, అనిష్టప్రసంగాత్ - అనిష్ట = యోగభ్రష్టుడగుటచే సంసారప్రాప్తియొక్క, ప్రసంగాత్ = ప్రసక్తివలన దుఃఖమే గలుగును.

అవ॥ ఆత్మజ్ఞానోదయమునకు ముందు గలుగు విఘ్నముయొక్క నివారణోపాయమును తెలుపుచున్నారు.

తా॥ యోగులు 1. ప్రథమకల్పికుడు, 2. మధుభూమికుడు, 3. ప్రజ్ఞాజ్యోతి, 4. అతిక్రాన్తభావనీయుడు అను నాలుగు విధములుగా నున్నారు. వారిలో 1. సంయమమందు (ధారణాధ్యాన సమాధులందు) ప్రవృత్తి మాత్రము గలిగి కొంచముగూడ జ్ఞానము లేనివాడు ప్రథమకల్పికుడు. 2. సంయమముచే భూతేన్ద్రియముల సాక్షాత్కరించి ఆ భూతేన్ద్రియముల జయింప నిచ్ఛగలవాడు మధుభూమికుడు. 3. భూతేన్ద్రియములను

జయించినవాడై పరమాత్మజ్ఞానమును గోరువాడు ప్రజ్ఞాజ్యోతియగును. 4. ఆత్మజ్ఞానముచే పరిపూర్ణుడై పరవైరాగ్య ధురంధరుడు అతిక్రాంతభావనీయుడు. ఈ పరిపూర్ణజ్ఞానియగు నతిక్రాంతభావనీయుడు మహానుభావుడు, సకల సందేహములు సర్వవిఘ్నములు నశించిన జీవన్ముక్తుడు. మూడవవాడగు ప్రజ్ఞాజ్యోతియను యోగివరుడు భూతేన్ద్రియములు జయించినవాడగుటచే మహేంద్రాదులున్ను వానిని కదలింపజాలరు. ఇక మిగిలినవారు ప్రథమకల్పికుడు, మధుభూమికుడు. ప్రథమకల్పికుడను యోగి అభ్యాసమునందున్నవాడగుటచే దేవతల ఆహ్వానమునకు యోగ్యుడగుచున్నాడు. అంతమాత్రమే. ఆ యోగిని మాత్రము దేవత లాదరలో నాహ్వానించరు. కనుక పరిశేషన్యాయమున సిద్ధమయినవాడు రెండవవాడగు మధుభూమికుడను యోగివరుడే. ఈ యోగివరుని దేవేన్ద్రాది దేవతలు గూడ మహాభయభక్తులతో "ఓ యోగివరేణ్యా! ఇచ్చోట సుఖముగా నుండుము. స్వర్గాదిస్థానమందు రమింపుము! ఇదిగో కమనీయ కన్యక యున్నది. ఇది దివ్యభోగము. జరామరణ నాశకమయిన రసాయనామృతమిది. ఇదిగో స్వేచ్ఛగా పోవు విమానము" యీ ప్రకారము ప్రార్థింతురు. అప్పుడా యోగివరుడు ఆ ప్రార్థనయం దాసక్తినిగాని,

నా యోగప్రభావ మిట్టిదని గర్వమును గాని చేయకూడదు. మరియును, ఆ స్వర్గవిషయ భోగములం దిటుల దృఢముగా దోషమునే భావించవలయును.

"ఘోరేషు సంసారాంగారేష్వహం పాపచ్యమానః కథంచిత్ క్లేశాదిధ్వాన్త ధ్వంసకం యోగప్రదీపమలభే। తస్మైతే తృష్ణాయోనయో విషయవాయవః ప్రతిపక్షాః। స ఖల్వహం లబ్ధాలోకః కథమేతైర్వంచితః పునఃపునః ప్రదీప్తస్య సంసారహుతభుజః స్వాత్మానమిన్ధనీకుర్యాం। అతః స్వస్తి వః స్వప్నసమేభ్యః కృపణజనప్రార్థనీయేభ్యః విషయేభ్యః ఇతి॥"

మహాఘోరములయిన సంసారాగ్నులలో పడినవాడనై, ఉడుకుచున్నవాడనై, నేనెటులనో గురు దైవకృపచే అవిద్యాది క్లేశ అన్ధకారమును నశింపజేయు యోగప్రదీపమును పొందితిని. అయినను ఆ యోగప్రదీపమునకు (దీపమునకు) ఆశాజనకములయిన విషయబుద్ధులనెడు విషయవాయువులు విరోధులుగా నున్నవి. అట్టివాడనైనను యిప్పుడు పొందబడిన జ్ఞానము గలవాడనై తిరుగా నీవిషయవాసనలచే వంచింపబడినవాడనైకి బాగా వాని విషయమును తెలిసియు, మరల మరల ప్రజ్వలించుచున్న సంసారాగ్ని,

నేను కట్టెలగుదును. అందువలన స్వప్నసదృశములయిన నీచజనులచే ఆశింపదగిన ఓ విషయబుద్ధులారా! మీకు స్వస్తి. ఈ ప్రకారము భావించుటచే స్థిరమతియై తిరుగా సమాధినే భావించవలయును. దేవేన్ద్రాదుల మన్ననలనుగూడ సరకుకొనగూడదు. ఇట్టి పరవైరాగ్యధురంధరుడు గావలయును. అటుగాక కృపణబుద్ధిచే విషయములపై నాసగొని ఆసక్తి గర్వముల బూనెనేని అట్టివాడు యోగభ్రష్టుడై అపార సంసార గర్తపాతమునకు గురియగుచున్నాడు. కావున కైవల్యప్రాప్తికి భంగకరమైన ఆసక్తి గర్వముల జేయరాదు. పరవైరాగ్య మూనవలయునని భావము.

సూ॥ క్షణతత్క్రమయోః సంయమాద్వివేకజం జ్ఞానమ్ ॥ 54

పద॥ క్షణతత్క్రమయోః - సంయమాత్ - వివేకజం - జ్ఞానం.

అర్థము॥ క్షణతత్క్రమయోః - క్షణ = విభజింపసాధ్యముగాని సత్యమైన అతి సూక్ష్మమైన నిర్విభాగ కాలమందు, తత్క్రమయోః = అట్టి నిర్విభాగ కాలరూప క్షణముల యొక్క పౌర్వాపర్యక్రమమందును, సంయమాత్ = సంయమమువలన, వివే

కజం = క్షణముల విభేదసాక్షాత్కార వివేకమువలన గలిగిన, జ్ఞానం = ఆత్మ సాక్షాత్కారజ్ఞానము గలుగుచున్నది.

అవ॥ పైన స్వార్థ (ఆత్మ) సంయమమువలన పరమాత్మ జ్ఞానము గలుగునని చెప్పిరి. ఆ యాత్మజ్ఞానము అన్యత్ర సంయమమువలన గలుగుననియు నుపాయాన్తరమును తెలుపుచున్నారు.

తా॥ క్షణమందును అతి సూక్ష్మక్షణక్రమమందును సంయమమువలన ఆత్మపురుష జ్ఞానము గలుగుచున్నది. కాలమును విభాగించుచు పోయిన కడపట విభజింప సాధ్యము గాని కాలవిభాగ మెద్దియో అది నిర్విభాగకాలము. దానినే క్షణమని తెలియవలయును. ఈ క్షణము మహాతిసూక్ష్మము; సత్యమైనది. తర్వాత సంభవించు నుత్తరోత్తరక్షణములు క్షణసమూహములగును. ఇవియే ముహూర్తాది కాలవిభాగములు అసత్యములగుచున్నవి. కావున (1) అవిభాజ్యమైన సత్యమయిన క్షణమందును, (2) ఈ క్షణముకంటె నీక్షణము పూర్వము, ఈ క్షణము ఉత్తరము అను పౌర్వాపర్యక్రమ (ముందు వెనుకల సంభవించు క్రమ) మందును సంయమమువల్లన అతి సూక్ష్మములగు క్షణములయొక్క భేదము

సాక్షాత్కరింపబడుచున్నది. అట్టి సూక్ష్మాతిసూక్ష్మ క్షణవివేచనాజన్య జ్ఞానమహిమచే నో కేతూరి ఆకాశము మొదలుకొని పరమాత్మవరకు సాక్షాత్కరించు జ్ఞానము సిద్ధించుచున్నది. ఇందుచే చిత్తము శుద్ధమై అతిసూక్ష్మమై పరమాత్మ నెఱుంగునని భావము.

**సూ॥ జాతిలక్షణదేశై రన్యతానవచ్ఛేదాత్తుల్యయో స్తతః ప్రతిపత్తిః ॥**

పద॥ జాతిలక్షణదేశైః - అన్యతానవచ్ఛేదాత్ - తుల్యయోః - తతః - ప్రతిపత్తిః.

అర్థము॥ జాతిలక్షణదేశైః - జాతి = గోత్వాదిజాతి, లక్షణ = కృష్ణపీతాది స్వరూపము, దేశైః = పూర్వోత్తరాది ప్రదేశము వీనిచేత, తుల్యయోః = సమానములగు పదార్థములయొక్క, అన్యతానవచ్ఛేదాత్ - అన్యతా = భేదముయొక్క, అనవచ్ఛేదాత్ = నిశ్చయము లేకపోవుటవలన (జాత్యాదులచే సమానమయిన రెండు పదార్థములకు జాత్యాదులచే భేదనిశ్చయము లేకపోగా), తతః = క్షణక్రమముల రెంటియందు సంయమముచే గలిగిన వివేకజ్ఞానమువలన, ప్రతిపత్తిః = భేదనిశ్చయజ్ఞానము గలుగుచున్నది.

అవ॥ ఈ సూత్రమున క్షణక్రమముల సాక్షాత్కారముచే గలుగు మఱియొక సూక్ష్మ విషయ విశేషమును చెప్పుచున్నారు.

తా॥ 1. గోత్వాదిజాతి, 2. కృష్ణపీతాది స్వరూపము, 3. పూర్వోత్తరాది ప్రదేశము యీ మూడింటిచేతను పదార్థముల భేదము గానవగును. ఈ మూడును లోకములోని పదార్థభేద నిశ్చయహేతువులు. వానిలో దేశముచేతను, లక్షణముచేతను సమానమ్ములయిన గో గవయ మృగముల రెంటికిని గోత్వ, గవయత్వ జాతులు వేరగుటచే భేదము స్పష్టము. 1. ఇది జాత్యాభేదనిశ్చయము. దేశలక్షణములచే తుల్యములయిన రెండు గోవులకు నొకటి నలుపు రెండవ దెఱుపు యను కృష్ణ అరుణ వర్ణములచే భేదము స్ఫుటము. 2. ఇది లక్షణేన భేదనిశ్చయము. మఱియు జాతిలక్షణములచే సదృశములయిన రెండు ఉసిరికాయలకు ఒకటి ముందుభాగమున నున్నది, మఱియొకటి వెనుకభాగమున నున్నది అను పూర్వోత్తరదేశములచే భేదము విదితము. 3. ఇది దేశేన భేదనిశ్చయము. ఇటుండగా నొక జ్ఞాని మఱియొక యోగపురుషుని జ్ఞానపరీక్షకై జాతిలోను, పరిణామాదిలక్షణములోను సమానములయిన రెండామలకములలో పూర్వదేశమం దొకదానిని, ఉత్తర

దేశమందు మఱియొకదానిని (ముందు వెనుకలుగా) నుంచెను. అప్పుడు యోగియు నితర విషయమునందు ప్రవర్తించియుండగా, ఆ జ్ఞాని పూర్వదేశామలకము నపహరించి ఉత్తర దేశమందున్న ఆమలకమును పూర్వదేశమందుంచెను. అందుచే నా రెండామలకముల నున్న దేశముచేతను అభేద మేర్పడెను. జ్ఞాని తీసికొనిన ఆమలకము యేదియని చెప్ప వలసియున్నది. ఇటుల కాల లక్షణ దేశముల మూడింటిచేతను సమానములయిన ఆమలక ముల రెంటికిని భేద మేర్పడకుండగా అతిసూక్ష్మ, అవిభాజ్య, సత్యక్షణముల సంయమ మును జేసిన యోగివరుడు యీ ఆమలకము యిన్ని క్షణములతో గూడియున్నది; ఆ క్షణ ములతోగూడిన ఆమలక మపహరింపబడెనని క్షణసంయమజన్య వివేకజ్ఞానముచే దెలియు చున్నాడు. ఇటుల క్షణసంయమమునకు సూక్ష్మవిషయ విశేషజ్ఞానమను సిద్ధిని తెలిపిరి.

**సూ॥ తారకం సర్వవిషయం సర్వథావిషయమక్రమం చేతి వివే కజం జ్ఞానమ్ ॥ 56**

పద॥ తారకం – సర్వవిషయం – సర్వథావిషయం – అక్రమం – చ – ఇతి – వివే కజం – జ్ఞానం.

అర్థము॥ వివేకజం జ్ఞానం = ఆత్మానాత్మ వివేకముచే గలిగిన స్వస్వరూపజ్ఞానము, తారకం = పరమాత్మతత్త్వముతో గూడినదగుటచే సంసారసాగరమునుండి తరింపజేయునదిగను, సర్వవిషయం = సర్వపదార్థముల గోచరించునదిగను, సర్వథా విషయం = సర్వపదార్థ విశేషముల అన్ని ప్రకారములుగా గ్రహించునదిగను, అక్రమం = క్రమము నపేక్షింపకనే ఒకేతూరి సకల పదార్థముల కరతలామలకము వలె (చేతిలోని ఉసిరిక కాయవలె) తెలియుంగునదిగను యగుచున్నది.

అవ॥ ఈ సూత్రమున వివేకజ్ఞానమునకు స్వరూపప్రకారమును తెలుపుచున్నారు.

తా॥ ఆత్మ వివేకముచే గలిగిన స్వానుభవసిద్ధ స్వస్వరూపజ్ఞానము పరమాత్మతత్త్వమును తెలుపునందుచే సంసారసాగరమునుండి తరింపజేయుచున్నది. మఱియు నది సమస్తమును గోచరింపజేయుచున్నది. ఆత్మ దేనికిని విషయము గాదు. ఆత్మయే సమస్తమును విషయము జేయుచున్నది. దానికి విషయముకాని ఏదియు లేదని అర్థము. జరిగినవియు జరుగుచున్నవి. ఇక జరుగనున్నవియు నన్ని విషయముల నన్ని విధములుగా సా జ్ఞానము గ్రహించుచున్నది. క్రమము లేకనే కరతలామలకమునువలె క్షణములోనే

సమస్తపదార్థ సమూదాయమును తెలియునదిగా నా విజ్ఞాన మున్నదని భావము.

సూ॥ సత్త్వపురుషయోశ్శుద్ధిసామ్యే కైవల్యం ఇతి ॥ 57

పద॥ సత్త్వపురుషయోః - శుద్ధిసామ్యే - కైవల్యం - ఇతి.

అర్థము॥ సత్త్వపురుషయోః = బుద్ధికిని ఆత్మపురుషునకును, శుద్ధిసామ్యే - శుద్ధి = సర్వవృత్తి శూన్యత్వమను, శుద్ధియొక్కయు, కల్పితభోగ శూన్యత్వమను శుద్ధియొక్కయు, సామ్యే సతి = సమానత్వము గలుగగా, కైవల్యం = స్వస్వరూపప్రతిష్ఠాలక్షణ పరమపద కైవల్యము (సిద్ధించును), ఇతి = విభూతిపాదము ముగిసినది.

అవ॥ పరమాత్మవివేకజ్ఞానఫలమును నిరూపించుచున్నారు.

తా॥ రజోగుణ తమోగుణ మాలిన్యములు నశించుటచే సమస్త అవిద్యా విజృంభిత సంస్కారములు నిశ్శేషరహితములగుటచేతను, ఆత్మజ్ఞానోదయముచే బుద్ధి సర్వవృత్తులు నశించుటయును శుద్ధిని పొందుచున్నది. ఆ ప్రకారముగానే స్వభావశుద్ధుడగు నాత్మపురుషుడున్ను కల్పింపబడిన భోగములనుండి విడివడుంట ద్రుశ్యాభోతుండగుటయును శుద్ధిని

పొందుచున్నాడు. ఈ తీరున బుద్ధ్యాత్మలు రెండును పరిశుద్ధములు కాగా, సమానావస్థలో నుండగా కైవల్యమబ్బును. అనగా ఆత్మ వివేకజ్ఞానముచే పరవైరాగ్యము గలిగి సకల వృత్తిశూన్యత్వము సకల భోగరాహిత్య మేర్పడగా కూటస్థ నిత్యశుద్ధ అనన్త అఖండ సచ్చిదానందమగు ఆత్మ స్వస్వరూప ప్రతిష్ఠలో నుండుట అను కైవల్యము సిద్ధించుచున్నది. సారాంశము - ఏప్రకారముచేతనైనా జనించిన ఆత్మపురుషవివేకజ్ఞానముచే పరవైరాగ్యము ద్వారా పరమపదకైవల్యము లభించునని ముఖ్యతాత్పర్యము.

## ఇతి శ్రీమత్పతంజలిప్రణీతే యోగశాస్త్రే యోగసుధాకరాయాం వృత్తౌ విభూతి పాద స్సమాప్తః

ఓం తత్ సత్



శ్రీ

# అథ కైవల్యపాదః

శ్లో॥ వీరాసనే సమాసీనం సంవిన్ముద్రాలసత్కరం।
కైవల్యానన్దదం కఞ్చిజ్జ్యోతిర్ధాతుముపాస్మహే॥

ఈశ్వరప్రార్థన॥ వీరాసనమందున్నట్టియు, జ్ఞానముద్రావిలసిత హస్తము గలిగినట్టియు, కైవల్యానన్దము నొసగునట్టియునగు ఒకానొక సర్వవిలక్షణ అనిర్వాచ్య జ్యోతిర్ధాతువు నుపాసించుచున్నారము.

అవతరణిక॥ విభూతిపాదమున సమాధికన్తరఙ్గములగు ధారణాధ్యాన సమాధులను వానికి లక్ష్యస్థానములయిన పరిణామభేదములను వానిని శ్రద్ధతో నాచరించిన ఆత్మవివేకము చే గలుగు కాలత్రయ విషయజ్ఞాన దివ్యశ్రవణజ్ఞానము మొదలగు జ్ఞానసిద్ధులను పరకాయప్రవేశ ఆకాశాది క్రియాసిద్ధులను అణిమాది సిద్ధిప్రకారమునున్ను, కైవల్యమునున్ను బాగుగా నిరూపించిరి. ప్రస్తుత మీ పాదమున సర్వముఖ్య ప్రయోజన

మగు కడపటిదగు కైవల్యమునకు యొక్క స్వరూపమును ప్రాధాన్యముగా ప్రతిపాదింపదలంచినవారై మొదట పంచవిధ సిద్ధులను తెలుపుచున్నారు. కైవల్యయోగ్యమగు చిత్తముయొక్క నిరూపణకై సిద్ధిప్రకరణము ప్రారంభింపబడెను.

**సూ॥ జన్మౌషధిమన్త్రతపస్సమాధిజాస్సిద్ధయః ॥** 1

పద॥ జన్మౌషధిమన్త్రతపస్సమాధిజాః - సిద్ధయః.

అర్థము॥ జన్మౌషధి ... ... సమాధిజాః - జన్మ = పుట్టుక, ఓషధి = రసాయనాది ద్రవ్యములను సేవించుట, మన్త్ర = శివమన్త్రాదులను జపించుట, తపః = శరీరమును శోషింపజేసి ఇన్ద్రియముల నిగ్రహించుట, సమాధి = ధారణాధ్యాన సమాధులు వీనివలన, జాః = గలుగు, సిద్ధయః = ఐదు సిద్ధులు (ఉన్నవి).

తా॥ పుట్టుకతోనే పక్ష్యాదులకు ఆకాశగమనాది సిద్ధులు గలుగుచున్నవి. అలాగున కపిలాది సిద్ధపురుషులకు జన్మతోనే జ్ఞానక్రియాసిద్ధులు (త్రికాలజ్ఞాన పరకాయప్రవేశక్రియ మొదలయినవి) గలిగినవి. 1. ఇది జన్మసిద్ధియగును. రసాయనాది ద్రవ్యములను

శాస్త్రరీతి గా సేవించుటచే కాయసిద్ధి గలుగును. ఈ యోషధిసేవనముచే మాండవ్యాది మహామునులు జరామరణవర్జితులయిరి. 2. ఇది యోషధియగును. త్రైపురాది (శివ) మన్త్రముల జపముచే కొందఱు మహానుభావులు (వసిష్ఠాదులు) అణిమాదిసిద్ధులు గలవారైరి. నారదాదులును మన్త్ర జప సిద్ధి గలవారగుటచే త్రిలోక సంచారాదిసిద్ధి గలిగినవారైరి. 3. ఇది మన్త్రసిద్ధియగును. శరీరశోషణాది ఇంద్రియనిగ్రహాది తపోమహిమచే విశ్వామిత్రాదులు సంకల్పసిద్ధిగలవారై అపరసృష్టి కరణశక్తినిన్ని సంపాదించిరి. 4. ఇది తపస్సిద్ధి అగును. 5. విభూతిపాదమున జెప్పబడిన సిద్ధులన్నియు సమాధిసిద్ధులగును.

## సూ॥ జాత్యన్తరపరిణామః ప్రకృత్యాపూరాత్ ॥ 2

పద॥ జాత్యన్తరపరిణామః – ప్రకృత్యాపూరాత్.

అర్థము॥ ప్రకృత్యాపూరాత్ – ప్రకృతి = ప్రధానము మొదలుకొని పృథివివరకుగలవి ప్రకృతులనబడును. ఈ ప్రకృతులయొక్క, ఆపూరాత్ = ప్రవేశమువలన (ప్రాచీన నరాది దేహావయవములయందు ధర్మాధర్మముల నిమిత్తము జేసికొని నూతనావయవములయొక్క ప్రవేశమువలన), జాత్యన్తరపరిణామః = మతియొక

జాతిరూప (దేవాదిరూప) పరిణామము గలుగుచున్నది.

అవ॥ యోగమహిమచే కాయేన్ద్రియాదులు మారి దివ్యత్వము నెటుల పొందుచున్నవి? ఒకే జన్మములోనే నన్దీశ్వరుడు తపశ్శక్తిచే మనుష్యదేహముతో దేవత్వము నొందెను. దేవుడాయె ననునది మనుష్యదేహమునకు దేవశరీరాకార పరిణామము యోగ్యము గానందుచే (సంభవింపక పోవుటచే) నెటులగునని సందేహము రాదని దెలుపుచున్నారు.

తా॥ ప్రధానము మొదలు భూమివరకున్నవి ప్రకృతులనబడును. పంచభూతములు ఇన్ద్రియాదులు ప్రకృతులేయగును. ఈ ప్రకృతులు నరదేవాదులం దున్నందుచే ప్రకృతి పరిణామము గలుగుచున్నది. తపోమన్త్రాదులచే గలుగు ధర్మాధర్మముల నిమిత్తము జేసి కొని ప్రకృతులు అన్నిచోట్లున్నందుచే నరాదిదేహములయందు దేవాది నూతన అవయవముల నిర్మాణమునకై ప్రకృతి ప్రవేశించుచున్నది. ఇట్టి ప్రకృతిప్రవేశముచే మొందున్న నరాది పరిణామముపోయి దేవాది ఉత్తరపరిణామము గలుగుచున్నది. పూర్వదేహములు పోయి నూతనాణువుల ప్రవేశముచే నూతన దివ్యదేహము లేర్పడుచున్నవి. ఇదియే

ప్రకృత్యాపూరముచే (ప్రకృతి ప్రవేశముచే) గలుగు జాత్యన్తర పరిణామము. అందుచే నందీశ్వరుని దేవత్వపరిణామము సమఞ్జసమేయగును.

**సూ॥ నిమిత్తమప్రయోజకం ప్రకృతీనాం వరణభేదస్తు తతః క్షేత్రికవత్ ॥ 3**

పద॥ నిమిత్తం - అప్రయోజకం - ప్రకృతీనాం - వరణభేదః - తు - తతః - క్షేత్రికవత్.

అర్థము॥ నిమిత్తం = తపోమన్త్రాది శక్తిచే నేర్పడు ధర్మాధర్మాదికము, ప్రకృతీనాం = ప్రధానాది పృథివ్యన్త ప్రకృతులను (పంచభూతేన్ద్రియాదులను), అప్రయోజకం = ప్రవర్తకము గాదు (ప్రధానకారణమును ప్రయోజకము గాదు), తు = మరేమనగా, తతః = ఆ ధర్మాధర్మరూప నిమిత్తమువలన (అప్రధానకారణమువలన), వరణ భేదః - వరణ = ప్రతిబంధకముయొక్క, భేదః = భేదించుట (నిరాకరణము), క్షేత్రికవత్ = వ్యవసాయము జేయువానియొక్కవలె (వాని వ్యాపారమువలె) అగుచున్నది.

అవ॥ ప్రకృతి నూతనావయవములయందు ధర్మాధర్మాదుల నిమిత్తము జేసికొని ప్రవే
శించుచున్నది గాన, ప్రకృతి ప్రవేశమునకున్న ప్రవర్తకత్వమును ప్రయోజకత్వ
ధర్మము నిమిత్తధర్మాదులకే చెప్పవలయును. అదియే మంచిదని చెప్పుట
యుక్తము గాదు. ప్రకృతియొక్క కార్యములయిన ధర్మాధర్మాదులు కారణమైన
ప్రకృతికి కారణములను నపసిద్ధాన్తము వచ్చిపడును అని నిరూపించుచున్నారు.
(ప్రకృతియే పరిణామవిషయమున స్వతన్త్రి ప్రవర్తకమగుననియు ధర్మాదికము
నిమిత్తమాత్రమనియు చెప్పుచున్నారు).

తా॥ నిరీశ్వర సాంఖ్యమున (పురుషుడు లేడని చెప్పుట నిరీశ్వర సాంఖ్యమగును.
ఆ పక్షమున) పురుషునియొక్క ప్రయోజనము పురుషార్థము. అది భోగాపవర్గరూపము.
ఇక రాబోవునది భవిష్యత్తున సంభవింపబోవుచున్న ఆగామి పురుషార్థమే (భోగాపవర్గ
ములు) ప్రకృతులను ప్రవర్తింప జేయుచున్నది. అనగా నిక పురుషునికి భోగాపవర్గములు
(సుఖ మోక్షములు, ప్రేయస్సు శ్రేయస్సులు) యెట్టివి రాబోవుచున్నవో దాని ననుసరించి
ప్రకృతి ప్రవర్తించుననియు, దానిచే జాత్యన్తర పరిణామము గలుగుననియు నిరీశ్వర

సాంఖ్యవాదులు తెలుపుదురు. సేశ్వరసాంఖ్యులగు (ఈశ్వరుడే సమస్తమునకు కర్తయను వారు) మేము పైన నిరూపింపబడిన పురుషార్థము నుద్దేశించి ఈశ్వరుడే ప్రకృతిని ప్రవర్తింప జేయుచున్నాడని చెప్పుచున్నారము. కావున నీశ్వరోద్దేశ్యరూపమైన భోగాపవర్గములను పురుషార్థమే ప్రకృతి ప్రవర్తకమగునని సిద్ధాన్తీకరింపబడెను. ఈ కారణముచే ప్రకృతికి ధర్మాధర్మాదికము నిమిత్తమాత్రమే కాని ప్రయోజకముగాదు. ప్రకృతి కార్యములగు ధర్మాధర్మాదులు ప్రకృతికి కారణములు గావు. మృత్తికాచక్రాదులు కులాలుడను ప్రయోజకుడు (కుమ్మరియను ప్రధానకారణము) లేకుండిన ఘటమును జేయజాలనటుల ప్రధానకారణమగు ప్రయోజక ప్రకృతియే స్వతన్త్రరూపేణ జాత్యన్తరపరిణామములో కారణమగుచున్నది; ధర్మాధర్మాదులు గావు. అవి నిమిత్తమాత్రములేయగును. ధర్మాధర్మాది నిమిత్త ప్రయోజనమేమనగా, ప్రకృతి ప్రవేశమునకున్న ప్రతిబంధకముల దొలగజేయుటయే యగును. ఈ సూత్రముయొక్క వాక్యార్థము ఆగామియైన పురుషార్థము నుద్దేశించి యీశ్వరుడు ప్రకృతిని ప్రవర్తింపజేయుచున్నాడు. ఆ యీశ్వర ప్రేరణచే పంచభూతేన్ద్రియాత్మక ప్రకృతి సంతన్త్రముచే నరాది దేహములుపోయి, దేవాది జాత్య

త్తర పరిణామ జననమునకై నూతనావయవములను ధర్మాధర్మముల (తపోమన్త్రాది జన్యములయిన) నిమిత్తము జేసికొని ప్రవేశించుచున్నది. అప్పుడు ప్రకృతియే సంతన్త్రి ముగా పరిణామములో ప్రవర్తకమగుచున్నది. ధర్మాధర్మాదులు ప్రవర్తకములు గావు. ప్రధానకారణములగు ప్రయోజకములుగావు. నిమిత్తమాత్రములే యగుచున్నవి. క్షేత్ర పాలకుడు (సేద్యము జేయువాడు) పై ప్రదేశములనుండి జలమును క్రిందికి ప్రవహింప జేయవలసియుండిన అడ్డులను మాత్రము తొలగద్రోసిన జలము స్వయముగనే ప్రవహించు నటుల (కృషీవలుడు జలప్రతిబంధకములను మాత్రము తొలగించువాడు) ప్రకృతియే సంత న్త్రిముగానే ధర్మముచే నధర్మరూప ప్రతిబంధకము తొలగగా దేవాదిపరిణామమునందు ప్రవర్తించుచున్నది. కావున ధర్మాదినిమిత్తము ప్రకృతి ప్రతిబంధనాశకారిగాయున్నది. అంతమాత్రమే ప్రయోజకము గాదు (ప్రధానకారణముకాదు). ధర్మముచే నధర్మప్రతి బంధకము తొలగి ప్రకృతులు దేవాదిపరిణామావయవములు జననములో ప్రవర్తించుచున్నవి. ఇందులకు ఉదాహరణము నందీశ్వరాదులు. అధర్మముచే ధర్మము నశింపగా ప్రకృత్యన్తర జాత్యన్తరపరిణామములో నహుషాదులు సహుష అజగరాదులు (నహుషుడు అగస్త్య శాపముచే పెద్ద అజగరసర్పమై స్వర్గమునుండి పడెను.)

సూ॥ నిర్మాణచిత్తాన్యస్మితామాత్రాత్ ॥ 4

పద॥ నిర్మాణచిత్తాని - అస్మితామాత్రాత్.

అర్థము॥ అస్మితామాత్రాత్ = మూలభూత స్వాహంకార ప్రకృతినుండి, నిర్మాణ చిత్తాని = యోగప్రభావాతిశయముచే నిర్మింపబడు చిత్తములు గలుగుచున్నవి.

అవ॥ యోగి యొకేసారి యనేక భోగము లనుభవింపగోరి అనేకశరీరముల సృజించుచున్నాడు. ఆ దేహములం దనేక చిత్తనిర్మాణము లెచ్చోటనుంచి యుద్భవిల్లునను విషయమును స్పష్టీకరించుచున్నారు.

తా॥ అనేకవిధ భోగార్థమై అనేక చిత్తము లాయా కాయముల యానుగుణ్యముగా యోగప్రభావముచే నిర్మింపబడుచున్నవి. అప్పుడు యోగియొక్క సంకల్పానుగుణమై ప్రకృతి నూతనావయవసన్నివేశప్రవేశమందు ప్రవర్తించుచున్నది. అందుచే మూలాహంకార ప్రకృతినుండియే అనేక చిత్తములు గలుగుచున్నవని తాత్పర్యము. కావున యోగియొక్క నిర్మాణచిత్తములయొక్క యుత్పత్తి మూలాహంకారము నుండియే యని తెలియవలయును.

సూ॥ ప్రవృత్తిభేదప్రయోజకం చిత్తమేకమనేకేషామ్ ॥ 5

పద॥ ప్రవృత్తిభేదప్రయోజకం - చిత్తం - ఏకం - అనేకేషాం.

అర్థము॥ అనేకేషాం = అనేక నిర్మాణచిత్తములలో, ఏకం చిత్తం = ఒక నాయక (ప్రభువై యున్న) చిత్తమును, ప్రవృత్తిభేదప్రయోజకం - (ప్రవృత్తి = స్వభోగమున కనుకూలములయిన వ్యాపారములయొక్క, భేద = విశేషములకు, ప్రయోజకం = నియామకమునుగా, (నిర్మిమీతే = నిర్మించుకొనుచున్నాడు).

అవ॥ యోగప్రభావముయొక్క నిర్మాణచిత్తములు పరస్పర భిన్నాభిప్రాయములు గలవగుటచే స్వభోగానుభవమెట్టులని సందేహింపనవసరము లేదని తెలుపుచున్నారు.

తా॥ యోగప్రభావముచే నిర్మాణచిత్తములనేకములైనను, వానిలో ప్రధానముగు చిత్తమొకటిగానే యుండుటున్నది. చిత్తములు, తదనుగుణ దేహములు మారినను స్వాహంకారరూప (నేనను) మూలచిత్తము వానికన్నిటికి నియామకమై అయాచిత్తముల విశేషములగనుగొనుచున్నదై ప్రభువవలెనున్నది. ఈ ప్రధానచిత్తము మారదు. ఇదియే సకల

భోగముల ననుసన్ధానమును జేయునది కావున చిత్తములు పరస్పరభిన్నములయినను, భోగసాధనము నాయక నియామక చిత్తముద్వారా సంభవించుచున్నది. అట్టి నాయక చిత్తమును యోగి సృజించునని భావము.

## సూ॥ తత్ర ధ్యానజమనాశయమ్ ॥ 6

పద॥ తత్ర - ధ్యానజం - అనాశయం.

అర్థము॥ తత్ర = ఆ ఐదు విధములయిన సిద్ధ చిత్తములలో, ధ్యానజం = ధ్యానము వలన గలిగిన (సమాధిసిద్ధిచే సిద్ధమైన) చిత్తము, అనాశయం = క్లేశ కర్మ ఫల సకల సంస్కారములు లేనిది (ఇదియే అపవర్గ (మోక్ష) మునకు యోగ్యమయినది.),

అవ॥ ఈ ప్రకారము జన్మౌషధాది సిద్ధులను ఐదవగు చిత్తములను నిరూపించి వానిలో అపవర్గ యోగ్యమయిన చిత్తమును నిర్ధారణ జేయుచున్నారు.

తా॥ జన్మాదిసిద్ధులచే నేర్పడిన పంచవిధ చిత్తములలో నయిదవదియగు సమాధి వలన గలిగిన చిత్తము సకల కర్మలచేతను, క్లేశములచేతను, సంస్కారములచేతను శూన్యమయినదగుచున్నది. అనగా సకల సంస్కారరహితమైన, శుద్ధమైన, ఏకాగ్రమైన చిత్తము

మోక్షమునకు అర్హమగుచున్నది. బ్రహ్మములో లయించి బ్రహ్మమే యగుచున్నదని తాత్పర్యము.

సూ॥ కర్మాశుక్లకృష్ణం యోగినస్త్రివిధమితరేషామ్ ॥ 7

పద॥ కర్మ – అశుక్లకృష్ణం – యోగినః – త్రివిధం – ఇతరేషాం.

అర్థము॥ యోగినః = యోగీశ్వరునియొక్క, కర్మ = మోక్షైకఫలక కర్మము, అశుక్లకృష్ణం – (ఇచ్చోటనున్న నఞ్ భిన్నార్థకమై వేరుగాను, కలిసియు నన్వయించుచున్నది. అందుచే) అశుక్లం = పుణ్యభిన్నముగను, అకృష్ణం = పాపభిన్నముగను, అశుక్లకృష్ణం = పుణ్య పాప మిశ్రకర్మ భిన్నముగను నగుచున్నది, ఇతరేషాం = యోగులు కానివారియొక్క కర్మ, త్రివిధం = 1. పుణ్య, 2. పాప 3. మిశ్రరూపమను త్రివిధమగుచున్నది.

అవ॥ యోగి చిత్తమిటులాయెను. యోగి కర్మ గొట్టిదో తెలుపుచున్నారు.

తా॥ కర్మ పాపమనియు, పుణ్యమనియు, పుణ్యపాపములు కలిసినందుచే మిశ్ర

మనియు మూడు విధములుగా నున్నది. అందులో శాస్త్రనిషిద్ధకర్మ కృష్ణమనియు (పాపకర్మ), శాస్త్రవిహిత కామ్యకర్మ శుక్లమనియు (పుణ్యకర్మ), రెండును కలిసినది (మిశ్రకర్మ) శుక్లకృష్ణమనియు చెప్పబడును. ఈ త్రివిధ కర్మలు యోగులు గానివారికి సంభవించును.

శ్లో॥ శుభైరాప్నోతి దేవత్వం నిషిద్ధైః నారకీం గతిం।
ఉభాభ్యాం పాపపుణ్యాభ్యాం మానుష్యం లభతేఽవశః॥

జీవుడు శుభకర్మచే దేవత్వమును, పాపకర్మచే నరకలోకమును, పుణ్య పాప రూప మిశ్రకర్మచే మనుష్యత్వమును స్వతంత్రత లేనివాడై పొందుచున్నాడు. ఇటు లయిన యోగాభ్యాసమున్ను శాస్త్రవిహితముగుటచే శుక్లమను పుణ్యకర్మగదా అని శంకింపగూడదు. ఆ యోగము కామ్యము గానందుచే పుణ్య పాపభిన్నమే యని తెలియ వలయును. యోగి కర్మ, పుణ్యము నతిక్రమించినదిగను, పాపరహితముగను, పుణ్యపాప ముల కందనిదిగను నున్నది. అందుచే యోగికర్మ అశుక్లకృష్ణమని చెప్పిరి. ఆ యోగి కర్మ కేవల మోక్షఫలదమైయున్నది.

సూ॥ తతస్తద్విపాకానుగుణానామేవాభివ్యక్తిర్వాసనానామ్ ॥ 8

పద॥ తతః - తద్విపాకానుగుణానాం - ఏవ - అభివ్యక్తిః - వాసనానామ్.

అర్థము॥ తతః = ఆ త్రివిధకర్మలవలన, తద్విపాకానుగుణానాం ఏవ - తద్విపాక = ఆ కర్మలయొక్క, విపాక = ఫలములకు, అనుగుణానాం ఏవ = అనుకూలములయినట్టియే, వాసనానాం = సంస్కారములకు, అభివ్యక్తిః = ప్రకాశము (ప్రకటమగుట) గలుగుచున్నది.

అవ॥ ప్రసంగవశాత్తుగా నాయాకర్మలయొక్క ప్రకటనారూపఫలోన్ముఖత కర్మఫలమునకు తగిన సంస్కారముల ప్రాదుర్భావమువలననే గలుగుచున్నదని నిరూపించుచున్నారు. ఫలానుగుణ్యముగా సంస్కారము లేర్పడి కర్మఫలానుభవమును గలుగజేయుచున్నవని అర్థము.

తా॥ త్రివిధకర్మ లేర్పడిన తర్వాత కర్మలు ఫలోన్ముఖములుకాగా, నాయా కర్మఫలానుగుణ్యముగా సంస్కారము లభివ్యక్తము లగుచున్నవి. కర్మఫలము వేరుగను, సంస్కారములు వేరుగను నుండజాలవు. పుణ్యఫలమగు దేవత్వప్రాప్తియందు దేవతా

సంబంధసంస్కారములే ప్రాదుర్భూతములై దేవత్వమును గలిగించుచున్నవి. దానికి విరుద్ధములగు నరత్వజనక సంస్కారములు నిద్రించుచుండును. అటుగాక నరభోగవాసనలుత్పన్నములాయెనేని దివ్యభోగము సంభవించదు. కావున నానాకర్మఫలానుగుణ్యముగా వాసన లుదయమై కర్మఫలము ననుభవించ జేయుచున్నవి. పుణ్యఫలానుగుణసంస్కారములు దేవత్వమును, పాపఫలానుగుణసంస్కారములు నరకత్వమును, మిశ్రఫలానుగుణసంస్కారములు విరుద్ధములుగాక మనుష్యత్వమును గలిగించుచున్నవని భావము.

సూ॥ జాతిదేశకాలవ్యవహితానామప్యానన్తర్యం స్మృతిసంస్కారయోరేకరూపత్వాత్ ॥ 9

పద॥ జాతిదేశకాలవ్యవహితానాం - అపి - ఆనన్తర్యం - స్మృతిసంస్కారయోః - ఏకరూపత్వాత్.

అర్థము॥ జాతిదేశకాలవ్యవహితానామపి - జాతి = జన్మపరంపరలచే, దేశ = స్వర్గాది లోకములచే, కాల = యుగములచే, వ్యవహితానామపి = మిగుల దూరగము

లయినను సంస్కారములకు, స్మృతిసంస్కారయోః = స్మృతులకు (స్మరణలకును) సంస్కారములకును రెంటికిని, ఏకరూపత్వాత్ = అభేదరూపత్వ ముండుట వలన, ఆనన్తర్యం = దగ్గఱగా నుండుట (కార్యకారణభావము) ఫలకారణత్వము గలుగుచున్నది.

అవ॥ ఇప్పుడుంటున్న నరభోగవాసనలు పుణ్యాధిక్యతచే దేవత్వాది జన్మసహస్రలుగలిగి యుగములు గడచిన తర్వాత తిరుగా నరజన్మను కాలవ్యవధాన మున్నందుచే గలిగించునా అని సందేహ మవసరములేదని తెలుపుచున్నారు.

తా॥ సంసార మనాదియగును. ఇందులో నేయే కర్మచేత నేయే జన్మయందు సంపాదింపబడిన యే సంస్కారములుగలవో, ఆ సంస్కారములన్నియు దేవాదిజన్మలు గలిగి స్వర్గాదిలోకములలో ననేకయుగములు గడచిపోయినను తిరుగా ఆయా కర్మాను గుణ్యముగా జన్మము రాగా, ఆ కర్మచేతనే ప్రకటములయిన జన్మలకు స్మరణద్వారా భోగహేతువు లగుచున్నవి. అనగా సంస్కారమునకు తగిన జన్మరయే గలుగుచున్నది. ఎందుకనగా స్మృతి సంస్కారములవ్వ యేకరూపములుగానే యున్నవి. దేవాదిజన్మలు

పోయి తిరుగా మానుషసంస్కారములు స్మరణరూపములై (స్మృతికి వచ్చినవై) జీవునికి మానుషదేహమునే యిచ్చుచున్నవని తాత్పర్యము. ఇదియే వ్యవహితములయిన సంస్కారములకు ఆనన్తర్యము = కార్యకారణభావము; క్రియగాని, జ్ఞానముగాని, రాగాదులుగాని యేది యయినను శక్తిరూపముగా నుండిన యది సంస్కారమగును. క్రియాసంస్కారము క్రియారూపముగను, జ్ఞానసంస్కారము స్మృతిజ్ఞానరూపముగను, రాగాదికము రాగాదిరూపముగను పరిణమించును. ఈ ప్రకార మెట్టి సంస్కారమున్నదో, అదియే స్మరణకు వచ్చుచున్నది. గాన, స్మృతిసంస్కారములు మానుషసంస్కారము మనుష్యస్మృతినే గలిగించును. ఈలాగు ననేకవిషయములై అభేదరూపములై యున్నందుచే నెంత దూరమున నున్న నెంత కాలము గడచినను సంస్కారములు సజాతీయములయిన జన్మలకు గలిగించును గాన, సంస్కారజన్మలకు కార్యకారణభావమను దగ్గఱయున్న ఆనంతర్యము సమంజసమేను. ఘటానుభవసంస్కారము ఘటానుభవజన్యస్మృతి గలిగించును గాన, వ్యవధానముండినను సంస్కారములు సజాతీయమయిన స్మరణను గలిగించి సజాతీయజన్మల నొసగును. అనగా మానవభోగసంస్కారములు దేవాదిభోగములయిన

తర్వాతను మానవజన్మనే యిచ్చుచున్నవని భావము. ఇటు లాయాసంస్కారము లూహింపవలెను.

సూ॥ తాసామనాదిత్వం చాశిషో నిత్యత్వాత్ ॥ 10

పద॥ తాసాం - అనాదిత్వం - చ - ఆశిషః - నిత్యత్వాత్.

అర్థము॥ ఆశిషః = నేను సదా యుండవలయునను మరణింపకుందును గాక యను ఆశీర్వాదముయొక్క (మరణభయముయొక్క) నిత్యత్వాత్ = తప్పక నిత్యముగా నుండుటవలన, తాసాం = ఆ జన్మాంతరవాసనలకు, అనాదిత్వం చ = అనాదిత్వరూపనిత్యత్వముగూడ సిద్ధించెను.

అవ॥ జన్మాంతరవాసన లేదని, తలంప సాధ్యమగాదని ప్రత్యక్షప్రమాణముతో నిరూపించుచున్నారు.

తా॥ ఆ పూర్వజన్మపరంపరాసంస్కారములకు వెంబడే ఫలము నొసగుటయను ఆనంతర్యము మాత్రముగాదు, అనాదిత్వముగూడ సిద్ధమయ్యేయున్నది. శిశువుగూడ పుట్టిన వెంబడే మరణహేతువు సంభవించిన భయపడుచున్నాడు. నేను సదా యుండ

వలయునని ప్రతిజీవియు నాశీర్వాదమును గోరుచున్నది. మరణభయము నిత్యమగుటవలన నందఱియందును ననుభూతమగుటవలన పూర్వ పూర్వ జన్మసంస్కారములు అనాదులు నిత్యములు కావున తప్పక జన్మను గలుగజేయునవిగా నున్నవి.

**సూ॥ హేతుఫలాశ్రయాలమ్బనై స్సంగృహీతత్వాదేషామభావే తదభావః ॥ 11**

పద॥ హేతుఫలాశ్రయాలమ్బనైః - సంగృహీతత్వాత్ - ఏషాం - అభావే - తదభావః.

అర్థము॥ హేతుఫలాశ్రయాలమ్బనైః - హేతు = క్లేశకర్మలు, కారణములు, ఫల = జాత్యాయుర్భోగములు, ఆశ్రయ = ఆశ్రయమగు చిత్తము, ఆలమ్బనైః = శబ్దాది ఆధారములు వీనిచే, సంగృహీతత్వాత్ = వాసనలు బాగుగా గ్రహింపబడినవి గావున (హేతుఫలాదులతోగూడి వాసనలుపుట్టి విజృంభించుచున్నవని అర్థము), ఏషాం = ఈ హేతు ఫలాదులయొక్క, అభావే సతి = ఆత్మవివేక

ముచే నాశము గలుగగా, తదభావః = తత్ = ఆ కార్యములయిన వాసనల యొక్క, అభావః = నాశము గలుగుచున్నది.

అవ॥ వాసన లనాదులని వాని నాశము సంభవింపదని శంకింపవలదని తెలుపుచున్నారు.

తా॥ జన్మపరంపరలనే వాసితములయిన సంస్కారజాలములు పురుషుడగు నాత్మవలె నిత్యములుగావు. జన్మలతోపాటు ప్రవాహకార్యరూపముగా ప్రవర్తితము లగుచున్నవని తెలియవలయును. వాసనలకు కారణములయినవి నశించగానే సంస్కారములు గూడ నశించును. దానినే వివరించుచున్నారు. పూర్వపూర్వ సంస్కారలక్షణమైన అవిద్య అస్మితయను నహంకారమును గలిగించుచున్నది. ఆ యహంకారము నేను మనుష్యుడను, నాకు నిది యిష్టము, నాకిది యనిష్టమను భ్రాంతిని పుట్టించుచున్నది. ఆ భ్రమ తిరుగా రాగద్వేషాదులను కల్పించుచున్నది. ఆ రాగద్వేషాదులు అప్రియుని తిరస్కరించుటయును, ప్రియుని చేపట్టుటయును నను ధర్మాధర్మములు కారణము లగుచున్నవి. మగల ఆ పుణ్యపాపములు సుఖదుఃఖాద్యనుభవమునకు హేతువులగుచున్నవి. ఇకను నా భోగము (అనుభవము) వాసనలను కలిగించుచునే యున్నది. ఈ ప్రకారము సంస్కారము

లనాదులై అనాదిసంసారచక్రమును నిరంతరము త్రిప్పుచునే యున్నవి. ఆ సంసారము లకు, క్లేశకర్మలు (అవిద్యాది కృష్ణకర్మలు) కారణములు, జాత్యాయుర్భోగములు, ఫలిత ములు, చిత్తము, ఆశ్రయము, శబ్దాది విషయములు ఆలంబనములు. అనగా అనాది సంస్కారములు అవిద్యాదిక్లేశములచే పుట్టుచున్నవై చిత్తమందున్నవియై జాత్యాయు ర్భోగఫలముల నీయుచు, శబ్దాదివిషయముల నాధారము జేసికొని విజృంభించుచున్నవి. క్షణక్షణము వృద్ధిని పొందుచునే యున్నవి. కావున కారణములగు హేతు, ఫల, ఆశ్రయ, ఆలంబనములయొక్క నాశము ఆత్మజ్ఞానముచే గలుగగా, కార్యములయిన సంస్కారములుగూడ మటుమాయములగుచున్నవని తాత్పర్యము.

సూ॥ అతీతానాగతం స్వరూపతోఽస్త్యధ్వభేదాద్ధర్మాణాం ॥ 12

పద॥ అతీతానాగతం – స్వరూపతః – అస్తి – అధ్వభేదాత్ – ధర్మాణాం.

అర్థము॥ ధర్మాణాం = అతీత అనాగత వర్తమాన (భూత భవిష్యత్ వర్తమాన) ధర్మము లకు, అధ్వభేదాత్ = కాలభేద ముండుటవలన, అతీతానాగతం = భూత భవిష్యత్కాలీన ధర్మసమూహము, స్వరూపతః = శక్తిరూపమున, అస్తి =

ధర్మియందున్నది (త్రికాలములయందును వాసనారూప ధర్మములు చిత్తమను ధర్మి నాశ్రయించియున్నవి. అందులో గడించినవి అతీతములు, రాబోవునవి అగాములు. ఇవి శక్తిరూపము గానుండి అవసరమువచ్చునప్పు డాయా కారణములచే వాసన లభివ్యక్తము లగుచున్నవి. ఇవి వర్తమానములని భావము.)

అవ॥ సంస్కారముల నాశవిషయ మిప్పుడు చర్చనీయముకాదు. ముందు వాసనల యుత్పత్తివిషయము విచారింపదగియున్నది. వాసనలు లేనివయ్యే కలుగుచున్నవా? సత్తై (యుండియే) పుట్టుచున్నవా? వాసనల యుత్పత్తియనగా నేమిటో యీ విషయములు ప్రస్తుతము విమర్శపథగాములై యున్నవి. అభావమైన కుందేటికొమ్ముయొక్క స్థితి సంభవించనటుల, అభావములయిన సంస్కారముల నుత్పత్తి సంభవించదు. ఉన్నవి పుట్టుచున్నవందుమా? చిద్రూప ఆత్మశక్తి వినా సర్వకాలములయందు సత్స్వరూపము మరియొకటిలేదు. ఏదియున్నదో అది ఉత్పత్తినాశములు లేనిదని శాస్త్రసిద్ధాంతము. కావున నీప్రకారమునను వాసనలకు ఉత్పత్తి వచోఘటితి కుదురదు. ఇన్ని కారణములచే స్వప్రకృతియందు శక్తి

రూపము గానున్న వాసనలయొక్క అభివ్యక్తికి (ప్రకటన) రూపమే ఉత్పత్తియని పరిభాషితము. దానినే యీ సూత్రమున వివరించుచున్నారు.

తా॥ ధర్మియందు వాసనారూపధర్మములు అతీతానాగతములై శక్తిరూపమున నున్నవి. కావుననే అవి అభివ్యక్తములగుచున్నవి. వాసనా ఉత్పత్తియు ఇదియే. అటులయిన వాసనాసమూహబంధము సర్వదా యుండిన తత్త్వజ్ఞాన మెటుల గలుగును. దానిచే ప్రయోజన మేమని శంకింప నవసరము లేదు. ఆ వాసనలు భూత భవిష్యత్ వర్తమానకాల భేదములచే త్రివిధరూపములుగా నున్నవి. వాసనాబంధమనగా = వర్తమానకాలమున దుఃఖాదినానావిధ వాసనాబలిమిచే చిత్రమై విజృంభణాధికారముతోగూడి సంఖ్యాతీత పరిణామము నొందుచు నున్నచిత్తము సుఖదుఃఖాద్యనుభవమునకు గురియగుటయే బంధము, తత్త్వజ్ఞానముచే చిత్తము నిర్వికారమై భోగమునకు యోగ్యము గానిదగుచున్నది. ఇది వాసనలకు నతీతకాలము, కేవలము వ్యవహరింప యోగ్యముగా చిత్తమున్నను, నిక నాగామి సంస్కారబీజ మంకురింప శక్తి లేనిదిగా, తాను జేయవలసినది ముగిసిన దగుటచే కృతార్థుడైన యోగి తిరుగా జన్మింప నేరడు. ఇది వాసనలయొక్క అనాగత

కాలము. ఈ ప్రకార మాయావాసనలు తత్త్వజ్ఞానముచే త్రికాలములయందును నశించి పోవుచున్నవి. అందుచే ఆ యోగి జీవన్ముక్తు డనబడుచున్నాడు.

సూ॥ తే వ్యక్తసూక్ష్మా గుణాత్మానః ॥ 13

పద॥ తే - వ్యక్తసూక్ష్మాః - గుణాత్మానః.

అర్థము॥ వ్యక్తసూక్ష్మాః - వ్యక్తా = వర్తమానములగుటచే ప్రకటము లయినవియు,
సూక్ష్మాః = భూత భవిష్యత్కాలీనము లగుటచే వ్యక్తములు గానివియు నయిన,
తే = ఆ వాసనారూపధర్మములు, గుణాత్మానః = సత్త్వ రజ స్తమోగుణ
స్వరూపములు.

అవ॥ ఆ వాసనారూపధర్మముల స్వరూపమును నిరూపించుచున్నారు.

తా॥ ఆ వాసనారూప ధర్మములు వర్తమానకాలీనము లయినచో వ్యక్తములనియు, భూత భవిష్యత్కాలీనము లయినచో వ్యక్తములు గానివి సూక్ష్మములనియు చెప్పబడు చున్నవి. ఆ ధర్మములు త్రిగుణాత్మిక ప్రకృతివలన జనించినందుచే సత్త్వ రజ స్తమో గుణరూపములై యున్నవి. కాబట్టి అతీతానాగత వర్తమాన కాలీనములయిన మహదాది

ఘుటాది విశేష పర్యన్త పదార్థములు త్రిగుణస్వరూపములై యున్నవి.

14

## సూ॥ పరిణామైకత్వాద్వస్తుతత్త్వమ్ ॥

పద॥ పరిణామైకత్వాత్ - వస్తుతత్త్వం.

అర్థము॥ పరిణామైకత్వాత్ - పరిణామ - అనేక ధర్మములను, త్రిగుణములకును పరిణామములయొక్క, ఏకత్వాత్ - ఏకత్వమువలన (వస్తువు లనేకములయినను గుణములు మూడైనను వానన్నింటియొక్క పరిణామము ఒకటేయగుటవలన), వస్తుతత్త్వం - వస్తు = మహదాదులను, తత్త్వం = ప్రత్యేకముగా ఏకత్వవ్యవహారము, (యుజ్యతే = తగియున్నది).

అవ॥ మహదాది తత్త్వములు మూడు గుణములయొక్క పరిణామముచే నేర్పడినవి. అందుచే కారణములయిన గుణములు మూడైనప్పుడు వాని పరిణామములుగూడ మూడు కావలసియుండగా, మహదాది తత్త్వములు ప్రత్యేకముగా నిది మహత్తు, యిది యహంకారము అని యేకత్వవ్యవహారము గలుగదను శంకను నిరాకరించుచున్నారు.

శం॥ లోకమందు వస్తువు లనేకములుండినను వాని పరిణామము ఒకటిగానే గనబడుచున్నదిగదా? తైలము, వత్తి, అగ్ని యనెడి మూడు వస్తువులయొక్క పరిణామము ప్రదీపమై యున్నది. కావున అనేక వస్తువులయొక్క పరిణామమునకు యేకత్వము యుక్తముగానే యున్నది. అటులయినచో మట్టి, బంగారము, క్షీరము వీని మూటికి నొకే పరిణామము చెప్పవచ్చునని ప్రశ్నింపవలదు. అంగాంగిభావము గలవానికే పరిణామము చెప్పవలయును గాన పైన కనబడిన మృత్సువర్ణాదులకు పరిణామైకత్వము సంభవించదు. కావున త్రిగుణములున్న అంగాంగిభావముతో నున్నందున కారణభూతగుణములు వేరుగా నున్నను, వాని పరిణామ మొకేవిధముగుటచే మహదాది వస్తువులకు ప్రత్యేకమేకత్వ వ్యవహారము యుక్తమేను.

సూ॥ వస్తుసామ్యేఽపి చిత్తభేదాత్తయోర్విభక్తః పన్థాః ॥ 15

పద॥ వస్తుసామ్యే - అపి - చిత్తభేదాత్ - తయోః - విభక్తః - పన్థాః.

అర్థము॥ వస్తుసామ్యే అపి = వస్తువునందు యేకత్వరూపసామ్యమున్నను (అర్థాత్ వస్తువొకటే యయినను), చిత్తభేదాత్ = విజ్ఞానరూప చిత్తములయొక్క భేదము

వలన, తయోః = అచిత్తవస్తువులకు, విభక్తః = భిన్నమయిన, పన్థాః = మార్గము (యుండనే యున్నది).

అవ॥ క్షణికమై విజ్ఞానస్వరూపమైన చిత్తముకన్న వేరగు వస్తువులేదు. అనగా విజ్ఞాన స్వరూపచిత్తమే సకలవస్తుస్వరూపముగా నున్నది. కావున చిత్తము వేరు, వస్తువు వేరు అనుట తగదను పక్షమును నిరాకరించుచున్నారు.

తా॥ వస్తువు, చిత్తము వేరుగానున్నవి. వస్తువొకటేయైనను క్షణిక విజ్ఞానాత్మక చిత్తము లనేకములుగానున్నవి. ఒక స్త్రీయందు భర్తకు సుఖస్వరూప విజ్ఞానాత్మక చిత్తము, సవతికి దుఃఖవిజ్ఞానము. ఆ స్త్రీ లభించనందుచే కాముకునకు మోహాత్మక విషాదవిజ్ఞానము. విరక్తునికి నుపేక్షావిజ్ఞానము. ఈలాగు నొకే స్త్రీపిండమందు వారి వారికి తగినట్లుగా ననేకవిజ్ఞానములు గలుగుచున్నవి. అందరికిని "యా త్వయా దృష్టా సా మయాఽపి దృష్టా" = ఎవతె నీచే చూడబడెనో అదే నాచే చూడబడెను అను ప్రత్యభిజ్ఞానము అబాధితముగా గలుగుటచేతను స్త్రీరూపవ్యక్తి ఒకటేయైనను విజ్ఞానములు అనేకములుగా నున్నందున యిట్టి చిత్తభేదములచే వస్తువు వేరు, విజ్ఞానము వేరని

తెలియవలయును. కావున సమస్తవస్తువులు విజ్ఞానచిత్త స్వరూపము కావు. మరేమనిన విజ్ఞానచిత్తముకంటే భిన్నమైన సమస్తవస్తుసముదాయము గుణక్రియ పరిణామరూపమై యున్నది.

**సూ॥ న చైకచిత్తతంత్రం వస్తు తదప్రమాణకం తదా కిం స్యాత్॥**

పద॥ న - చ - ఏకచిత్తతంత్రం - వస్తు - తత్ - అప్రమాణకం - తదా - కిం - స్యాత్.

అర్థము॥ వస్తు = ఘటవస్తువు (కుండ), ఏకచిత్తతంత్రం యది - ఏకచిత్త = ఒకే మనస్సునకు, తంత్రం యది = స్వాధీనమైనచో (ఒకే మనస్సుచేత గ్రహింపబడినచో), తదా = అదే మనస్సు వస్త్రాదులను గ్రహింప ప్రవర్తించగా, తత్ = అప్పుడు చిత్తగ్రహణములేని ఘటవస్తువు, అప్రమాణకం కిం స్యాత్ = ప్రమాణరహితమగునా, న చ = కానేకాదు.

అవ॥ విజ్ఞానము వేరు, విజ్ఞానాత్మకచిత్తము వేరు, తద్గ్రాహ్యమగు ఘటాది వస్తువు వేరు (గ్రహణ గ్రాహ్యములు వేరగుటచే) అగుగాక. ఆ వస్తువంతయును నేకవిజ్ఞాన చిత్తా

ధీనమేకదా; అనగా ఏకచిత్తముచేతనే సమస్తము గ్రహింపబడుటచే సర్వవస్తు సముదాయము చిత్తమునకు లోబడినదే యని చెప్ప సాధ్యముకాదను విషయమును నిరూపించుచున్నారు.

తా॥ ఘటవస్తువు (కుండ) చిత్తముచే గ్రహింపబడుచున్నది. అదే సమయమున ఆ చిత్తమే వస్త్రాదులను గ్రహించునప్పుడు చిత్తముచే విడువబడిన ఆ ఘటవస్తువు అప్రమాణము కాదు. చిత్తముచేత గ్రహింపబడినదే ప్రమాణమనిన చిత్తాతిరిక్తమైన వస్తువు ప్రమాణము కాదని వచింప యుక్తముకాదు. అటుల మాసమ్మతమనియు అనుట సుతరాం సమంజసముగాదు. ఘటమునుండి దూరమైన చిత్తము తిరుగా ఘటమును చూడగానే 'అదే యీ ఘటము' అని అబాధితప్రత్యభిజ్ఞానము, ప్రత్యభిజ్ఞానము కలుగుచున్నది. ఒకవేళ వీనియొక్క చిత్తము ఘటాదుల గ్రహింపకపోయినను జనసామాన్యచిత్తము ఆ ఘటాదులను చూడనే చూచుచున్నది. కావున సమస్తము యొక చిత్తగ్రాహ్యమనుట తగదు. కావున వస్తువంతయును చిత్తమునకు లోబడక అతిరిక్తమై, స్వతంత్రమై ఉన్నదనుట సిద్ధమాయెను.

సూ॥ తదుపరాగాపేక్షిత్వాచ్చిత్తస్య వస్తు జ్ఞాతాజ్ఞాతమ్ ॥ 17

పద॥ తదుపరాగాపేక్షిత్వాత్ - చిత్తస్య - వస్తు - జ్ఞాతాజ్ఞాతం.

అర్థము॥ చిత్తస్య = చిత్తము, తదుపరాగాపేక్షిత్వాత్ - తత్ = ఆ వస్తువుయొక్క, ఉపరాగ = సమ్బన్ధమును, అపేక్షిత్వాత్ = అపేక్షించుటవలన, వస్తు = వస్తువు, జ్ఞాతాజ్ఞాతం - జ్ఞాత = తెలియబడినదిగను, అజ్ఞాతం = తెలియబడనిదిగను అగుచున్నది.

అవ॥ చిత్త మహంకారమునకు సమ్బన్ధించియున్నందున (అహంకారమనగా ఈ సమస్తము నేను తెలియుచున్నానను జ్ఞానము, అట్టి యహంకారరూపము చిత్తము గానున్నది. అందువలన) సర్వగతముగను (అన్నిటియందును నున్నది) కావున చిత్తము సర్వదా జ్ఞాతృరూపమై సమస్తమును తెలియుచున్నదిగదా యనిన నది సంభవింపదని తెలుపుచున్నారు.

తా॥ చిత్తము సర్వత్రయున్నను నన్ని శరీరములందు నుంటున్నను, నేశరీరమం దాచిత్తము వ్యాపారశీలమై యున్నదో, అ శరీరమునకు (ఇంద్రియాదులకు) నేవస్తువుతో

సంబంధమున్నదో, ఆ వస్తువుయొక్క జ్ఞానము గలుగుచున్నది. ఇతరవస్తుజ్ఞానము గలుగదు. అనగా చిత్తము ఇంద్రియములతో గూడుకొని యే వస్తువుతో సంబద్ధమగునో, తద్వస్తు విషయక జ్ఞాన మాదయమగుచున్నది. చిత్త మేవస్తువుతో సంబంధించియున్నదో, ఆ వస్తువే జ్ఞాతమగుచున్నది (తెలియబడుచున్నది). ఏ వస్తువు చిత్తోపరక్తము - చిత్త సంబంధముగలది గాదో, ఆ వస్తువు అజ్ఞాతమగుచున్నది (తెలియబడుటలేదు). ఈ ప్రకారము చిత్తము పరిణమించు స్వభావము గలదిగా నున్నందుచే వస్తువొకప్పుడు తెలియబడుటయు, తెలియబడకుండుటయు జరుగుచున్నది. అందువలన చిత్తము సదా అన్నింటిని తెలియుటలేదు. మఱియు చిత్తము పరిణామి అను విషయ మనుమానప్రమాణసిద్ధమై యున్నది.

"చిత్తం పరిణామి జ్ఞాతాజ్ఞాతవిషయత్వాత్ శ్రోత్రాదివత్"

చిత్తము సదా పరిణమించు స్వభావముగలది; తెలియబడిన తెలియబడని విషయము గలదగుటచేత శ్రోత్రాదీన్ద్రియములవలె. ఇది అనుమానప్రమాణము. దీనిని పైన తెలిపియేయున్నారు. కనుక చిత్తము పరిణామశీలము. సమస్తము నొకేసారి గ్రహింపజాలదు,

సూ॥ సదా జ్ఞాతాశ్చిత్తవృత్తయస్తత్ప్రభోః పురుషస్యాపరిణామాత్॥

పద॥ సదా - జ్ఞాతాః - చిత్తవృత్తయః - తత్ప్రభోః - పురుషస్య - అపరిణామాత్.

అర్థము॥ తత్ప్రభోః - తత్ = ఆ చిత్తమునకు, ప్రభోః = నియామకుడైన, పురుషస్య = ఆత్మపురుషునకు, అపరిణామాత్ = పరిణామము (మారుట) లేకపోవుటవలన, చిత్తవృత్తయః = మనోవ్యాపారములు, సదా = ఎల్లప్పుడు, జ్ఞాతాః = జ్ఞాతము లగును (తెలియబడును);

అవ॥ చిత్తమువలె నాత్మయును కొన్నిటిని తెలియుచున్నది, కొన్నిటిని తెలియుటలేదు. కావున పరిణామి (మారుచున్నది) అని వచింప సాధ్యముగాదని తెలుపుచున్నారు.

తా॥ ఆత్మ చిత్తమునుగూడ తెలియుచున్నది. అంతమాత్రమే గాక మనస్సును అన్ని విషయములలోను నియమించుచున్నది. వస్తువు లొకప్పుడు తెలియబడుటయును, తెలియబడకుండుటయును చిత్తము యొక్క వికాస సంకోచావస్థలచే గలుగుచున్నవి. ఆత్మకైనా చిత్తముయొక్క జ్ఞాతాజ్ఞాతధర్మములను వికసిత ముకుళితావస్థలను తెలియు

చున్నది. చిత్తమునకు ప్రభువైయున్నది, ఆత్మ సదా జ్ఞాతృరూపమైయున్నది. ఆ ఆత్మ సర్వకాల సర్వావస్థలయందు ఏవికారములు, యే మార్పులు లేనిదగుటచే పరిణామరహితమైనది, అపరిణామి, నిర్వికారి. ఆత్మ అపరిణామి గనుకనే చిత్తవృత్తుల సదా తెలియుచున్నది. ఆత్మ పరిణామి యయినచో పరిణామము ఒకప్పుడు సంభవించును, సంభవింపకపోవును. అందుచే చిత్తవృత్తులు సదా తెలియబడవు. చిత్తవృత్తులు సదా తెలియబడుట అనుభవసిద్ధమైయున్నది.' అందుచే ఆత్మ అపరిణామియని సిద్ధించెను. ఇందులకు అనుమానప్రమాణము: 'పురుషః అపరిణామీ సదా జ్ఞాతృత్వాత్ న యదేవం న తదేవం యథా చిత్తం' = ఆత్మ పరిణామి గాదు. ఎల్లపుడు సమస్తమును తెలియుటచే జ్ఞాతృరూపమయిన దగుటవలన ఏది యపరిణామి గాదో, అది జ్ఞాతృరూపము గాదు; ఎటులనగా చిత్తమువలె. ఈ అనుమానప్రమాణముచే ఆత్మ పరిణామరహితమైనది. అందుచే సమస్తము నెఱుంగుచున్నది. చిత్తము పరిణామశీలము. అందుచే సమస్తము నెఱుంగుటలేదని సిద్ధమయినది.

సూ॥ న తత్స్వాభాసం దృశ్యత్వాత్ ॥ 19

పద॥ న - తత్ - స్వాభాసం - దృశ్యత్వాత్.

అర్థము॥ తత్ = ఆ చిత్తము, దృశ్యత్వాత్ = దృశ్యమగుటవలన (ద్రష్టగు ఆత్మచే చూడబడుటవలన), స్వాభాసం న = స్వయంప్రకాశమానము గాదు (అటులనే పరప్రకాశము గాదు).

అవ॥ క్షణికవిజ్ఞానరూపమై చిత్తము తాను ప్రకాశశీలమై పరప్రకాశమగుగాక, ఆత్మపురుషునిచే ప్రకాశింపజనమేమని సందేహింపదగదని తెలుపుచున్నారు.

తా॥ "ఘటోఽయం రూపవాన్" = ఈ ఘటము కంబుగ్రీవాద్యాకారముగలది అను విధమున ఘటము (కుండ) తనకంటే వేరైనందుచే దృశ్యముగానున్నది. అటులనే "నేను సుఖిని, నేను దుఃఖిని, క్రుద్ధుడను, నా మనస్సు శాంతించినది" ఇట్టి వ్యవహారము లనుభవసిద్ధమై యున్నందుచే చిత్తము దృశ్యమయ్యేయున్నది. అందుచే మనస్సు ఘటాదులవలె జడము. స్వయంప్రకాశమానము గాదు. అంతియేకాదు పరప్రకాశము (ఇతరవస్తువులను ప్రకాశింపజేయునది) కాదు. చిత్తముకన్న వేరుగానున్న పదార్థముల తెలిసికొను క్షణికవిజ్ఞానము చిత్తము గాదు. ఎందుకనగా దానికన్న విలక్షణమై

("సో౽హం" = ఆ పరమాత్మయే నేను అని) ప్రత్యభిజ్ఞానముచే (స్మృతి జ్ఞానముచే) ఆత్మవస్తువు సర్వదా సిద్ధమయ్యేయున్నది. ఈ రీతిగా నాత్మయే సమస్తమును తెలియుచున్నదనియు, తదితర చిత్తబుద్ధ్యాదులుగూడ జడములనియు తెలియవలయును.

## సూ॥ ఏకసమయే చోభయానవధారణమ్ ॥ 20

పద॥ ఏకసమయే - చ - ఉభయానవధారణం.

అర్థము॥ ఏకసమయే చ = ఒకే కాలముననే, ఉభయానవధారణం - ఉభయ = విషయము తన స్వరూపము ఈ రెంటియొక్క, అనవధారణం = గ్రహింపకుండుట (చిత్తమునకు సిద్ధము).

అవ॥ చిత్త మెప్పటికిని స్వపరావభాసకము (తాను ప్రకాశించి యితరమును ప్రకాశింప జేయునది) కాదు. చిత్తము స్వపరప్రకాశకమని అంగీకరించు విషయమున మఱియొక దోషమును చూపుచున్నారు.

తా॥ చిత్తము స్వపరావభాసకమని (తన స్వరూపమును తెలిసి యితరవస్తువును తెలియుచున్నదని) వచించుటయు నొకే కాలమున రెంటిని గ్రహించుశక్తి చిత్తమునకు

లేనందున పొసగదు. ఎందుకనగా చిత్తము అర్థమును (వస్తువును) గ్రహించునప్పుడు చిత్తము జనకముగను, దానిచే వర్థము గ్రాహ్యమగుటచే అర్థము జన్యముగను నున్నది. ఈ ప్రకారము చిత్తార్థముల రెంటికిని జన్యజనక భావ మున్నందుచే చిత్తము స్వావభాసకము. తనను విషయము జేయుచున్నదని చెప్పునప్పు డాసమయమున చిత్తమునను సర్థస్ఫూర్తి గాదు. చిత్తము పరావభాసకము = అర్థమును విషయీకరించుచున్నది అని చెప్పుట ఆ సమయమున స్వరూపస్ఫూర్తిగాదు. ఇటుల చిత్తక్షణమందు నర్థము, అర్థక్షణమందు చిత్తమున్ను లేకపోవుచున్నవి. ఓకే కాలమున రెండును (చిత్తార్థములు) లేనందుచే ఆ స్వస్వరూప విషయములయొక్క యనుభవ మొకేకాలమందు గలుగుటలేదు. చిత్తమునకును భయగ్రహణ సామర్థ్య మొకేసమయమున లేదు. కావున నా చిత్తము స్వాభాసకము పర భాసకము గాదు. అందువలన నాఆత్మవస్తువే చిత్తార్థముల రెంటిని ప్రకాశింపజేయుచున్నది గాన అదియే స్వపరభాసకముగా నున్నదని సిద్ధాంత తాత్పర్యము.

**సూ॥ చిత్తాన్తరదృశ్యత్వే బుద్ధిబుద్ధేరతిప్రసంగః స్మృతిసంకరశ్చ॥**

**పద॥ చిత్తాన్తరదృశ్యత్వే – బుద్ధిబుద్ధేః – అతిప్రసంగః – స్మృతిసంకరః – చ.**

అర్థము॥ చిత్తాన్తరదృశ్యత్వే - చిత్తాన్తర = ఇతర చిత్తములచేత, దృశ్యత్వే = చూడదగియుండుట సంభవించగా, బుద్ధిబుద్ధేః = గ్రహించునట్టి బుద్ధికంటే బుద్ధికి, అతిప్రసంగః = అనవస్థాదోషము, స్మృతిసంకరశ్చ = స్మృతిజ్ఞానములకు సాంకర్యమున్ను గలుగును.

అవ॥ చిత్తము ప్రకాశించునది గాకుండుగాక; చిత్తము మఱియొక చిత్తముచే గ్రహింపబడుననియు ప్రకాశింపబడుననియు చెప్పవచ్చునుగదా, ఆత్మపురుషునితో ప్రయోజనము లేదుగదా, అని వచించుట సమంజసము గాదని తెలుపుచున్నారు.

తా॥ నీలాదుల నొక చిత్తము గోచరించుచున్నది. అట్టి చిత్తము మఱియొక చిత్తముచే చూడబడుచున్నది. మొదటి చిత్తమునకు ప్రకాశకము ద్వితీయ చిత్తమగును. చిత్తమును గోచరించు ద్వితీయచిత్తము బుద్ధ్యాత్మకచిత్తముతో చూడబడుచున్నది. అదియు మఱియొక బుద్ధితో చూడబడుచున్నది. ఈ ప్రకారము బుద్ధి మఱియొక బుద్ధి, దానిని మఱియొకటి యను అతిప్రసంగరూపదోషము (అనవస్థాదోషము) గలుగుచున్నది. సంకల్పములను మఱియొక సంకల్పశక్తిచే తెలియుచున్నాము. అశుద్ధసంకల్పములను శుద్ధసంక

ల్పములచే తెలియుచున్నాగము. ఇటుల విచారించుచుపోయిన, బుద్ధ్యాదులన్నియు జడ మౌతే. ఆత్మ యొకటియే చైతన్యరూపము, అదియే సమస్తమును తెలియుచున్నది. చిత్తము లనేకములు లేవు. ఒకే చిత్తమున్నది. అనేక చిత్తము లంగీకరించినచో ననేక చిత్తానుభవములచే ననేకస్మృతులు గలిగి ఆ స్మరణములకన్నిటికి సాంకర్య మేర్పడును. ఈ చిత్తముచే నీ యనుభవజ్ఞానము గలిగినది; ఇది స్మరణము వచ్చినదని తెలియ సాధ్యము కాదు. కావున నొకే చిత్తము ఆత్మకు ద్వారముగా నున్నది. అంతమాత్రమేను. అయినను నట్టి చిత్తమును నా ఆత్మ తెలియుచున్నది గాన చిత్తము సాక్షియగు ఆత్మచే భాస్యము గాను, ప్రకాశ్యముగాను, ఆత్మప్రకాశకము గాను నున్నది. చిత్తాదిప్రపంచమంతయు సాక్షిభాస్యమని యీలాగున తెలియవలయును.

సూ॥ చితేరప్రతిసంక్రమాయా స్తదాకారాపత్తౌ స్వబుద్ధిసంవేదనం॥

పద॥ చితేః - అప్రతిసంక్రమాయాః - తదాకారాపత్తౌ - స్వబుద్ధిసంవేదనం.

అర్థము॥ అప్రతిసంక్రమాయాః = బుద్ధికి ఘటాదుల సంబంధమువలె దేనిసమ్బంధము లేని, చితేః = ఆత్మకు, తదాకారాపత్తౌ - తత్ = ఆత్మ ప్రతిబింబముతో గూడిన

బుద్ధియందు, ఆకారతా = ఆకారత్వముయొక్క (ఆకారముండుటయొక్క), ఆపత్తౌ సత్యాం = ప్రాప్తి గలుగగా, స్వబుద్ధిసంవేదనం - స్వ = తనకు (ఆత్మకు), బుద్ధి = భోగ్యమగు బుద్ధియొక్క, సంవేదనం = సమ్యక్ జ్ఞానము గలుగును.

అవ॥ ఆత్మ కూటస్థమై, నిత్యమై, అసంగమై యుండునది. ఆత్మ సంబంధములేక నేదియును తెలియబడుట గానుపించుటలేదు. కావున నట్టి నిర్వ్యాపారాత్మకును, చిత్తమునకును వ్యాపారసంబంధము కుదరదు గాన నాత్మభాస్యము (ఆత్మచే ప్రకాశింపదగినది) చిత్తము అనునది సంభవించదని తలంపవలదని నిరూపించుచున్నారు.

తా॥ బుద్ధి పరిణామశీలమయినందుచే దానికి ఘటాది పదార్థములతో సమ్బన్ధముండువిధమున పరిణామరహితమగు నాత్మకు దేనితోను సంబంధములేదు. ఆత్మ నిత్యము, కూటస్థము, అసంగము అయినచో పదార్థజ్ఞాన మెటుల గలుగును? ఆత్మబుద్ధి నెటుల తెలియుచున్నదని సంశయింపదగదు. సూర్యుడు జలమందు ప్రతిఫలించు విధమున అసంగ చిద్రూపాత్మయు శుద్ధబుద్ధియందు ఫలించుచున్నది. బుద్ధి చిద్రూపాకారమును పొందుచున్నది. అప్పుడు బుద్ధి చిత్తుతో గూడినదగుచున్నది. ఆత్మ భోగ్యమయిన బుద్ధిని

తెలియుచున్నాడు. ఈ ప్రకారముగా చిత్తుతోగూడిన బుద్ధియే ఆత్మాభ్యాసముగుచున్నది.

23 సూ॥ ద్రష్టృదృశ్యోపరక్తం చిత్తం సర్వార్థమ్ ॥

పద॥ ద్రష్టృదృశ్యోపరక్తం - చిత్తం - సర్వార్థం.

అర్థము॥ సర్వార్థం - సర్వ = ద్రష్టగను దృశ్యముగను నయిన, అర్థం = విషయముగల ద్రష్ట దృశ్యపదార్థములున్న విషయముగాగల, చిత్తం = చిత్తము, ద్రష్టృ దృశ్యోపరక్తం - ద్రష్టృ = ఆత్మతోను, దృశ్య = శబ్దాది దృశ్యవిషయములతోను, ఉపరక్తం = సంబంధించినదిగా (నగుచున్నది.)

అవ॥ కొందరికి చిత్తమే చిదాత్మయని భ్రమ గలుగుచున్నది. ఆ భ్రమకారణమును తెలుపుచు భ్రమను నివర్తించుచున్నారు.

తా॥ చిత్తము ద్రష్టయగు నాత్మను, శబ్దాది దృశ్యపదార్థములను సకలమును గ్రహించుచున్నది. ఇట్టి సర్వార్థగ్రాహకమయిన చిత్తము చిదాత్మయొక్క సాన్నిధ్యము వలన నాత్మాకారతను పొందినదై ద్రష్టృపరక్తమయినదని చెప్పబడుచున్నది. ద్రష్టయగు నాత్మతోగూడిన చిత్తము ద్రష్టయగు నాత్మను విషయాకరించుచున్నది. ఇంద్రియా

ద్వారా దృశ్యములగు శబ్దాదులతోగూడిన చిత్తము దృశ్యోపరక్తమగుచున్నది. అనగా నిట్టి చిత్తము సకల దృశ్యపదార్థముల గోచరించుచున్నది. అనగా భోగ్యశబ్దాది ఆకారము నొంది సుఖదుఃఖాది అనుభవరూపమయిన చిత్తము దృశ్యమయినను, చిత్ప్రతిబింబముతో నభేదమువలన చిదాత్మయని భ్రమపడుచున్నారు. అవివేకులు అట్టి చిత్తమునే ఆత్మవిషయకమయినందుచే చిదాత్మయని భ్రమపడుచున్నారు. విచారించిన భోగరూపమగు చిత్తము భోగ్యమగు చిత్తము సమస్తము దృశ్యమే. కావున దృశ్యాతిరిక్తమయినది భోక్తయని, ఆత్మయని తెలియవలయు.

**సూ॥ తదసంఖ్యేయవాసనాభిశ్చిత్రమపి పరార్థం సంహత్యకారిత్వాత్॥**

పద॥ తత్ - అసంఖ్యేయవాసనాభిః - చిత్రం - అపి - పరార్థం - సంహత్యకారిత్వాత్.

అర్థము॥ తత్ = ఆ చిత్తము, అసంఖ్యేయవాసనాభిః - అసంఖ్యేయ = లెక్కించ సాధ్యముగాని, వాసనాభిః = క్లేశ కర్మ విపాక సంస్కారములచే, చిత్రమపి = సుఖాదుల కాశ్రయమైన భోక్తవలెనున్న నానావిధ చిత్తము, సంహత్యకారి

త్వాత్ = ఇంద్రియాదులతో చేరి భోగకార్యముల జేయుటవలన, పరార్థం - పర = జీవునకు, అర్థం = భోగాపవర్గ ప్రయోజనకారిగా నగుచున్నది. భోగ్యమగుచున్నదని అర్థము.

అవ॥ చిత్తముకంటె వేరగు భోక్త, ఆత్మ యున్నదని నుడువుచున్నారు.

తా॥ చిత్తము అనన్తక్లేశ కర్మ విపాక సంస్కారములతో గూడి సుఖదుఃఖాద్యాశ్రయమై నానావిధముగా ప్రవర్తించుచున్నదై అదియే సమస్తము ననుభవించుటీసన యున్నది. భోక్త భ్రాన్తిని గలుగజేయుచున్నది. వాస్తవముగా చిత్తము భోక్త గాజాలదు, భోగ్యమే. ఎందువలననగా దేహేన్ద్రియాది సహకారములతో జేరియే ప్రధానుడగు నాత్మకు భోగాపవర్గ ఫలమును సాధించుచున్నందుచే పరార్థమని (భోగ్యమని) చిత్తము చెప్పబడుచున్నది. ఏది ఇంకొకదానితో చేరి ప్రయోజనకారియగుచున్నదో, (గృహాదులు దేవదత్తుని కొరకగునటుల) నగుచుండియు పరార్థమే. అటులనే చిత్తమును నున్నది. కావున చిత్తముకన్న భిన్నమైన చిదాత్మయే భోక్త అని తెలియవలయును. ఆత్మశక్తిచేతనే చిత్తముగూడ ప్రవర్తించుచున్నదని భావము.

## సూ॥ విశేషదర్శిన ఆత్మభావభావనావినివృత్తిః ॥ 25

పద॥ విశేషదర్శినః - ఆత్మభావభావనావినివృత్తిః.

అర్థము॥ విశేషదర్శినః - విశేష = వివేకఖ్యాతిచే బుద్ధికన్న వేరైన చిన్మాత్రపురుషుడను నేనను ననుభవమును, దర్శినః = గాంచువానికి, ఆత్మభావభావనావినివృత్తిః - ఆత్మభావ = ఆత్మతత్త్వమందలి, భావనా = జిజ్ఞాసయొక్క (తెలియవలయునను వాంఛయొక్క), వినివృత్తిః = నివారణము గలుగుచున్నది.

అవ॥ ఈ ప్రకారము చిత్తప్రసంగమును పరిసమాప్తిగావించి కైవల్యమును నిరూపింప దలచి ఆ కైవల్యమునకు యోగ్యుడగు నధికారిని నిరూపించుచున్నారు.

తా॥ ముందు నిరూపింపబడిన వివేకజ్ఞానముచే బుద్ధికన్న విలక్షణుడైన చిన్మాత్ర పురుషుడను నేనని యనుభవజ్ఞానముదయముకాగా, అట్టి స్వానుభవ తత్త్వవేత్తకు నాత్మతత్త్వమెట్టిదో తెలియవలయునను కోరిక, ఆత్మతత్త్వ జిజ్ఞాస పూర్తిగా నివర్తించుచున్నది. తెలిసినవారికి తెలియవలయునని కోరిక యుండదుగదా. ఈ ప్రకారము చెప్పి

వందుచే తత్త్వానుభవమునకు ముందు తత్త్వజిజ్ఞాస యుండెనని యేర్పడుచున్నది. అందు వలన పూర్వజన్మ సుకృతపరిపాకమువలన తీవ్రతత్త్వజిజ్ఞాస గలవాడే కైవల్యజ్ఞానమున కధికారిపురుషుడని స్పష్టమాయెను.

సూ॥ తదా వివేకనిమ్నం కైవల్యప్రాగ్భారం చిత్తమ్ ॥ 26

పద॥ తదా - వివేకనిమ్నం - కైవల్యప్రాగ్భారం - చిత్తం.

అర్థము॥ తదా = చిన్మాత్రపురుషుడను నేనను విశేషజ్ఞానము గలిగిన తర్వాత, చిత్తం= నివృత్తభ్రమ గల యోగియొక్క చిత్తము, వివేకనిమ్నం = వివేకజ్ఞానమందు ఆయుక్తమైనది (కేవల జ్ఞానరూపమై), కైవల్యప్రాగ్భారం - కైవల్య = కైవల్యమే, ప్రాగ్భారం = అవధి గలదిగా (మోక్షఫలమే అంతమందు గలదిగా) నగుచున్నది.

అవ॥ తత్త్వజిజ్ఞాసచే నాత్మయే తానను స్వానుభవపూర్వక విశేషజ్ఞానము గలిగిన తర్వాత నివృత్తభ్రమ గల యోగి చిత్తముయొక్క స్థితిని జెప్పుచున్నారు.

తా॥ తత్త్వవిచారము లేనప్పుడు బుద్ధ్యాది అనాత్మపదార్థములయందు ఆత్మ భ్రాన్తి గలిగినప్పుడు మనస్సు విషయసుఖములయందు మునింగినదై సంసారఫలమునే అంతములో పొందినదిగా నుండెను. ఇప్పుడు తత్త్వవిచారముచే యోగాభ్యాససిద్ధిచే భ్రమలన్నియు నిశ్శేషముగా నశించిపోయెను. ఇట్టి తత్త్వజ్ఞానోదయము గలిగిన యోగి యొక్క చిత్తము కేవలము జ్ఞానరూపమై, వివేకజ్ఞానమందే మునింగినదై, కైవల్యము నవధి గలదిగా, అంతమున మోక్షఫలము నొసగునదిగా నున్నది. జ్ఞానయోగుల చిత్తము మోక్ష ఫలప్రదముగా నున్నదని తాత్పర్యము.

## సూ॥ తచ్ఛిద్రేషు ప్రత్యయాన్తరాణి సంస్కారేభ్యః ॥ 27

పద॥ తచ్ఛిద్రేషు - ప్రత్యయాన్తరాణి - సంస్కారేభ్యః.

అర్థము॥ సంస్కారేభ్యః = ఆత్మజ్ఞానమువలన యనుక్షణము నశించునవి, ఆత్మజ్ఞానప్రవాహము సన్నగిలినపుడు ప్రకటములయిన వ్యుత్థాన సంస్కారములనుండి, తచ్ఛిద్రేషు - తత్ = వివేకజ్ఞానముయొక్క, ఛిద్రేషు = అవకాశములయందు, ప్రత్యయాన్తరాణి = నేను నాది అను వ్యవహారజ్ఞానములు గలుగుచున్నవి.

అవ॥ ఆత్మజ్ఞానమున్నను, నేను నాది అను వ్యవహారజ్ఞానరూప వ్యుత్థానసంస్కారముల సంభవము నుడువుచున్నారు.

తా॥ ఆత్మ వివేకజ్ఞానముచే సమాధికి బహిర్ముఖములయిన వ్యుత్థాన సంస్కారములు నాశ మొందుచున్నవి. అయినను వివేకఖ్యాతి (ఆత్మజ్ఞాన) ప్రవాహము సందువడినప్పుడు నేను నాది అను వ్యవహారభూత వ్యుత్థాన సంస్కారములు బయలుపడుచున్నవి. అందుచే నితరజ్ఞానములు గలుగుచున్నవి.

28

సూ॥ హానమేషాం క్లేశవదుక్తమ్ ॥

పద॥ హానం - ఏషాం - క్లేశవత్ - ఉక్తం.

అర్థము॥ ఏషాం = ఈ వ్యుత్థాన సంస్కారములకు, హానం = నాశము, క్లేశవత్ = అవిద్యాది క్లేశములకువలె, ఉక్తం = చెప్పబడెను.

అవ॥ వ్యుత్థాన సంస్కారముల నాశప్రకారమును తెలుపుచున్నారు.

తా॥ వివేకజ్ఞానముచే సకల అవిద్యాది క్లేశములు దగ్ధములగునటుల వ్యుత్థాన

సంస్కారములుగూడ ఆత్మజ్ఞానముచే దహింపబడినవై తిరుగా నంకురింపవు. అప్పుడు నిఖిలవృత్త్యుపశమ విజ్ఞాన ముదయించుచున్నది.

**సూ॥ ప్రసంఖ్యానేఽప్యకుసీదస్య సర్వథా వివేకఖ్యాతేర్ధర్మమేఘ-స్సమాధిః ॥ 29**

పద॥ ప్రసంఖ్యానే - అపి - అకుసీదస్య - సర్వథా - వివేకఖ్యాతేః - ధర్మమేఘః - సమాధిః.

అర్థము॥ ప్రసంఖ్యానే అపి = సర్వశోకముల నశింపజేయు విశోకనామక సిద్ధిని గలుగ జేయు వివేకఖ్యాతియందును, అకుసీదస్య = విరక్తుడగు యోగికి, సర్వథా = అన్ని విధములుగా నేలాటి ప్రతిబంధములులేక, వివేకఖ్యాతేః = ఆత్మజ్ఞానానుభవమువలన, ధర్మమేఘః = పుణ్యపాపముల కతిరిక్తమైన కైవల్యఫల ధర్మమును మేఘమువలె వర్షించునందుచే ధర్మమేఘమును, సమాధిః = సమాధి సిద్ధించును.

అవ॥ ఆత్మ వివేకఖ్యాతియు, వ్యుత్థాన సంస్కార చిత్తధర్మము గనుక తన్నిరోధోపాయమును తెలుపుచున్నారు.

తా॥ సర్వశోకశూన్యమయిన మహానందమును గలుగజేయు విశోకమను సిద్ధినేయాత్మవివేకఖ్యాతి గలుగజేయునో, దానికి యోగశాస్త్రమున ప్రసంఖ్యానమని నామధేయము. సిద్ధిరూప వివేకఖ్యాతియు చిత్తధర్మమగు వ్యుత్థాన సంస్కారమె గావున దానియందును కుత్సితుడు గాని, రాగములేని విరక్తయోగివరుడు ఆత్మవివేకఖ్యాతి నిర్విఘ్నము గా సిద్ధించుచున్నందుచే, పుణ్య పాపములంటని కైవల్యధర్మమును, విజ్ఞానవృష్టి ధర్మమును మేఘమువలె సతతము వర్షించు ధర్మమేఘ సమాధిసిద్ధి నొందును. అనగా నఖండవిజ్ఞానానుభవమును నిరంతర మా యోగి పొందుచున్నాడని భావము.

30

సూ॥ తతః క్లేశకర్మనివృత్తిః ॥

పద॥ తతః - క్లేశకర్మనివృత్తిః.

అర్థము॥ తతః = ఆ ధర్మమేఘసమాధివలన, క్లేశకర్మనివృత్తిః = సంస్కారములు క్లేశములు సకలకర్మలు వీనియొక్క నివృత్తి గలుగుచున్నది.

తా॥ ఆ ధర్మమేఘసమాధిలాభమువలన నవిద్యాది క్లేశములు, వాని సంస్కారములు, ఫలములు, కర్మలు సంపూర్ణముగా నశించును.

**సూ॥ తదా సర్వావరణమలాపేతస్య జ్ఞానస్యానన్త్యాజ్జ్ఞేయమల్పం॥ 31**

పద॥ తదా - సర్వావరణమలాపేతస్య - జ్ఞానస్య - ఆనన్త్యాత్ - జ్ఞేయం - అల్పం.

**అర్థము॥** తదా = ఆ ధర్మమేఘసమాధి సిద్ధించినప్పుడు, సర్వావరణమలాపేతస్య - సర్వావరణ = విశుద్ధచిత్తము నావరించు రజోగుణ తమోగుణ రూపములయిన, మల = మలములచే, అపేతస్య = శూన్యమయిన, జ్ఞానస్య = విశుద్ధజ్ఞానము యొక్క, ఆనన్త్యాత్ = అనన్తత్వమువలన, జ్ఞేయం = తెలియదగిన దృశ్యమంతయు, అల్పం = కొద్దిపాటిదగును.

తా॥ ఆ ధర్మమేఘసమాధి నిరన్తరాయముగా సిద్ధించగానే సర్వదా విశుద్ధబుద్ధిని (బ్రహ్మజ్ఞాన యోగ్యమయినదానిని) కప్పియుండు రజస్తమోమయ మాలిన్యములన్నియు క్షణములో నిశ్శేషముగ నశించి అనన్తమైన విశుద్ధజ్ఞానము యోగివరునకు గలుగుచున్నది. అందుచే నీ జగత్తంతయు తుచ్ఛమై, ఆకాశమున మిణుగురుపురుగువలె భాసించుచున్నది. అట్టి యోగివరుని విజ్ఞానమఖండమై ప్రకాశించునని భావము.

సూ॥ తతః కృతార్థానాం పరిణామక్రమసమాప్తిర్గుణానామ్ ॥ ౩౨

పద॥ తతః - కృతార్థానాం - పరిణామక్రమసమాప్తిః - గుణానాం.

అర్థము॥ తతః = ఆ ధర్మమేఘసమాధికి ఫలమైన అనన్త విజ్ఞానమువలన, కృతార్థానాం = పురుషునికి భోగమోక్షరూప అర్థమును గలిగించినందుచే కృతార్థములయిన, గుణానాం = సత్త్వరజస్తమోగుణములయొక్క, పరిణామక్రమసమాప్తిః - పరిణామక్రమ = మహదాద్యహంకారములుగా పరిణమించు క్రమమునకు, సమాప్తిః = సంపూర్తి (ముగింపు) గలుగుచున్నది.

తా॥ ఆ ధర్మమేఘసమాధిచే పరవైరాగ్యము (త్రిగుణములయందును ఆసక్తి లేకుండుట) గలిగి అనన్తముగా విశుద్ధవిజ్ఞానోదయము గలుగుచున్నది. అట్టి పరిపూర్ణావస్థయందు వివేకఖ్యాతియొక్క అభ్యాసము పూర్తియగుచున్నది. అప్పుడు సత్త్వాది గుణములు మహదహంకారాది పరిణామములను జెందక పురుషార్థములయిన భోగమోక్షములనొసగినందుచే కృతార్థములగుచున్నవి. అనగా త్రిగుణాతీతస్థితిని పొందుచున్నాడని భావము.

సూ॥ క్షణప్రతియోగీ పరిణామాపరాన్త నిర్గ్రాహ్యః క్రమః ॥ 33

పద॥ క్షణప్రతియోగీ - పరిణామాపరాన్తనిర్గ్రాహ్యః - క్రమః.

అర్థము॥ క్షణప్రతియోగీ - క్షణ = పూర్వక్షణము కడపటిదియగు ఉత్తరక్షణమున్న నిరూపకములుగా గల, క్రమః = క్షణికపరిణామము, పరిణామాపరాన్త నిర్గ్రాహ్యః - పరిణామ = పిణ్డ ఘట కపాల చూర్ణకణములను పరిణామములలో, అపరాన్త = కడపటిదియగు కణపరిణామముచే, నిర్గ్రాహ్యః = బాగుగా తెలియదగినది.

అవ॥ గుణముల పరిణామక్రమస్వరూపమును తెలుపుచున్నారు.

తా॥ పరిణామక్రమస్వరూపము - పూర్వక్షణము, ఉత్తరక్షణము రెండు జేరి పరిణామక్రమమును నిరూపించుచున్నవి. ఇదియే పరిణామక్రమమనబడును. క్షణముల పూర్వోత్తరవిచారమువలన పరిణామక్రమము స్పష్టమగుచున్నది. మృత్తిక (మట్టి) పిండముగను (ముద్దగను), ఘటముగను, కపాలముగను (పెంకులుగను), చూర్ణముగను, కణముగను, పాడిలోని లేశముగను పరిణమించుచున్నది. ఈ పరిణామములలో పిండమను నది పూర్వాన్త పరిణామము. అపరాన్తపరిణామము కణమైయున్నది. ఈ ప్రకారము పూర్వాన్తక్షణముచే పూర్వాన్తపరిణామము, అపరాన్తక్షణముచే అపరాన్తపరిణామ

మున్న నిరూపింపబడుచున్నవి. కావున పూర్వోత్తర అవధులను గ్రహించుటచే సూక్ష్మ పరిణామము మొదలు సూక్ష్మతమపరిణామమువరకును పరిణామక్రమము దెలియవచ్చును. ఇంతకు ఫలితార్థ మేమనగా ధర్మమేఘసమాధిచే క్రమముగా గుణముల పరిణామము యొక్క నిలుపుదల యేర్పడుచున్నది. అనిమమగు పరమసూక్ష్మమయిన గుణపరిణామ క్రమరాహిత్యమే ధర్మమేఘసమాధియొక్క యున్నతావస్థను ఫలభూతమునుగా దెలుపుచున్నదని తాత్పర్యము.

**సూ॥ పురుషార్థశూన్యానాం గుణానాం ప్రతిప్రసవః కైవల్యం స్వరూపప్రతిష్ఠా వా చితిశక్తిరితి ॥ 34**

పద॥ పురుషార్థశూన్యానాం - గుణానాం - ప్రతిప్రసవః - కైవల్యం - స్వరూప ప్రతిష్ఠా - వా - చితిశక్తిః - ఇతి.

అర్థము॥ పురుషార్థశూన్యానాం - పురుషార్థ = పురుషునికి (జీవునకు) ప్రయోజనము లయిన భోగాపవర్గములయొక్క, శూన్యానాం = రహితములయిన, గుణానాం = సత్త్వరజస్తమోగుణములయొక్క, ప్రతిప్రసవః = ప్రధానప్రకృతిలోని లయము, కైవల్యం = కైవల్యమగును, వా = మరియొక పక్షమున, చితిశక్తిః = కూటస్థ

నిత్యాసంగ చిత్స్వరూప పరమాత్మస్వభావము, స్వస్వరూపప్రతిష్ఠా = బుద్ధ్యాదుల సమ్బన్ధములేనిదై తనయొక్క స్వరూపమందుండుట, కైవల్యం = కైవల్యమగును, ఇతి = యోగశాస్త్రము సమాప్తము.

అవ॥ త్రిగుణరాహిత్యముచే గలుగు స్వస్వరూపస్థితిని ప్రతిపాదించుచున్నారు.

తా॥ సత్త్వరజస్తమోగుణములును జీవాత్మకు గలుగజేయవలసిన భోగాపవర్గముల పూర్తిజేసి స్వయముగా మూలప్రకృతియందు (ప్రధానమందు) లయించుచున్నవి. ఇట్టి త్రిగుణరాహిత్య స్థితియే కైవల్యమని నుడువుచున్నారు. లేక కూటస్థాసంగ నిత్యపరిశుద్ధానందపరమాత్మ నిరావరణమై, బుద్ధ్యాదులతో సంబంధరహితమై స్వస్వరూపమందుండుటయు కైవల్యమగును. ఫలితార్థము – త్రిగుణములుగూడ నాయాకార్యములజేసి కృతార్థములగుచున్నవి. గుణములు పరిణామరహితములగుచున్నవి. గుణపరిణామమే సమస్తప్రపంచమునకు కారణము. అట్టి గుణపరిణామము ధర్మమేఘసమాధిచే నిలిచిపోవుచున్నది. ఇక పురుషునకు భోగాపవర్గములున్ను పరిసమాప్తములగుచున్నవి. అందుచే ప్రకృతిరహితస్థితి గలుగుచున్నది. ఈ ప్రకారము స్వాత్మాఖండయోగమహిమచే త్రిగుణములు రహితమై త్రిగుణాతీతమైన కూటస్థాసంగ నిత్య చిద్రూపాత్మ బుద్ధ్యాద్యసంగమైన నిత్య శుద్ధ బుద్ధ స్వయంప్రకాశమాన బ్రహ్మానంద స్వస్వరూపమందుంటున్నది.

ఇదియే త్రిగుణాతీత కైవల్యమగును, కేవల స్వస్వరూపస్థితి యగును. ఇతి శబ్దము యోగశాస్త్ర పరిసమాప్తిని తెలుపుచున్నది. యోగశాస్త్ర ప్రయోజనము చిత్తవృత్తి నిరోధము, స్వస్వరూపస్థితి, కైవల్యము.

## శ్రీ గురుసమర్పణము

శ్లో॥ యత్కృపాపోతమాసాద్య సముత్తీర్ణో భవార్ణవాత్ ।
నమోఽస్తు తస్మై గురవే స్వావిద్యాధ్వాన్తభానవే ॥

శ్లో॥ క్వాహం క్వ యోగసరణిగ్గహనార్థా తథాప్యహం ।
శ్రీగురోః కృపయాఽకార్షం వృత్తిం యోగసుధాకరమ్ ॥

శ్లో॥ ఫణీన్ద్రసూత్రగ్రథితా మద్వాఙ్మౌక్తికమాలికా ।
సమర్ప్యతే మయా శ్రీమద్గురోశ్చరణపఙ్కజే ॥

ఇతి శ్రీ పరమహంసపరివ్రాజకాచార్య శ్రీ పరమశివేన్ద్రసరస్వతీపాదాబ్జసేవాపరాయణేన శ్రీ సదాశివేన్ద్రసరస్వత్యా విరచితాయాం శ్రీమత్పతంజలిప్రణీతే యోగశాస్త్రే సాంఖ్యప్రవచనాపరనామధేయే యోగసుధాకరాభిధాయాం వృత్తౌ కైవల్యపాదస్సమాప్తః

శ్లో॥ శ్రీసదాశివబ్రహ్మేన్ద్రస్వామినం మునిపుంగవం।
సదా ధ్యాయే వచస్సిద్ధ్యై యోగవృత్త్యై చచార యః॥

శ్లో॥ శ్రీమత్పతంజలికృతేర్వ్యాఖ్యాణి వివిధాని చ।
సర్వేషాం సారభూతాఽసౌ యోగవృత్తిస్సుధాకరా॥

శ్లో॥ తత్సుధాబిన్దుమానీయ భాషాయాం వితనోమ్యహం।
శ్రీగురోః కృపయా లబ్ధం సర్వం పీయూషసన్నిభమ్॥

ఇతి యోగసుధాస్వాదవ్యాఖ్యా పరిపూర్ణా బభూవ.

ఇత్థం అనాద్యవిద్యావాసనాజాలజటిలభవజలధరఝంఝానిలాయమానానాం శ్రవణ్యే దాంతామృతసంభరితాపారకృపాపారావారాణాం మహర్షిజనతతి తిలకాయమానానాం శ్రీ సద్గురు మలయాళస్వామివర్యాణాం చరణకమలయోరనిశం సేవామధుమధుపస్సదా శ్రీవ్యాసాశ్రమవాసీ శివచరణాభిధః యోగసుధాస్వాదవ్యాఖ్యానమాలాం సమర్పయామాస.

ఓం తత్ సత్